శ్రీ ర స్తు.

# ఆంధ్ర - విక్రమోర్వశీయనాటకము

కాళిదాస సంస్కృతనాటకమున కనువాదము

వేదము వేంకటరాయశాస్త్రి ప్రణీతము.

వివరణసమేతము



చతుర్థ ముద్రణము.

వేదము వేంకటరాయశాస్త్రి అండ్ బ్రదర్స్,

4 మల్లికేశ్వరగుడిసందు, లింగిసెట్టివీథి,

జార్జిటౌను, మదరాసు.

 [వెల రు. 2-0-0

# ఉపోద్ఘాతము.

## కాళిదాసు.

అతని కాలము:—'కవికులగురువును', 'భారతీవిలాసుఁడు'ను నైన కాళిదాస మహాకవి కాలముంగూర్చి పండితులలో భిన్నాభిప్రాయములు కలవు. మనవారు అతని ఖ్యాతినిబట్టియు కవితామహాత్మ్యమును బట్టియు అతఁడు చాల ప్రాచీనుఁడనియు మహనీయుఁడైన భోజరాజు నాస్థానివాఁడనియు ఏవేవో చెప్పుకొందురు. చారిత్రకవిమర్శ తలయెత్తిన తర్వాత మన తొంటి యభిప్రాయములు పెక్కులు మార్పును జెందినవి. పాశ్చాత్యపండితులు కాళిదాసు కాలమును పలువిధముల నిర్ణయించినారు. సర్ : విలియం జోన్సు ప్రభృతులు క్రీ. పూ. మొదటి శతాబ్దమనియు, లాస్సను మొదలైనవారు క్రీ. శ. రెండవ శతాబ్దమనియు, విన్సెంట్ స్మిత్, కీత్ పండితులు క్రీ. శ. నాలుగవ శతాబ్దమనియు, మాక్స్ ముల్లర్ మ్యాక్డోనలు పండితులు క్రీ. శ. ఆఱవ శతాబ్దమనియు నభిప్రాయపడినారు. జ్యోతిర్విదాభరణమందలి 'ధన్వంతరిక్షపణకామరసింహ' ఇత్యాది శ్లోకముచేత నీతఁడొక విక్రమాదిత్యుని యాస్థానివాఁడనియు ఆవిక్రమాదిత్యుఁడు క్రీ. పూ. 57-వ సంవత్సరప్రాంతముననుండిన శకారి విక్రమాదిత్యుఁడనియు అందుచే కాళిదాసుఁడు అప్పటివాఁడనియు శ్రీ జోన్సుగారి యభిప్రాయము, ఇతరులును విక్రమాదిత్యనామముమీఁదనే యాధారపడి ఆ నామధేయముగల రాజులను వెదకి ఏవేవో కారణములచేత కాలనిర్ణయమును చేసిరి. కాని విక్రమాదిత్యుఁడనునది బిరుద నామము. దీనిని వహించినవారు పలువురు. పైగా జ్యోతిర్విదాభరణము కాళిదాసీయమగుట సందేహాస్పదము. ధన్వంతర్యాది నామములలో కొన్ని నామమాత్రములే. అమరసింహుని కాలము ఇంకను నిర్ణీతము

కాలేదు. వరాహమిహిరుఁడు క్రీ. శ. 587 లో నుండినట్లు ఆతని వ్యాఖ్యాతచే తెలియుచున్నది. 'దిఙ్నాగానాం పథి పరిహరన్ స్థూలహస్తావలేపాన్' మొదలైన మేఘసందేశవాక్యములంగొని వ్యాఖ్యాతలు కాళిదాసు దిఙ్నాగాచార్యుల సమకాలికుఁడని యొక చమత్కారమును వెలిబుచ్చిరి. 10 శతాబ్దిలోని వల్లభదేవుఁడు ఈ విషయమునే చెప్పక దక్షిణావర్త మల్లినాథులు (12, 14 శతాబ్దులవారు) ఈ విషయము నుగ్గడించుటచే నిది అనంతర కవికల్పితమని తలంపవలసియున్నది. బౌద్ధ గ్రంథములు దిఙ్నాగ ధర్మకీర్తు లనువారిని అసంగాచార్యుల శిష్యులనుగాను, అసంగాచార్యుని వసుబంధు పండితుని జ్యేష్ఠసోదరునిగాను చెప్పుటచేతను, వసుబంధుని గ్రంథములు చీనవాఙ్మయములోనికి క్రీ. శ. 400 ముందే అనువదితము లగుటచేతను, కాళిదాసు దిఙ్నాగుని సమకాలికుఁడగునేని వరాహమిహిరుని సమకాలికుఁడు కాజాలఁడని తేలుచున్నది. ఇందుచే పై శ్లోకమందలివారి సమకాలీనత సంశయనీయమగుచున్నది. మఱియు కాళిదాసు 'జామిత్ర' 'ఉచ్చ' శబ్దములను ప్రయోగించుటచేత క్రీ. శ. 499 లో నివసించిన ఆర్యభటుని తర్వాతివాఁడని యొక యభిప్రాయము కలదు. కాని 'ఉచ్చ' రామాయణమందే ఉండుటయు, 'జామిత్ర'మునకు మనవారు 'జామిం దుహితరం, త్రాయతే అనియు 'జాయాయాః మిత్రం' అనియు అర్థము చెప్పియుండుటచేతను, మల్లినాథుఁడు 'లగ్నాత్ సప్తమంస్థానమ్' అని టీకించియుండుటచేతను, ఈ వాదము నిలువదు.

మఱికొందఱు కాళిదాసు అశ్వఘోషుని తర్వాతివాఁడుగా నుండవచ్చుననియు, బుద్ధచరితాది గ్రంథములనుండి కాళిదాసు భావములను గ్రహించినాఁడనియు వాదించిరి. గ్రంథములు పరికించువారికి కాళిదాసే పూర్వుఁడని తెలియగలదు. కథాంశ వర్ణనాదికములయందు కాళిదాసుని రచన చాల సహజమై అప్రయత్నపూర్వకము గానున్నది. ఆయా సందర్భములు చక్కఁగా పొందియున్నవి. శబ్దప్రయోగమునందును,

అలంకారాదులలోను, వ్యాకరణ ప్రయోగములందును పాండిత్యోద్ఘాటనకొఱకు కాళిదాసు పాటుపడినట్లు కానరాదు. అశ్వఘోషుని రచనయంతయు ప్రయత్నపూర్వకముగా నుండుటయేగాక అలంకార వ్యాకరణ ప్రయోగముల గారడీవిద్యలచే నిండి కొంత విసుగును సయితము కలిగించుచున్నది.

మఱి మాళవికాగ్నిమిత్రనాటకాంత భరతవాక్యమున కాళిదాసే తా నగ్నిమిత్రునకు సమకాలికుఁడైనట్లు వ్రాసికొనియున్నాఁడు. 'భూవరుఁడగ్నిమిత్త్రుఁడిలఁబ్రోచుచుఁ గాచుచునుండ' అను వాక్యములే ప్రబలాధారముగా గైకొనఁదగును. పుష్యమిత్రునియజ్ఞము వాస్తవముగా జరిగినదేగాని కల్పితముగాదని ధనదేవుని అయోధ్యలోని శాసనమున తెలియుచున్నది అది సముద్రగుప్తుని యశ్వమేధముగానుండునని కొందఱు తలంచినది పొరబాటు వీనింబట్టియు, శాకుంతల విక్రమోర్వశీయ మాళవికాగ్నిమిత్రములయందలి ధర్మశాస్త్ర విషయిక ప్రస్తావములచేతను, శైలీమార్దవముచేతను, అగ్నిమిత్రుని అప్పటి పాలకునిగా పేర్కొనుటచేతను ఈతనికాలము బహుశః క్రీ. పూ. 150 మొదలు 56 మధ్యకాలమని చరిత్రకారుల యభిప్రాయమై యున్నది.

అతనిగ్రంథములు—శాకుంతల విక్రమోర్వశీయ మాళవికాగ్నిమిత్రములు, రఘువంశ కుమారసంభవ మేఘసందేశ ఋతుసంహారములు. జ్యోతిర్విదాభరణాది గ్రంథములు ఇతనికి ఆరోపితములు.

## నాటకకథాసంగ్రహము.

చంద్రుని కుమారుఁడు బుధుఁడు. అతని కుమారుఁడు పురూరవుఁడు, షట్చక్రవర్తులలో నొకఁడు; సూర్యుని దౌహిత్రుఁడు, ఇళాపుత్త్రుఁడు; మధ్యమ లోకపాలకుఁడు. గంగా యమునా సంగమతీరమున ప్రతిష్ఠాన నగరము ఈతని రాజధాని. ఇది 'స్థానాంతరమైనస్వర్గము.' దేవేంద్రుఁడు రాక్షసులతో తనకు 'పోరు ఆసన్నమైనప్పుడు మధ్యమ

లోకంనుంచి ఈయననే సగౌరవంగా రప్పించి విజయసేనమొనలో నియోగిస్తాడు'. ఆ రాజర్షి రథము 'సోమదత్తము, లేడిజెండా తోటిది.'

మహేంద్రుని యప్సరసలలో ఊర్వశి చాల అందగత్తె. "అచ్చరలందఱును నారాయణఋషిని వలపింపవచ్చి అతని తొడనుండి జనించిన యీ రమణినిగాంచి" సిగ్గుజెందిరి. ఈ 'యమృతోపమాంగిని' ఆమహర్షి దేవేంద్రునికి ఒసఁగెను. ఒకప్పుడు ఊర్వశి కుబేరుని యాస్థానికిపోయి నాట్యసేవచేసి చెలులతో మరలి వచ్చుచుండఁగా హిరణ్యపురవాసి కేశి యను దానవుఁడు ఆకస్మికముగాచూచి చిత్రలేఖతోకూడ చెఱఁగొని పోయెను. అంతట మిగిలిన యప్సరసలెల్లరును, ఎవఁడైనను ఆకాశగమనము గల దేవతలపక్షపాతి తమ్ము కాపాడునుగాకయని బిగ్గరగా ఆక్రందింపసాగిరి. ఏలయన హిరణ్యపురమునకు ఆకాశమార్గమున నేఁగవలయును.

ఆసమయమున సూర్యభగవానుని సేవించి తన రాజధానికి పురూరవుఁడు మరలివచ్చుచుండెను. అచ్చరల యార్తనాదము నాలకించి తన పేరుచెప్పి, ఆ రాక్షసుఁడు ఈశాన్యమువైపు పోయినాఁడని తెలిసికొని, వారిని హేమకూట శిఖరముపైనుండి ఎదురుచూడ నియమించి పురూరవుఁడు ఊర్వశీ చిత్రలేఖలను తెచ్చుటకుపోవును. క్షణములో ఆరక్కసుని జయించి ఊర్వశిని చెఱవిడిపించి చిత్రలేఖతో తోడ్కొనివచ్చును. పురూరవునికి కేశిదానవుని జయించుటకు చాలకాలముపట్టలేదు. ఏలన ఊర్వశిని పట్టుకొనఁగానే అప్సరసలు ఆక్రందనముచేసిరి. తత్క్షణమే దానిని వినిన పురూరవుఁడుపోయి ఆమెను విడిపించెను. మూర్ఛపోయిన యూర్వశి రథమందు తేరినది. అప్సరసల సంతోషము వర్ణనాతీతము. ఉర్వశి క్రమముగా మూర్ఛతేరి ఆ రాజునుచూచి, అతనిమీఁద ఆశ జనింపఁగా, ఆ కారణముచేత రాక్షసులు తనకు వాస్తవముగానే ఉపకార మొనర్చినారని తలంచును. రథమందుండగనే ఉర్వశీ పురూరవులకు చక్షుఃప్రీతి మనస్సంగములు ఏర్పడును. పురూరవుని వాక్చమును

విని 'ఇతనివాక్కు ఎంత సాణెముగా నున్నది' అని ఉర్వశి తలంచును. తర్వాత ఎగుడుదిగుడు ప్రదేశమున తేరికుదుపుచేత ఉర్వశి భుజము పురూరవుని భుజమునకు ఒరసికొని రాజు మనసునందు మదనవికార మును కలిగించును. ఉర్వశికి తగిలిన ఆభాగమే తనశరీరమందు ధన్య మనియు, అట్లు రథముదిగుట తన కుపకారకమేయని పురూరవుఁడు తలం చును. రథమునుండి దిగినంతనే అచ్చరలు ఉర్వశిని కౌఁగిలించుకొందురు.

ఆసమయమున తూర్పుదిక్కున మిక్కుటమైన రథవేగంపుశబ్దము వినఁబడును. చూడఁగా చిత్రరథుఁడను గంధర్వరాజును ఆతని సైన్య మును. కేశిదానవుఁడు ఉర్వశిని చెఱఁబట్టినాఁడని నారదులవారివలన విని మహేంద్రుఁడు ఆమెను విడిపించుకొని రావలసినదని గంధర్వసేనకు ఆజ్ఞాపించినాఁడు. గంధర్వులు బయలుదేరివచ్చుచుండఁగా మార్గమధ్య మున చారణులవలన పురూరవుని విజయవృత్తాంతమును విని అతనికడకు వచ్చిరి. అదియే ఆరథశబ్దము. వచ్చుచునే గంధర్వరాజు చిత్రరథుఁడు పురూరవుని స్తుతించి ఇంద్రునికడకు ఉర్వశితో ఆతనినే రమ్మనికోరును. అతఁడు రాకపోఁగా ఉర్వశ్యాదులనుతోడ్కొని ఇంద్రలోకమునకు బయలుదేరిపోవును. తీగకొమ్మకు తనయేకావళి తగుల్కొన్నదని ఉర్వశి క్షణము నిలిచి పురూరవుని సాభిప్రాయముగా చూచుచుపోవును. దాని యభిప్రాయము చిత్రలేఖ గ్రహించును. పురూరవుఁడును మదనవికార మునకు పాలగును.

పురూరవునిరాణి, కాశిరాజపుత్రి, ఔశీనరి, సూర్యోపస్థానము నుండి వచ్చినదిమొదలు ప్రభువు అన్యాసక్తుఁడుగా నగపడుచున్నందున అందులకు కారణము వెదుకసాగును. చేటిని, నిపుణికను, విదూషకునితో మాటలాడి మెల్లగా నాతని నోటినుండి రహస్యమును లాగుమని పంపును. విదూషకుఁడు రాజరహస్యమును దాఁచుకొనలేక కష్టపడు చుండును. నిపుణిక విదూషకుని సమీపించి మంచిమాటలతో ఇట్లు చెప్పును: 'ఎవతెమీఁద రాజు ఉత్కంఠితుఁడుగా నున్నాఁడో ఆమెపేర

దేవిని పలకరించినాడు' అని. ఆమాటవిని రాజే తన రహస్యమును బయలుపరిచినాడని తలంచి విదూషకుడు 'ఏమీ, ఉర్వశీ అని పిలిచి నాడా, దేవిని' అని యడిగి రహస్యమును బయటవేయును. నిపుణిక రహస్యమును భేదించి సంతోషముతో పోవును. విదూషకుడు రాజును చూడబోవును.

రాజు ఉర్వశినే తలంచుచుండును విదూషకుడు అతనిని వినోదింపజేయుచుండును. 'రహస్యమును కాచుచున్నావా' యని రాజు అడుగగా విదూషకుడు ఆదాసి తన్ను మోసము చేసినదని గ్రహించును. తర్వాత కొంత సేపు ఉర్వశీవర్ణనలో నిరువురును కాలము గడపుచు ప్రమదవనమునకు పోవుదురు. ఆవనమందలి వసంతశోభ పురూరవుని విరహవేదనను ఇనుమడింపజేయును.

ఇంతలో ఆకాశమార్గమున ఉర్వశి పురూరవుని కడకు బయలుదేరును. చిత్రలేఖ అనుగమించును. పూర్వము కేశిదానవునికడనుండి విడుపొంది స్వర్గమునకు మరలివచ్చినప్పుడు, బృహస్పతి మరల ఇట్టి యాపదలు రాకుండ నామెకును చిత్రలేఖకును అపరాజిత యనుపేరి శిఖాబంధనవిద్యను ఉపదేశించెను. అందుచే మంత్రమును ఉచ్చరించుచు జుట్టు ముడివేసికొనినయెడల ఆముడి వీడనంతవఱకు దేవదానవులకు అలంఘనీయలగుదురు. ఆవిద్యాబలముచే మరల అసురభయము లేక వారు సంచరింప మొదలిడి పురూరవునికడకు తామే బయలుదేరుదురు. క్షణములో నాకాశమార్గమున ప్రతిష్ఠాన నగరమునకువచ్చి రాజగృహమును ప్రవేశింతురు. పురూరవుని వెదకుచు నందనవనమును ప్రవేశించి పురూరవుని ప్రేమాలాపములను అంతర్ధానముగానుండి విందురు. పురూరవుడు తన్నుద్దేశించి యిట్లు కష్టపడుచున్నాడని గ్రహించి ఉర్వశి సంతోషించును. పురూరవుడు విరహముచే ఏమేమో చెప్పుచుండగా ఉర్వశి ఆ మదన వాక్యములకు బదులు మదనలేఖను రచించిన భూర్జపత్రమును పురూరవునిముందు వేయును. దానిని చదువుకొని పురూరవుడానందించి

విదూషకునికిచ్చి భద్రపరుపుమని చెప్పును. ఊర్వశి అతనిచెంతకేఁగ తమక పడును. చిత్రలేఖ తాను ముందుగానేఁగి రాజున కగపడును; ఊర్వశి వలపును నివేదించి రాజుకడకు ఊర్వశిని కొనిపోవును. ఊర్వశీ పురూరవులు ఒకటి రెండుమాటలు ఆడుకొనులోపలనే దేవదూత ఊర్వశీ చిత్రలేఖలను త్వరగా ఇంద్రలోకమునకు పొమ్మని ఆకాశమునుండి పలుకును. ఏలయన భరతముని నేర్పిన ప్రయోగమును చూడఁగోరుచు లోకపాలురును ఇంద్రుఁడును కాచుకొనియుండిరి. ఊర్వశీ చిత్రలేఖలు చింతతో రాజు ననుజ్ఞనంది వెడలిపోవుదురు.

వారు అటుపోఁగానే రాజు ఊర్వశి వ్రాసిన యా భూర్జపత్రమును తెమ్మని విదూషకుని యడుగును. విదూషకుని యజాగ్రతచేత ఆమదన లేఖ గాలికి కొట్టుకొనిపోవును. రాజడుగఁగా నదిపోయినదని విదూషకుఁడు వెదకును. ఇంతలో పట్టమహిషి ఔశీనరి నిపుణికతో రాజును చూడవచ్చి త్రోవలో భూర్జపత్రమునుచూచి చదువుకొని రాజుకడకు వచ్చి దానినే రాజునకిచ్చును. రాజు తనదోషము కప్పుకొన యత్నించునుగాని రాణి కోపగించి వెడలిపోవును. రాజు స్నానభోజనాదులకు లేచును.

ఇంతలో దేవేంద్రుని మందిరమున నొకవిశేషము జరుగును. సరస్వతీదేవి స్వీయముగా లక్ష్మీస్వయంవరమను నాటకమును వ్రాయఁగా దానిని ఆడించుటకు భరతముని ఊర్వశ్యాద్యప్సరసలను శిక్షించి ఊర్వశిచేత లక్ష్మీవేషము వేయించుచుండఁగా నొకపొరబాటు జరుగును. 'ఎవరిమీఁద నీమనస్సు తగులుకొంటుంది' అను వాక్యమునకు 'పురుషోత్తమునిమీఁద' అనిబదులు చెప్పవలసియుండఁగా ఊర్వశి పరధ్యానమున తనమనస్సులోని విషయమును వెలువరించి 'పురూరవునిమీఁద' అని చెప్పును. వెంటనే గురువుగారికి కోపమువచ్చి 'నీవు నా ఉపదేశంనుంచి అతిక్రమించిన కారణంచేత నీకు దివ్యస్థానం ఉండదు' అని శపింతురు. మహేంద్రుఁడు కనికరించి ఇట్లనుగ్రహించును, "ఎవనిమీఁద నీమనసు

తగులుకొన్నదో ఆతఁడు నాకు రణసహాయుఁడు, రాజర్షి; అతనికి ప్రియము చేయవలెను కనుక నీవు, ఆయనను పురూరవుని, అతఁడు నీవలన సంతానవంతుఁడు అగునందాఁక యథేచ్ఛముగా కూడుము" అని. ఇది ఉర్వశికి మంచిదేయైనది.

ఇచ్చట ప్రతిష్ఠానమున దేవి కాశిరాజపుత్రి ప్రియానుప్రసాదనము అను వ్రతమునుపూని అలుక నుజ్జగించి రాజును అనుజ్ఞ వేడి వ్రతమాచరించును. సంధ్యాజపమును ముగించుకొని రాజు మందిరోద్యానమును ప్రవేశించుచుండ కంచుకియేఁగి దేవిమాటగా రాజును మణిహర్మ్యముమీఁద రోహిణీచంద్రసంయోగమగునందాఁక తన్ను (రాణిని) ఎదురుచూచుచుండ ప్రార్థించును. రాజు మణిహర్మ్యము కడ కేగును.

చంద్రోదయానంతరము రాజు ఉర్వశీ చింతాధీనుఁడుగా నుండఁగా ఉర్వశీచిత్రరేఖలు అచటికివత్తురు. పురూరవుని యాలాపములను వినుచు ఆతని దరియనుండునంతలో దేవి ఔశీనరి అచ్చటికివచ్చును. ఉర్వశీచిత్రరేఖలు అంతర్ధానముననుండి చూచుచుండ రాణిచంద్రపాదములను పూజించి, విదూషకునికి స్వస్తివాచనమిచ్చి రాజును పూజించును. తర్వాత ఇట్లు చెప్పును—"నేను ఈ దేవతాదంపతులను రోహిణీవారిణాంకులను సాక్షీకరించి ఆర్యపుత్రుని అనుప్రసన్నుని చేస్తున్నాను. ఇదిమొదలు ఏ చెలువను ఆర్యపుత్రుఁడు వేడునో, ఎవతె ఆర్యపుత్రుని సమాగమానికి ఉవ్విళ్లూరుతుందో ఆచెలువతో నేను ప్రేమబంధముతో వర్తింపవలయును" అని.

ఈమాటలకు ఉర్వశి సంతోషాశ్చర్యముల పాలగును. రాజు ఇదేమో తెలిసికొనలేక దేవికి ఇంకను కోపమేమోయని యనుమానించును. కాని పతివ్రత కావున ఆమె భర్తను స్వతంత్రునిగా వదలివేసినది. రాజునకు ఉర్వశిమీఁద ప్రేమ మిక్కుటము. దేవిపోఁగానే ఉర్వశిని ఆతఁడు తలంచును. ఆపొంతనేయున్న ఉర్వశియు దానిని వినును. "ఉర్వశి తనయందెల రవళిచే నావీనులకు విందొనర్చునా, మెల్లగా నా

వెనుకవచ్చి నాకన్నులు మూయుమా" అని ఈవిధముగా రాజు తలంచుచుండగా ఆయచ్చర వెనుకప్రక్కగావచ్చి రాజుకన్నులను మూయును. అంతట రాజు ఉర్వశిని గ్రహింపఁగా చిత్రలేఖ వెడలిపోవుచు తాను వేసవిలో సూర్యభగవానుని ఉపాసించవలసియున్నందున మాటికి సఖి దర్శనమునకు రావలనుకాదనియు తనచెలి స్వర్గమును స్మరింపకుండులాగున రాజు చేయవలసినదనియు పలికి వెడలిపోవును. రాజు తనకోరిక తీరుటచే ఉర్వశితో సుఖములం దేలుచుండును.

అచ్చరలు వంతుప్రకారము సూర్యభగవంతుని ఉపాసింతురు. ఆ ప్రకారము చిత్రలేఖ తన వంతుపనిచేయుటకు పోఁగా నిచట ప్రతిష్ఠానమున పురూరవుఁడు ఉర్వశితోకూడి నానాభోగములను అనుభవించుచు రాజ్యభారమును మంత్రులమీఁదనుంచి విహారార్థము ఒకప్పుడు గంధమాదనవనమునకు బయలుదేరి పోయెను. అచట మిన్నేటియిసుకతిన్నెలలో విహరించుచుండిన ఉదయవతియను విద్యాధరకన్యను ఆరాజర్షి తేరిచూచును. అంతమాత్రమునకే ఉర్వశి అలిగి రాజు ఎంత బతిమాలుకొన్నను వినక, శాపవశమున, స్త్రీలు ప్రవేశింపరాని కుమారవనమును ప్రవేశించును. కుమారస్వామి ఆవనమున తపమొనర్చుచు అందు ప్రవేశించు స్త్రీలచే తనకు తపోభంగమగునని అటువచ్చు స్త్రీలెల్ల తీగెలగుదురనియు గౌరీచరణ సంజాతమయిన మణిచేత తప్ప తొంటిరూపమును పొందరనియు శపించియుండెను. ఆప్రకారమే ఉర్వశి ఆవనమందు ప్రవేశించినంతటనే తీగెగా మారిపోయినది. రాజు ఈవిషయము తెలియక ప్రియతమను వెదకుచు ఉన్మత్తుఁడై ఆవనమందు సంచరింపఁదొడంగెను.

పురూరవుఁడు ఉన్మత్తుఁడై ఆవనమందు పరిభ్రమించుచు తరుగుల్మలతాదులను, పశుపక్ష్యాదులను, గిరి నిర్ఝరములను తనకాంతస్థితి నడుగుచు కొంతకాలము గడపిన యనంతరము ఎవఁడో 'భగవానుఁడు, మృగచారి' కనికరించి సంగమనీయమనుపేరి యామణినొసంగి దానిచే "దయితజనసంగమంబు పరగఁ దోడ్తోఁ" అని అనుగ్రహించిపోవును.

మణినిఁ కైకొని పురూరవుఁడు దానిమహిమచే ఏలతగా తన ప్రియమూరి నదో ఆలతనే ఉన్మత్తావస్థలో కౌఁగిలించికొనఁగా నయ్యది వెంటనే ఉర్వశీరూపమును తాల్చును. ఉర్వశి పూర్వరూపముఁనంది తాను లత యైన విషయమును, కుమారస్వామి శాపమును, సంగమనీయమనుమణిచే తప్ప శాపావసానము లేమిని చెప్పఁగా పురూరవుఁడు ఆమణినే ప్రియకు చూపి అదియే పునస్సమాగమకారణ మని వచించును. వెంటనే ఇరువు రును సంతసించి ప్రతిష్ఠానమునకుం బోవుదురు.

ఈయిడుమగడచి కొంతకాలము సుఖముండఁగా ఉర్వశి గర్భము దాల్చెను. ఆయమ గర్భలక్షణములను చూచుచుండియు పురూరవుఁడు దానిని గ్రహింపలేదు. తటాలున నొకప్పుడు ఉర్వశి కృశించిన విషయ మును గుర్తించెనేగాని ఆయమ ప్రసవించిన విషయమును ఎఱుంగ లేదు. ఇందులకు కారణము ఉర్వశి తన గర్భధారణ ప్రసవాదులను పురూరవునకు తెలియక దాఁచుటయే. పూర్వము దేవేంద్రుఁడు 'పుత్రో దయమై కుమారుని పురూరవుఁడు చూచునందాఁక నీవు ఆరాజుకడ నుండుము' అనిగదా యానతిచ్చెను. త్వరగా రాజును వదలుట కిచ్చ గింపక కుమారజన్మవృత్తాంతమును రాజునకు తెలియనీయక దాఁచినది. ఈమెకు ప్రసవమైనకాలమున నైమిశేయయాగమిషచే రాజీమెను ఎడఁ బాయవలసివచ్చెను. ఈవిషయము రాజెఱుఁగడు. ఆయువును పుట్టి నప్పుడే చ్యవనమహాముని యాశ్రమమందుండు సత్యవతియను తాపసి కడ తల్లి యిల్లడయుంచినది. 'క్షత్రియకుమారునికి వలసిన జాతకర్మాది విధానమును సర్వమును అతనికి భగవానుఁడు చ్యవనముని గావించి నాఁడు. ఇతరవిద్యలు నేర్పి ధనుర్వేదమందును నేర్పరింగావించినాఁడు.'

పురూరవునికి సకలైశ్వర్యములుండియు ఉర్వశీసహవాసముండి యు కుమారుఁడు లేఁడనుచింత బాధించుచుండెను. ఒకానొక విశేషదిన మున గంగా యమునా భగవతులకూడలిలో దేవేరులతో స్నానమాడి రాచగుడారముం బ్రవేశించును. రాజు వస్త్రధారణము ముగించు

లోపల అంతఃపురములో పరిజనులు గోలయిడసాగిరి. సంగమనీయమను సామణిని బంగారపు దారములో కూర్చినదానిని విసనకఱ్ఱమీఁద తెల్ల పట్టువస్త్రముపైనుంచి ఎవరో తెచ్చుచుండగా మాంసమనుభ్రమచే గ్రద్ద తటాలునవాలి తన్నుకొనిపోవును. కలకలమునువిని రాజు వేషధారణము ముగియకయే వచ్చును. హారమును తన్నుకొనిపోవుగ్రద్దను చూచి ధనుర్బాణములు తెమ్మనిచెప్పును. అవి వచ్చులోపల పక్షి చాల దూరముపోవును. బాణము అంతదూరము పాఱదని రాజు, సాయంకాలము గూటికివచ్చునప్పుడు ఆపక్షినిపట్టుమని నాగరికునికి ఆజ్ఞయిడును. ఆమణి కేవలము రత్నమాత్రమనుటచేత కాదుగాని సంగమనీయమగుటచేత రాజునకు చాల ప్రియమైనది.

ఇంతలో నెవరో బాణముతో ఆపులుగును కొట్టిరనియు, పులుగు మణితో నేలఁగూలెననియు ఆబాణమును మణిని కంచుకి తెచ్చియిచ్చును. మణిని పదిలపఱుప నాజ్ఞాపించి ఆబాణమెవనిదో పరీక్షించి తనకుమారుఁడైన ఆయువుదని గ్రహించును. తనకు కుమారుఁడొకఁడు జనించి ఇంత పెద్దవాడైన విషయము ఆశ్చర్యమును కలిగించును. ఆలోచనమీఁద ఉర్వశి యొకప్పుడు గర్భము దాల్చియుండినట్లును తర్వాత తటాలున నామెశరీరము కృశించి క్రమముగా వర్ధిల్లినదనియు నైమిశేయయాగ సమయమునదక్క తానామె నెడబాయలేదనియు జ్ఞాపకమునకు తెచ్చుకొనును. ఏకారణముచేత పుత్త్రజన్మవృత్తాంతమును ఆమె దాఁచియుండునో యని ధ్యానించుచుండఁగా రాజదర్శనమునకు చ్యవనాశ్రమము నుండి తాపసియొకతె రాజకుమారలక్షణు నొకబాలుని తోడ్కొని వచ్చును. ఆబాలునిం గన్నంతనే రాజునకు ఆతనియం దపారవాత్సల్యమును ఆతఁడే తనకుమారుఁడేమోయను సంశయమును కలుగును. తాపసి, ఆబాలుని జనించినవెంటనే ఏకారణముచేతనో ఉర్వశి తనకడ ఇల్లడ యుంచినదనియు అతనికి సకల సంస్కారములను ఋషియే చేసెననియు పలికి ఇట్లు చెప్పును. 'నేడు పుష్పసమిధలకొఱకు ఋషికుమారులతోఁ

గూడ ఇతఁడునువచ్చి ఆశ్రమవిరుద్ధమాచరించినాఁడు. మాంసము తెచ్చు కొని గృద్ధ చెట్టుకొనను వాలుచుండఁగా ఇతఁడు దానిని కొలకు గుఱి చేసినాఁడు. అంతట ఆవృత్తాంతము నెఱింగి భగవంతుఁడు చ్యవనముని, నీచేతి యీయిల్లడను పంపివైపురుని యాజ్ఞాపించినాఁడు. కావున నేను ఉర్వశిని చూడఁగోరుచున్నాను" అని చెప్పును.

ఉర్వశి ప్రవేశించి తన పుత్త్రుంగని సంతోషించి తాపసికి మ్రొక్కును. తాపసియు ఆయిల్లడను అప్పగించి వెడలిపోవును. ఇంతలో ఉర్వశిశాపావసానమును స్మరించి మేచ్చురు. రాజడుగఁగా "ఎప్పుడు ఈతడు నా ప్రియసఖుడు రాజర్షి నీయందు జనించిన వంశకరుని ముఖము చూస్తాడో అప్పుడు నీవు మళ్లీ నాసమీపానికి రావలశినది—అని మహేంద్రుడు ఆజ్ఞాపించెను. అందువల్ల నేను మహారాజవియోగానికి వెఱచినదాననై జాతమాత్రుని వీనిని విద్యాప్రాప్తి నిమిత్తమై చ్యవన భగవంతుని యాశ్రమవనంలో సత్యవతమ్మచేతిలో అప్రకాశంగా ఇల్లడవుంచితిని. ఇప్పుడు తండ్రిని కొలవడానికి సమర్థుడయినాడని ఆలో చించుకొని ఆమె మళ్లీ నాకు దీర్ఘాయువును అప్పగించింది. కనక నాకు ఇంతపాటియే మహారాజుతోటి సంవాదము" అని ఉర్వశి బదులు చెప్పి శోకించును.

ఉర్వశి రాజునువదలి ఇంద్రసేవార్థముపోనుండఁగా రాజు తపో వనమేఁగ సంకల్పించుకొని కుమారుని యౌవరాజ్యాభిషేక ప్రయత్న ములుచేయును. ఇంతలో నారదమహర్షి వచ్చి నమస్కరించిన యుర్వశీ పురూరవులను 'ఎడబాయని దంపతుల రగుఁడు' అని యాశీర్వదించును. రాజు 'ఈయాశీర్వచనము నిజముకాగూడదా' యని కోరుచుండఁగా మహర్షి ఇంద్రసందేశము నిట్లుచెప్పును—'త్రైకాల్యదర్శులు మునులు ఆదేశించినారు - సురాసురసంగ్రామము కలుగనున్నదని. నీవు నాకు యుద్ధములలో గడిదేరిన సహాయుఁడవు. కావున, నీవు ఇప్పుడు శస్త్ర సన్న్యాసము చేయగూడదు. ఈయుర్వశియు యావజ్జీవము నీకు సహ

ధర్మచారిణిగా నుండవలసినది" అని. అంతట ఇంద్రుఁడు పంపిన యౌవ రాజ్యాభిషేకసంభారములను అప్సరసలు సంతోషమున తేఁగా మహర్షియే కుమారునకు యౌవరాజ్యాభిషేకము సేయఁగా శాశ్వతముగా నుర్వశినిపొంది పురూరవుఁడు ఇంద్రుని చెంతకేఁగి సుఖముండును.

## కాళిదాసుని నాటకరచనకు ఆధారములు.

కాళిదాసు ఈనాటకమును రచించుటకు ఆధారములేవో ఊహింప వలసియున్నది. ఉర్వశీ పురూరవసంవాదము ఋగ్వేదమందే కలదు. (X 95) అందు పురూరవుఁడు ఉర్వశిని వివాహార్థము ప్రార్థించును. విష్ణు పురాణమున కొన్ని వివరములు కనఁబడుచున్నవి. మిత్రావరుణులచే శప్తయై ఉర్వశి భూలోకమునకు వచ్చి పురూరవునివలచి కొన్ని నియమముల ప్రకారము ఆతనికడనుండ నంగీకరించెను. నియమము—ఉర్వశి యొక్క రెండు మేషములను పురూరవుఁడు కాపాడుట, నిరంతరము ఉర్వశిని ఎడఁబాయకుండుట, ఎప్పుడును నగ్నముగా ఆమెకు గోచరింప కుండుట, ఉర్వశి కేవలము నేతినే భుజించియుండుట ఒప్పుకొనుట, కొంతకాలమునకు ఉర్వశిలేమిచే దేవతలు వెతఁజెంది మరల నామెను దివికిరప్పింపగోరిరి. విశ్వావసువు గంధర్వులతో నొకరాత్రి ఉర్వశీ శయనాగారమును ప్రవేశించి ఆమేషములను హరింపఁబోఁగా నవి అఱచుటచే ఉర్వశీ పురూరవులు మేల్కొని విశ్వావసువును గంధర్వులను వెంబడించి మరల మేషములను తెచ్చుకొనిరి. మెఱుపులచే నీ సందడిలో వస్త్రహీనుఁడుగా త్వరచే వచ్చిన పురూరవుంజూచి నియమోల్లంఘనమైనదని ఉర్వశి అతని వదలిపోవును. దుఃఖముచే పురూరవుఁడు దేశములు సంచరించి తుదకు కురుక్షేత్రమందుచూచి ప్రార్థింపఁగా సంవత్సరమునకు ఒకదినము ఆతనితో నుండుటకు ఉర్వశి ఒప్పుకొనెను. కాని శాశ్వతముగా ఉర్వశిని తానేపొందఁగోరి గంధర్వులను ప్రార్థింపఁగా వారొక అగ్నిస్థాలినిచ్చి దానినే నిరంతరము సేవించుచుండిన ఉర్వశి అతనికి దక్కుననిరి. దారిలో నాతఁడు విసుగుఁజెంది ఆస్థాలిని ఒకచోట

పాఱవేసిపోయెను. మరల పశ్చాత్తప్తుడై పోయిచూడఁగా అచ్చట అశ్వత్థ శమీవృక్షములు మొలచియుండుటనుచూచి వానిలోనుండి చెటియొక గొమ్మను కొనిపోయి పెక్కుయజ్ఞములుచేసి మరల ఊర్వశిని శాశ్వతముగా పొందెను. తర్వాత వారలకు ఎనమండ్రు పుత్త్రులుదయించిరి.

కథాసరిత్సాగరము నిట్లు కలదు—పూర్వము నందనవనమున ఊర్వశి విష్ణుభక్తుని పురూరవునిచూచి కామించెను. రాజును ఆమెయందు ఆసఁగొనెను. మహావిష్ణువంతట నారదునిపంపి ఊర్వశిని పురూరవుని కొసంగ దేవేంద్రుని కోరెను. ఇంద్రుఁడు అంగీకరించి పంపఁగా ఊర్వశీ పురూరవులు సుఖముండిరి ఇంతలో మాయాధరుఁడను రాక్షసునితో ఇంద్రునికి యుద్ధము రాఁగా పురూరవుఁడుపోయి అసురులను జయించెను. విజయోత్సవ సందర్భమున రంభ నృత్యమొనరించుచుండ చూచి దోషమునుకనిపట్టి పురూరవుఁడు ఇంచుక నవ్వెను. రంభ కోపగించి మనుష్యునికి నీకు దేవనృత్యమేమి తెలియునని ఆక్షేపింపఁగా, ఊర్వశీ సహవాసముచే తనకు తుంబురునికన్నను విశేషము తెలియునని ఆరాజు బదులు చెప్పెను. అంతట తుంబురుఁడు కోపగించి మహావిష్ణువును తృప్తిపఱచువఱకు ఊర్వశీవియోగము పురూరవునకు కలుగునట్లు శపించెను. అంతట రాజు బదరికాశ్రమమున మహావిష్ణువును తపస్సుచే ప్రసన్నుని చేసికొని మరల ఊర్వశిని పొందెను.

మత్స్యపురాణకథ – ఊర్వశీవాసీయమునకు చేరువుగా నున్నది. పురూరవుఁడు అనుదినము ఇంద్రదర్శనమునకు ఏగుచుండెను. ఒకప్పుడు ఊర్వశీ ఘృతాచులను కేశిదానవుఁడు పట్టుకొనిపోఁగా వాయవ్యాస్త్రముచే వానినికొట్టి వారిని విడిపించి ఇంద్రునికి ప్రియమాచరించెను. అదిమొదలు ఇంద్రునికి ఎక్కుడు స్నేహితుఁడాయెను. ఒకప్పుడు లక్ష్మీస్వయంవరమను నాటకమును భరతమహర్షి ఆడించుచుండగా పురూరవుఁడు చూచుచుండెను. ఆతనింజూచుచు ఊర్వశివలపుచే పాఠమెల్ల

మఱచి ఆటను పాడుచేయఁగా ఏబదియైదేండ్లు లతగానుండుమనియు అచటనే పురూరవుఁడు పిశాచముగానుండుననియు ఆచార్యుఁడు ఆమెను శపించెను. తర్వాత ఉర్వశి పురూరవునింజేరి ఎనమండుగురు కుమారులను కనెను.

ఈకథయే కాళిదాసుని నాటకకథకు చేర్పుగా నున్నది. కేశిదానవుఁడు ఇందునుకలఁడు. వానిని పురూరవుఁడు కొట్టినది వాయవ్యాస్త్రముతోనే. ఘృతాచికిబదులు చిత్రలేఖను కాళిదాసు పెట్టినాఁడు. చిత్రరథుఁడు, గంధర్వరాజు క్రొత్తపాత్ర. నారదుఁడు ఇందు కొంత పని చేయును కథానన్ని వేశములలో కొంతమార్పుకలదు. ఉర్వశీ పురూరవుల యనురాగము రథములో సాహచర్యముచే నేర్పడుట మనోహరము లక్ష్మీస్వయంవర నాటకమును ప్రదర్శించునపుడు పురూరవుఁడు లేఁడుగాని పరధ్యానముగా నుర్వశి పురుషోత్తమఁడనుటకుబదులు పురూరవుఁడనుట చాల ఒప్పియున్నది. గురువర్యునిశాపము వేఱుతీరుగా నున్నది—దివ్యత్వము మాత్రమే తప్పుట. ఇంద్రుఁడు పురుషాంతరవేదిగావున, రాజునకు పుత్రదర్శనముగునందాక అతనికడనుండుమని కనికరము చూపును. ఈశాపము లాభకారియేయైనది. కుమారవనమున విహారమును కుమారశాపముచే ఉర్వశి లతగామారుటయు సంగమనీయమును మణిచే పునస్సమాగమమును, ఆయువు జనించుట, అతఁడు యుక్తవయస్కుఁడగువఱకు చ్యవనాశ్రమమున సత్యవతికడ ఎదుగుటయు, గ్రద్దను కూలనేసినమిషచే రాజుకడకువచ్చుటయు, ఉర్వశి తనకు శాపముతీరినదని శోకించుటయు, ఇంద్రుఁడు మరల దేవాసుర సంగ్రామమునకు సహాయము చేయుటకై ఉర్వశిని స్థిరముగానే పురూరవుని కిచ్చివేయుటయు—అంతేయు చాల సహజముగా నేర్పడిన విషయములవలె కనఁబడుచు మనోహరముగా నున్నది; ఇట్టి కల్పన కాళిదాసునకేగాని అనితరసాధ్యమని తలపించుచున్నది.

## నాటకమందలి స్త్రీపురుషుల విమర్శ.

పురూరవుఁడు కథానాయకుఁడు, చంద్రుని పౌత్త్రుఁడు, బుధుని కుమారుఁడు, సూర్యుని దౌహిత్త్రుఁడు షట్చక్రవర్తులలో నొకఁడు, మధ్యమలోకపాలకుఁడు. "యమునతో కూడడంచేత విశేషపావనము లైన భాగీరథీ భగవతి నీళ్లలో తన్ను తాను చూచుకొంటూవున్న ప్రతిష్ఠాననగరము ఈతని రాజధాని. ఇది "స్థానాంతరమైన స్వర్గము." "పోరు ఆసన్నమైనప్పుడు మహేంద్రుడు మధ్యమలోకంనుంచి ఈయననే సగౌరవంగా రప్పించి విజయసేనమొనలో నియోగిస్తాడు" ఆ రాజర్షి రథము సోమదత్తము, లేడిజెండాతోటిది. "అతడు పోయినపనిని సాధించక మరలడు." "మహేంద్రునితో సమానుఁడైన రాజర్షి" "వేల్పులమీద పక్షపాతంగలవాడు ఆకాశగమనం గలవాడు" ఇంద్రునికడకు స్వయముగావచ్చి ఉర్వశిని అప్పగింపుమని చిత్రరథుఁడు కోరఁగా నిరాకరించెను. కారణము ఇంద్రుఁడుచేయు మర్యాదలపై ఆశలేకపోవుటయే. మహేంద్రుని ఉపకరించుటకు చాలిన పరాక్రమముండియు గర్వములేనివాఁడు. 'ప్రియాకళత్త్రుఁడు'. ఇతనివాక్కు 'నాణెము'గానుండును. ఉర్వశిపై ప్రథమ దర్శనముచేతను రథమందు స్పర్శచేతను అనురాగముదయించును. ఉర్వశియు తన యనురాగమును ప్రకటించుటచే నిది బలిష్ఠమగును. విదూషకుఁడు ఓదార్పఁగా అతని యందు గౌరవమునుచూపి బ్రాహ్మణవచనమును ప్రతిగ్రహించును. ఉర్వశిమీఁద ఎంత వలపుండినను 'వెలిక యానకు అడ్డుపడువాఁడు' కాఁడు. వెలన ఉర్వశి నాటకమాడుటకు పోవలసివచ్చినప్పుడు అడ్డు చెప్ప లేకపోయెను. కాని రాణియైన ఔశీనరియందు గౌరవముగలవాఁడు భూర్జపత్త్రము ఉర్వశీ స్వహస్తము రాణిచేతఁబడినప్పుడు రాజు రాణిని క్షమింప వేఁడును. రాణి కోపగించి వెడలిపోయిన వెనుక 'నీకిది అనుకూలమే' అని విదూషకుఁడు పలికినందులకు రాజు 'అట్లుగాదు. నా మనసు ఉర్వశిని తగులుకొన్నను, నాకు దేవియందు ఆ యొప్పటిబహు

మూసమే. కాని నా ప్రణిపాతమును అతిక్రమించినది గావున నేను దేవి విషయమున ధైర్య మవలంబించెదను' అని బదులుచెప్పును. తరావాత దేవి వ్రతమును ప్రారంభింపఁగా నది 'దేవి పశ్చాత్తాపంపొందినదై తన ప్రణిపాతపు ఉల్లంఘనాన్ని వ్రతమిష చేత తుడిచివెయ్యడానికి కోరుతున్న ది' అను విదూషకునిమాటను వాస్తవమని ఒప్పుకొనును. దేవిని 'మహానీయురాలు' అని పేర్కొనును. సాధారణముగా అన్యనాయికలయం దాసక్తు లట్లుండరుగదా 'ప్రేముడి ఒరులపాలయినపుడు నాగరకులు అధికంగా దాక్షిణ్యముచూపుతారు' అని చిత్రలేఖ పల్కినను రాజునకు రాణియందు ఒకపాటి దాక్షిణ్యము లేకపోలేదు. అట్లే ఉర్వశియందు ప్రేమయు తగ్గలేదు. దేవి పోఁగానే 'దేవి దూరముపోయి యుండదు... ...ఊతి ఉర్వశి యేమయినా' అని ఉర్వశిని తలంచును. ఉర్వశీసమాగమముచే చాల సంతోషించును. ఇంతటి గొప్పరాజర్షి గంధమాదనవనమున విహరించుచున్న తఱిని "మిన్నేటి ఇసుకదిన్నెలలో క్రీడిస్తూ ఉన్న ఉదయవతి అనే విద్యాధరకన్యకను తేరిచూచినాఁడు." ఆపాటికే అలిగి ఉర్వశి 'కాంతుఁడు ఎంత బతిమాలుకొన్నా మెత్తబడక' కుమారవనముచొచ్చి తీగయైపోయినది. ఆతఁడు ఆప్రియతమను వెదకుచు రేయుంబవలు ఆవనమందు గడపి సంగమనీయముచే మరల ఉర్వశిఁబొంది తన రాజధానింజేరును ఇతనికి ప్రకృతులు అనుకూలురు. తుదకు సంగమనీయమును గ్రద్ద తన్నుకొనిపోయి ఆకారణముచే ఆయువు ఆశ్రమమును వదలుటయు, ఉర్వశి తన్నువదలి స్వర్గమునకు ఇంద్రసేవార్థము పోవుటకు సంసిద్ధయగుటయు, ననుపరిస్థితి యేర్పడఁగా పురూరవుఁడు తపోవనమునుచేరుట కుద్యమించును. ఇంతలో నారద మహర్షివచ్చి ఇంద్రసందేశమును తెలిపి పురూరవునికి శాశ్వతముగానే ఉర్వశినొసంగును.

మాణవకుఁడు, విదూషకుఁడు; 'మహాబ్రాహ్మణుఁడు.' రాజునకు అనుచరుఁడు, నర్మసచివుఁడు. 'రాజరహస్యంచేత పైకి పిగులుచున్న

వాఁడై 'జనులునిండినచోట తననాలికని కట్టివేసుకో' లేఁడు' 'సన్నని గరిక పోచకానున్న మంచుబొట్టులాగ ఇతని నాలికలో రహస్యము చాల సేపు ఉండదు" "చెడుచేటినిచూడగానే ఆరాజరహస్యము హృద యాన్ని భేదించుకొని వెడలు"ను. నిపుణికయు ఉపాయముగా రహస్య మును భేదించి వెడలును. రాజునుచూచినతర్వాత "రహస్యనిక్షేపమును కాచుచున్నావా" అని రాజడుగఁగా అప్పుడు ఆదాసి తన్ను మోస పుచ్చినదని తెలిసికొనును. రాజును వినోదపెట్టుటకు వంటయింటికి పో మ్మనును. ఇతనికి 'పంచవిధభక్ష్యాలని దానిదాని సంభారాలతో కూరుస్తూ వుండడం చూస్తూవుంటే ఉత్కంఠ తీరుతుంది' ఎప్పుడును తిండిమీఁదనే దృష్టి. "మూర్ఖుఁడు అన్నిటను ప్రమాదియే" ఏలన రాజు దాఁచుట కిచ్చిన భూర్జపత్రమును గాలికి జారవిడుచును. దానిని రా జెప్పుడెప్పుడు అడుగునోయని దిగులొందును. రాజును విరహాతురుని నానాసంభాష ణలచే ఓదార్చుచుండును. రాణివచ్చి భూర్జపత్రమునుచూపి రాజును నిందించునప్పుడు తన అవ్యక్తభాషణములచే రాజు దోషమునే వెలికి వేయునుగాని వేఱేమియుచేయ సమర్థుఁడుగాఁడు. 'దొంగసొత్తుతో దొరికినదొంగకు ప్రతివచనం ఉంటుందా' అను నీమాటలచే నీతఁ డెంత బుద్ధిమంతుఁడో విస్పష్టము. అసందర్భముగా మాటలాడుచు నవ్వు పుట్టించుచుండును. నిరంతరము రాజుచెంతనేయుండి రాజును వినోదింప జేయుచుండును. ఈతనిమాటలచే రాజునకు ఉర్వశియందు ప్రేమ అభి వృద్ధియగును.

ఊర్వశి 'నరసఖమునీంద్ర నూరుజ, నాకరమణి' ఆఋషి మహేం ద్రునికి ఈమెను ఇచ్చెను. 'తపోవిశేషపరిశంకితుఁడైన మహేంద్రునికి కోమలాయుధము, రూపగర్వితయైన శ్రీకి గుండె తల్లడము, స్వర్గానికి అలంకారము.' కేశి దానవుఁడు పట్టుకొనినందున 'బిట్టు బెగ్గడిల్లినది.' రాజు విడిపించినవెనుక చాలసేపటికి మూర్ఛ తేరినది మహేంద్రునితో సమానుఁ డైన రాజర్షి తన్ను కాపాడెనని చిత్రలేఖ చెప్పఁగా ప్రౌఢనాయిక గావున

రాజుపై ననురాగముదయించి 'దానవులు నాకు ఉపకారంచేసినారు సుమా' అని తలంచును. రాజు మాటలనువిని 'ఇతనివాక్కు ఎంతనాణెముగా నున్నది. అనియు చెప్పుకొనును. స్వర్వేశ్యగావున నీచేష్టితమెల్లను ఒప్పియున్నది 'తేరికుదుపుచేత' 'అంసమున అంసంబు' ఒరయుటయు ఉర్వశి చిత్రలేఖను 'ఓసరిల్లు'మని కోరఁగా చిత్రలేఖ 'నాకు శక్యంగాదు' అని చెప్పుటయు, స్మితమును, వేశ్యాజనసహజములుగా నున్నవి. శృంగారలజ్జచే ఉర్వశి తానే రాజతో మాటలాడక చిత్రలేఖ మూలముగా మాటలాడుట రమణీయము; అనురాగస్ఫోరకము. గంధర్వులు మింటికెగయఁగా ఉర్వశియొక్క యేకావలి తీఁగవొమ్మకు తగుల్కొనును. చిత్రలేఖచూచి చిఱునగవుతో 'దిట్టముగా తగులుకొన్నది. వదలింప నశక్యమనితోస్తున్నది' అని భావగర్భితముగా చెప్పును అనఁగా రాజుపై ఉర్వశిభావమును చిత్రలేఖ కనిపట్టినది. పోవునపుడు రాజును గాంచి నిట్టూర్పు పుచ్చుచు నిష్క్రమించును ఈమె వేశ్యగావున ఈ వృత్తమెల్ల నీమెకు ఉచితముగానేయున్నది. అందుచేతనే ఉర్వశీ చిత్రలేఖలను రాజు విడిపించుకొని వచ్చినప్పుడు రంభాద్యప్సరసలు 'సచిత్రలేఖను ప్రియసఖి నుర్వశినితోడుకొని విశాఖాసహితుఁడు భగవంతుఁడు చంద్రుఁడువోలె రాజర్షి వచ్చినాడు' అని చెప్పుట. ఈతఁడు తర్వాత ఉర్వశికి భర్త కాగల విషయమునుకూడ ఇది సూచించుచున్నది రాజు ఉర్వశీ రాగాకృష్టుఁడై 'దుర్లభమందు తగులుకొల్పుచున్నాఁడు మన్మథుఁడు' అని తలంచును. తర్వాత రాజు ప్రమదోద్యానమందుండఁగా 'మదనుని నియోగముచేత' ఉర్వశియు, దివ్యగావున, బయలుదేరి పురూరవునికడకు వచ్చును. పురూరవుని యాలాపమునువిని ఆతనికి భూర్జపత్రమందు మదనలేఖ వ్రాసి తర్వాత అతని కగపడును. ఇంతలో భరతశిష్యుఁడు పిలుచుటచే నాటకప్రయోగమునకై ఇంద్రలోకమున కేగును.

లక్ష్మీస్వయంవరమను నాటకప్రదర్శనమందు పొరఁబాటున ఉర్వశి పురుషోత్తముఁ డనుటకు బదులు పురూరవుఁ డనుటయు నందుచే గురువు

శపించుటయు ఇంద్రుఁడు శాపావసానముననుగ్రహించుటయు ఉర్వశికి అనుకూలములే యైనవి.

ఉర్వశి మరల పురూరవునికడకు వచ్చినప్పుడు అతనిరాణి ఔశీనరి, కాశిరాజపుత్రి, చెంత నుండెను. ఆమె రాజు ఉర్వశిలోలుఁడాయెనని ఎఱింగి తొలుత కోపగించినను తర్వాత ప్రియానుప్రసాదమను వ్రతమొనరించి రాజును ఉర్వశికి వదలివేయుటచే ఉర్వశికి మరల మంచిదేయైనది; రాజునకు అనుకూలమే. ఉర్వశి రాజునకు ఔశీనరియందు అనురాగము మిక్కుటమని కొంత అసూయపడినను అసూయా విముఖముగా నిట్లు పలికినది—'ఈమె దేవీశబ్దముచేత ఉపచారమొందుట యుక్తమే. తేజులో శచికి ఏమాత్రము తక్కువకాదు' రాజు దేవిపై నభిమానముచూపినపుడు 'ఈమెయందు ఇతనికి బహుమానము మిక్కుటంగా ఉన్నది' అని కొంత కష్టపడును. చిత్రలేఖ జవాబుచే శాంతించును. రాణి 'రాజు ఏ చెలువనుకోరునో ఆ చెలువతో నేను ప్రేమబంధముతో వర్తింపవలయును' అని చెప్పినప్పుడు ఉర్వశి సంతోషాశ్చర్యముల పాలగును. తర్వాత రాజునుపొంది యథేచ్ఛముగా కొంతకాలముండును.

రాజ్యభారమును మంత్రులమీదనుంచిన రతిసహాయుని ఆ రాజర్షిని తోడ్కొని ఉర్వశి విహారార్థమై గంధమాదనవనమున వెళ్ళినది. అచ్చట ఉదయవతియను కన్యను చూచినాఁడని రాజుపై అలిగినది. తర్వాత కాంతుఁడు ఎంతబతిమాలినను వినక స్త్రీలు చొరరాని కుమారవనమును చొచ్చి లతయై పోయినది. తర్వాత సంగమనీయమను మణిచే పునస్సమాగమము కలుగును. అప్పుడు సంతోషమున రాజుతో నగరికివచ్చును.

తర్వాత కొలదికాలమునకు ఉర్వశి గర్భము ధరించును. గర్భలక్షణములు చూచుచుండియు రాజెఱుఁగలేదు. ఇంతలో నాతఁడు నైమిశేయయాగ మొనరింపనేఁగఁగా ఈలోపల ఉర్వశి ప్రసవించి కుమా

రని వెంటనే చ్యవనాశ్రమమున సత్యవతియను తాపసికడ నిల్లడయుంచి, రాజునకు ఈవిషయమే తెలియనీయక దాఁచెను. ఏలయన పుత్త్రముఖ దర్శనము రాజునకాయెనేని వెంటనే ఉర్వశి పురూరవునివదలి ఇంద్రుని కడ కేగవలసినట్లు నియమము. ఎంతకాలము పుత్త్రముఖదర్శనము రాజు చేయఁడో అంతకాలము మంచిది. ఇట్లు కొన్ని సంవత్సరములు గడచిన యనంతరము ఆకస్మికముగా నొక విశేషదినమున రాజు గంగాయమునల కూడలిలో స్నానమాడి రాచగూడారము ప్రవేశించిన వెంటనే సంగమ నీయమను నామణిని సేవకులు తెచ్చుచుండఁగా గ్రద్ద తన్నుకొనిపోవును. రాజు దానినేయఁబోఁగా నది దూరముపోవును. ఇంతలో చ్యవనాశ్రమ మందలి ఋషికుమారులతో నేగియుండిన ఆరాజపుత్త్రుఁడు ఆయువు బాణముతో ఆగ్రద్దనుకొట్టఁగా రాజభటులు మణినికొనిపోయి బాణ ముతోఁకూడ రాజునకిత్తురు. రాజు ఆబాణములమీఁది యక్షరములను చదువుకొని తనకు కుమారుఁడు పుట్టి పెద్దవాఁడైన విషయమును అప్పుడు గ్రహించును. ఇంతలో చ్యవనాశ్రమమునుండి సత్యవతియే వచ్చి బాలుని అప్పగింపఁగా ఉర్వశి ఈ యాకస్మికసంభవములంజూచి విషాదము నందును. ఇంతలో నారదుఁడు రాజునకు ఇంద్రసందేశమును చెప్పి ఉర్వశీ పురూరవులకు ఎడబాపు లేకుండునట్లు చేయును. ఉర్వశి మాత్రము ఔశీ నరిని మరచిపోలేదు. 'మీదొడ్డమ్మకు నమస్కారముచేయుము' అని చెప్పును. తుదకంతయు సంతోషమే.

ఔశీనరి, కాశిరాజపుత్త్రి. రాణి. రాజు అన్యకాంతాసక్తుఁడయి నందున నీమెకు తొలుత స్త్రీజనసహజమైన ఈర్ష్య జనించినది. తర్వాత, పతివ్రతగావున 'ప్రియానుప్రసాదన'మను వ్రతమొనరించి రాజునకును ఉర్వశికిని స్వేచ్ఛావిహారమునకు అనుజ్ఞ నిచ్చును. ఈమెయందు రాజు నకు అభిమానము మిక్కుటము. 'తేజులో శచికి ఏమాత్రము తీసిపోదు' అని సవతిచేతనే చెప్పించుకొన్న గాంభీర్యవతి.

## కాళిదాసనాటకములలోని గుణములు.

"మాళవికాగ్నిమిత్ర విక్రమోర్వశ్యభిజ్ఞానశాకుంతలములు కాళిదాస నాటకత్రయమని ప్రఖ్యాతముగదా. అందు గుణాతిశయములెల్లను యథోత్తరము పెంపొందియున్నవి. మూడును మదనుని జయభేరులే, మూటను శృంగారమే అంగి. అయినను భేదములు గలవు. మూటను క్రమముగా రాచకన్య, స్వర్వేశ్య, మునికన్యయు, నాయికలు; తొలిదానం గామసిద్ధి కలదు. రెండవదానపుత్త్రోత్పాదనరూపధర్మంబును, మూఁడవదాన ఆరెండింటితోఁగూడ పరిపరిగ్రహాపరాఙ్ముఖతయు ధర్మదార పరిత్యాగజనితానుశయంబును నుత్కటములు. ఏవమాదిగుణాతిశయములచేత శాకుంతలము లోకములో నాటకరాజమయినది. అయినను ఇందును నాయకునియందు స్వార్థపరతయే కనఁబడుచున్నది. ఉత్తరరామచరిత్రములో భవభూతి స్వార్థపరతను అధఃకరించి లోకారాధనవ్రతధ్వజమును స్థాపించినాఁడు. దానంజేసి పెద్దలచిత్తమున నదియే శాకుంతలమునకన్న నుత్కృష్టమైనది. సామగ్రహణక్రమముననే ఈత్రయమున కాళిదాసభారతి ముగ్ధామధ్యాప్రౌఢావస్థలం జూపుచున్నది. దానంజేసి అదియ తద్రచనాక్రమమని తోఁచెడు."

"వీనియందెల్ల చక్షుఃప్రీతిమనస్సంగములు వలసియున్నవి. అందులకు విరళ నేపథ్యమున నృత్తగీతములు రాజకన్య గావున మాళవికకు ఉచితములైనవి ఉర్వశియందు పురూరవునికి మనస్సంగము ఏకరథంబున నొండొరువుల నొరయుచుం గూర్చుండుటయు, ఉర్వశి ఉద్ఘాతము కలిగినప్పుడు ఆతనిపైఁ బడుటయు, ఆతనిం గృతజ్ఞతతోఁ గామప్రేరిత సవిభ్రమ దృష్టులతోఁగాంచుటయు, అని కులకన్యలతో ఘటిల్లని కారణ విశేషములచే తిరముగా నాటుకొన్నది. మునికన్యయగు శకుంతలతో నివేవియు ఘటిల్లవు. కాన అందులకై కాళిదాసుఁడు ప్రియదర్శికలోని తుమ్మెదల తుటుమునుండి ఒకతుమ్మెదం దెచ్చికొన్నాఁడు. అదిపైకొనఁగా నామెపడిన తత్తఱపాటును ఆతుమ్మెదంగాంచిన యాజలుకుఁజూపులును

కామప్రేరితములైన శృంగారచేష్టలతోఁడి సవిభ్రమదృష్టులుంబోలె దుష్యంతునికి మనస్సంగముం గలిగించినవి."

(వే. వేం. శాస్త్రి మాళవిక - ఉపోద్ఘాతమునుండి.)

## వేదము వేంకటరాయశాస్త్రులవారి భాషాసేవ.

ఆంధ్రవాఙ్మయమునకు పందొమ్మిదవశతాబ్ద్యుత్తరార్ధమున నూతన వికాసము కలిగినది. అట్లే దేశమంతటను ఒక్కభాషకే అననేల పెక్కింటికి నూతనోజ్జీవము కలుగఁజొచ్చినది. అంతకుముందు దేశమందు లేనివి, వాఙ్మయమునకు జీవనౌషధములు, ముద్రాయంత్రములు వెలయఁజొచ్చినవి. దేశమంతయు మేలుకొనం దొడంగినది.

అట్టి యీకాలమున శ్రీ వేదము వేంకటరాయశాస్త్రులవారి యాగమనము వాఙ్మయమున నొక క్రొత్తయుగమును సూచించుచున్నది; గద్యపద్యనాటక విమర్శకాదివాఙ్మయములలో వారుచూపినపద్ధతులు పెక్కులు.

నెల్లూరుజిల్లా కావలితాలూకాలో సముద్రతీరమున, ఇసుకపల్లెకు సమీపమున, మల్లయపాలెమని గ్రామమును వేదమువారు పుదూరు ద్రావిడ బ్రాహ్మణులు సర్వాగ్రహారముగాఁ బడసి యనుభవించుచుండిరి. అందు వేంకటరాయశాస్త్రులవారని 'వేదశాస్త్రములందు ప్రఖ్యాతులు, అప్రతిగ్రాహకు' లుండిరి. వారికుమారులు వేంకటరమణశాస్త్రిగారు, బాల్యమందు నెల్లూరుపదలి కంచిలో నివర్తి వేంకటరామశాస్త్రులవారి కడ చదివి, మొదట మదరాసులో, వెనుక కాకినాడ, నరసాపురము, పోడూరు, విశాఖపట్టణము, రాజమహేంద్రవరము, మొదలైన ప్రదేశములలో సంస్కృతాంధ్రపండితులుగా నుండి, "వైయాకరణపతంజలి" యని ప్రఖ్యాతినందిరి.

వీరి పెద్దకుమారులు శ్రీ వేంకటరాయశాస్త్రులవారు మదరాసులో (౧౮౫౩సం॥ డిసంబరు ౨౩ తేది జన్మించిరి. శాస్త్రులవారి బాల్యమంతయు నాంధ్రదేశమున పలుతావుల గడచెను. (౧౮౭౬ సం. మెట్రిక్యులేషను

మొదటితరగతియం దుత్తీర్ణులై పదిపదునొండురూప్యముల స్టయిపెం డుతో మదరాసులో నార్మలుస్కూలులో ట్రైనింగు పొందిరి. అప్పుడు వీరి యాంధ్రగురువులు శ్రీ బహుజనపల్లి సీతారామాచార్యులవారును, చదలవాడ సీతారామశాస్త్రులవారును. ౧౮౭౫ సం ఎఫ్. ఏ., పరీక్షయం దుత్తీర్ణులై తర్వాత నుద్యోగములో ప్రవేశించి పదునొకండుసంవత్సర ములు అటనట ఉపాధ్యాయవృత్తియందు గడపిరి. ఆదినములలో నచ్చైన గ్రంథములలోను ప్రచారమునందున్న తాళపత్రగ్రంథములలోను చదువక విడిచినది లేదు; చదివి మఱచినది లేదు.

ఇంతలో నాంధ్రదేశమున వితంతువివాహములు బయలుదేరినవి. శాస్త్రులవారిని పలువురు సనాతనులు కోరి వారిచే ఉపన్యాసము లిప్పింప సాగిరి. ఈసందర్భమున శాస్త్రులవారు కావించిన పరిశోధనయు ప్రచార ములును అపారములు. 1883 సం ఈవిషయములనెల్లచేర్చి గ్రంథముగా ప్రకటించిరి. ఈఖ్యాతిచే మిల్లరుగారు ౧౮౮౬ సం నవంబరులో శాస్త్రుల వారికి మదరాసు క్రిస్టియన్కాలేజి సంస్కృతోపాధ్యాయపదమును ఒసంగిరి.

ఈయుద్యోగముతో శాస్త్రులవారి జీవితములోని ప్రధానఘట్టము ప్రారంభమగుచున్నది. శాస్త్రులవారికి జీవితమునందు చక్కగా కుదురు పాటుకలిగినది, గ్రంథరచనకు అవకాశ మేర్పడినది. ఇంతకుముందే శాస్త్రులవారు గ్రంథరచనకు ప్రారంభించి ప్రక్రియాఛందస్సు, అలంకార సారసంగ్రహములను ప్రకటించియుండిరి. కథాసరిత్సాగరమును దినము నకు ఐదుపుటలవంతున అనువదించుటకు ప్రారంభించి ౧౮౯౧ సం. పూర్తి చేసి ప్రకటించిరి.

"నానాఖ్యానమనోహరంబైన" యీప్రబంధ మొక యపూర్వ శైలిని రచియింపఁబడినది. కఠినపదాడంబరములేక, సులువైన పదజాలము లతో, కథాభాగములకు ఆయాచోటుల ననువైనశైలితో, ఎల్లవారికిని సులభగ్రాహ్యమై ఈవచనగ్రంథము ఆంధ్రవాఙ్మయమున నొక నూతన

శైలికి మార్గదర్శకమైయున్నది. కొందఱు ప్రబంధముల వచనముల శైలిని వ్రాయుచుండిరి; మఱి కొందఱు ఆంగ్లగ్రంథముల సాంప్రదాయములను తెనుఁగులోనికి తెచ్చుచుండిరి; శాస్త్రులవారు తెనుఁగువారి జాతీయతను తోఁపింపఁజేయు తిక్కనాదుల సాంప్రదాయము ననుసరించి ఆంధ్రదేశమందలి జనసామాన్యముయొక్క వాడుకభాషకు చేరువయైన గ్రాంథిక భాషలో కథలను వ్రాసిరి.

## పాత్రోచిత భాష.

౧౮౯౧ సం. శాస్త్రులవారు నాగానందనాటకము నాంధ్రీకరించిరి. దీనిప్రకటనము ఆంధ్రనాటకవాఙ్మయమునందు నూతన యుగప్రారంభమును సూచించుచున్నది. శాస్త్రులవారు ఇట్లు వ్రాసియున్నారు—"మనవారు మేఁకదాఁటుగా చిరకాలము పురాణముల నాంధ్రీకరించి తర్వాత ప్రబంధంబుల విసివి యిపుడు అన్యములం దొడంగినారు. మఱియు గీర్వాణనాటకముల నెఱింగియు హూణనాటకములం జదువువఱకు నాటకముల వ్రాయరైరి. గీర్వాణకథల నెఱింగియు హూణనవలలం గాంచినదనుక నవలల పయింబడరైరి. మఱి గద్యకవన మొకప్రజ్ఞ కాదఁట, ఆభావముచే నవలలు లేకపోయినవి. నాటకములు వ్రాయుటకు అట్టి కారణమే యొకటిగలదు."

౧౮౮౦ సం ప్రాంత్యమున కొందఱు సంస్కృతనాటకముల ననువదింపసాగిరి. వీనిని, సంస్కృతమర్యాదప్రకారము ప్రాకృతాది భేదముల లక్షణము ననుసరింపక అంతటను వ్యాకృతాంధ్రమే ప్రయోగించి రచియించుచుండిరి. నీచపాత్రలకును ఉదాత్తనాయికానాయకులకును ఏకవిధభాషనే ప్రయోగించుచుండిరి. ఇది ఔచిత్యమునకు దూరము. నాటకము దృశ్యకావ్యము. ఆడఁగా చూడఁదగినది. లోకవృత్తానుకరణము. అట్టిచోట అందఱకును ఏకవిధభాషను పెట్టుట అసహ్యకరము. శాస్త్రులవారు నూతనమార్గమును గోరువారు, నాగానందమున నొక క్రొత్తమార్గము నవలంబించినారు. సంస్కృతనాటకముల మర్యాద నవలంబించి

మూలములో సంస్కృతముండుచోట సలక్షణభాషయు; ప్రాకృతాది భాషాభేదము లుండుచోట్ల తెనుఁగు గ్రామ్యభేదములనుం బ్రయోగించి అనువదించిరి. ఆంధ్రవాఙ్మయమున పాత్రోచితభాషయందు రచియింపఁబడిన ప్రథమాంధ్రనాటక మిదియే. అంతకుముందు పాత్రోచితభాష యననేమో మన పండితులకు తెలియదు.

పలువురు పండితులును కవులును ఔచిత్యాభిమానులు హర్షించిరి. కొందఱకు అకారణముగా శాస్త్రులవారి గ్రామ్యముంగన్న ద్వేషమారంభమాయెను. పండితులలో నీవిషయ మొకయలజడి బుట్టించి వృద్ధిచేయసాగినది. కొందఱు పండితులు తమ పొరఁబాటును తెలిసికొని తాము పాత్రోచితభాష యవలంబించిన ఎక్కడ శాస్త్రులవారి శిష్యుల మగుదుమోయని భయపడియు, ఈకీర్తి శాస్త్రులవారికి రానేల యని అసూయవహించి నీచపాత్రలకు అచ్చతెలుఁగును పెట్టసాగిరి. దీనిచే వారి నాటకములు అసహ్యములుగా పరిణమించినవి. సరిపడనిపండితులు శాస్త్రులవారిని గ్రామ్యశాస్త్రియని యాక్షేపించిరి. వారిని తలఁద్రొక్కినట్లు ౧౮౯౬ సం. ఈపద్ధతినే యవలంబించి శాస్త్రులవారు కాళిదాసశాకుంతలమును అనువదించిరి. ౧౮౯౭ సం. వారు, తాము బాల్యములో తమ తండ్రిగారు చెప్పగా విన్నట్టి ప్రతాపుకథను పెంపొందించి, పెక్కుపాత్రలను సృజించి తమకు తోఁచినట్లు అల్లి నాటకముగా ప్రకటించిరి. ఇది ఆంధ్రవాఙ్మయమున మొదటి జాతీయనాటకము, స్వతంత్రరచన. ఈ నాటకమందలి కథాసంవిధాన చమత్కారము, సన్నివేశ సౌభాగ్యము, సమన్వయ సౌలభ్యము, పాత్రనిర్మాణకౌశలము, రసపోషణము, కవన స్వారస్యము, మొదలగువాని నిండు కలిమి యటుండ, బహుపాత్ర నిర్మాణముం గావించి ఎనిమిది తొమ్మిదితెగల గ్రామ్యభేదములం బ్రయోగించి, తమ పాత్రోచిత భాషాసిద్ధాంతమును తిరముగా నెలకొల్పుట మాత్రమే గాదు, శాశ్వతముగా తెలుఁగువారికి రూపకరచనావిధానముం జూపినారు. ఆకాలముననే మఱి రెండు స్వతంత్ర నాటకములు వెలు

వడినవి, శ్రీధర్మవరము రామకృష్ణమాచార్యులవారి చిత్రనళీయమును, శ్రీగురుజాడ అప్పారావుగారి కన్యాశుల్కమును.

ఈకాలమున శాస్త్రులవారిపై అకారణముగా పలువురకు ద్వేష భావ ముదయించినది. శాస్త్రులవారి పాండిత్యమును ఖ్యాతినిగని మన వారు ఓర్వలేకపోయిరి. చాటున మాటున దూషించుచునే యుండిరి. శాస్త్రులవారు అకారణముగా కయ్యమునకు దిగలేదు చాలకాల మోర్చి కొనియుండి తుదకు విమర్శనగ్రంథములను వ్రాయఁబూనిరి. వీనిలో ప్రధానమైనది శ్రీకొక్కొండ వేంకటరత్నంపంతులవారి యాంధ్ర ప్రసన్న రాఘవనాటకముపై విమర్శ. శాస్త్రులవారి గ్రామ్యమును ధ్వంస ముచేయదలంచి కవిపండితసంఘము నేర్పాటుచేసి ఆ సరిపడనిపండితులు వ్యూహము పన్నిరి. కాని ఆసభలలోని యుపన్యాసములచే శాస్త్రులవారి మతమే ఎల్లవారును అంగీకరించిరారు

## శాస్త్రిగారి ఆంధ్రీకరణ ప్రకారము.

సంస్కృతాంధ్రములలో శాస్త్రులవారి పాండిత్యము సమగ్రము. పండితుఁడేగాక కవి. హాస్యరసము వంశక్రమాగతమైన ఆస్తి; పెట్టని సొమ్ము, సహజము. 'హారాణరూకరసంబుదరంబు నిండారద్రావిన' రస ద్రష్ట. ప్రతాపరుద్రీయాదినాటకములను నిర్మించిన రసస్రష్ట. లోకాను భవము సమగ్రము. వీనిచే నీనాటకమందు ఏర్పడినగుణములు—సాధు పాఠనిర్ణయము, మూలానుసరణము, అర్థసౌలభ్యము, పాత్రోచితభాష అనునివి

సాధుపాఠనిర్ణయమువిషయమున, అలవడిన సంస్కృతవ్యాఖ్య లును, ఊహయు నాధారములు. ఇది విశేషముగా ప్రత్యేకవ్యాసముచే తెలుపఁదగిన విషయము. ఇంటర్మీడియేటు విద్యార్థుల కనవసరము. ఆయాశ్లోకములలోను పాత్రభాషితములలోను కవిహృదయమును గుర్తించి ఔచిత్యము ననుసరించి సాధుపాఠమును నిర్ణయించుకొని అను వదించినారు. మూలానుసరణము చాల ముఖ్యమైనది. కాళిదాసుశ్లోక

ములలో చెప్పినభావములను పోనీయక ఆయాపదములలో మహాకవి ఏయేభావములను ఎట్లెట్లు పొందుపరచినాఁడో ఆస్వారస్యమువచ్చునట్లుగా శాస్త్రిగారు అనువదించినారు అక్షరమక్షరమును మూలమునకు సరివచ్చునేగాని ఎచ్చటను తు. చ. తప్పదు. పైగా నీయనువాదములు మూలమునకు పెక్కుచోట్ల వ్యాఖ్యలవంటివి. అర్థసౌలభ్యమువిషయమున నాటకమే ప్రమాణము. చదువరులకు, ఒకపాటిజ్ఞానము గలవారికి పద్యములు సులువే. ఈపద్యములలో శాస్త్రులవారు ప్రబంధముల ధోరణిం బాటింపక నాటకశైలిని అనుకరించినారు. అనఁగా పద్యములు పాత్రభాషితములు; నేరుగా మాటలాడిన ట్లుండవలయునుగాని కథ చెప్పిన ట్లుండ రాదు. పైగా సంస్కృతశ్లోకముండలి భావగాంభీర్యమును పదప్రయోజనమును రావలయును. ఈరెండంశములను మనస్సున నుంచుకొని పద్యములను చదివిన రసవంతముగానుండును. పాత్రోచిత భాషలో శాస్త్రులవారి ప్రతిభ గోచరించును. ఈనాటకమున విదూషకుని వాక్యములు గ్రామ్యము. రాజాది పరిశుద్ధము ఊర్వశీ చిత్రలేఖాదులు ఉత్తమగ్రామ్యమును మాటలాడుదురు నీచగ్రామ్యమున కిందు తావు లేదు.

శాస్త్రులవారు మొదట ౧౮౯౦లో జ్యోతిష్మతీ ముద్రాక్షరశాలను స్థాపించి సంస్కృతాంధ్రగ్రంథములను ముద్రింప నారంభించిరి. కాని అప్పుడు ఆర్థికముగా క్లేశములు కలుగుటచే దానిని మానిరి. మరల, కృశ్చియన్కాలేజీనుండి విరమించుటకు సంవత్సరము పూర్వము ౧౯౦౯లో జ్యోతిష్మతీముద్రాక్షరశాలను ప్రారంభించి అందనేక గ్రంథములను ముద్రించి యాంధ్రులకృతజ్ఞతకు పాత్రులైరి. వీనిలో ముఖ్యమైనది శృంగారనైషధవ్యాఖ్య ౧౯౧౩.

ఈకాలముననే గ్రామ్యవాదమును అరికట్టినారు. మొదట గ్రామ్యమును తెచ్చినవారు శాస్త్రులవారే. గ్రామ్యమునకు వాఙ్మయములో స్థానముకలదని చెప్పినారు "రసజ్ఞులు కారణవిశేషములంబట్టి గ్రామ్యమందు గ్రంథములను వ్రాసికొందురుగాక. బొబ్బిలిపాటయు,

దేశింగురాజుపాటయు గ్రామ్యము లేగదా. ఆశాధ్య కల్లన రచించిన జంగాలపాటలోని వీరరసము ఇంచుకేనియు రంగరాట్చరిత్రమున లేదు. ఇది గ్రామ్యప్రభావముగాదు. రచనాప్రభావము...అట్లే గ్రామ్యమున సుద్దులును కథలును గద్దెలును రసవంతములు గలవు. 'వాక్యం రసాత్మకం కావ్యమ్మ'ని గదా విశ్వనాథకవిరాజు అనుశాసించినాడు. అది హృదయంగమము గాని, బాలుర పాఠపుస్తకములను గ్రామ్యమున వ్రాయుటయు, ఆగ్రామ్యపుస్తకములను నిర్బంధపూర్వకముగా పాఠశాలలో చదివించుటయు, అసమంజసము."

వెనుక శాస్త్రులవారిజీవితము చక్కగా నడువలేదు. మరల క్లేశములు ప్రారంభమైనవి. ౧౯౧౮ సం. నెల్లూరనే కాపుర ముండదలంచి అచ్చటి కేగినారు. దీనిచే వారికి చాలనష్టముకలిగినది. గుమాస్తాలుగా చేరినవారు పలువురు వంచకులై ద్రవ్యము నేమి, పుస్తకముల నేమి. యంత్రభాగముల నేమి, పనిముట్ల నేమి పెక్కింటిని హరించిరి కాని శాస్త్రులవారి 'నిండుమనంబు నవ్య నవనీతసమానము, పల్కు దారుణాఖండల శస్త్రతుల్యము.' అందుచే ఆ గుమాస్తాలే పాదములపైబడి క్షమాపణ వేడగా మరల చేర్చుకొనిరి.

సూర్యరాయాంధ్రనిఘంటు సంపాదకత్వము శాస్త్రులవారిజీవితములో నొక మెఱపువంటిది. అంతలో వెలుగు అంతలో చీకటి రు ౨౫౦ వేతనముపై నియమింపబడిరి. రెండేండ్లు మదరాసులో సంపాదకత్వము వహించి విరమించిరి.

మరల శాస్త్రులవారు గ్రంథరచనకుం బూనుకొని ఆ యచ్చాఫీసునే పెట్టుకొని పాటుపడుచుండిరి. ఆముక్తమాల్యదకు వ్యాఖ్య వ్రాయ నారంభించిరి మధ్య చిన్నగ్రంథముల నెన్నిటినో ప్రకటించిరి. లెక్కలేని సత్కారములును జరుగుచుండినవి. కాని ఆర్థిక క్లేశములు తగ్గలేదు.

తుదిదినములలో వారికి మనఃక్లేశములు కలిగినందున విశేషగ్రంథ రచన చేయలేదు. [illegible]ని చేసినపని సామాన్యుఁడు చేయగలిగినదిగాదు. ఆముక్తమాల్యదవ్యాఖ్యను పూర్తిచేసి ముద్రించిరి. సాహిత్యదర్పణాదిగ్రంథముల నాంధ్రీకరించిరి. నిరంతరము గ్రంథశోధన చేయుచునే యుండిరి. పెక్కు సంస్కృతాంధ్ర గ్రంథములను దిద్దియు, తమజీవితములో కాకపోయినను ఎప్పటికైనను ప్రకాశముం బొందుగాకయని, టీకలు వ్రాసియు పదిలపరిచినారు (విస్తరము వేంకటరామశాస్త్రి జీవితచరిత్ర సంగ్రహమున చూడుఁడు.

శ్రీ

# ఆంధ్ర - విక్రమోర్వశీయము.

శా. ఏనిం జాటును రోదసీభరితుఁ డౌ నేకాత్ము వేదాంత, మె
వ్వానిం జెందెడి నీశ్వరాఖ్య యితరాప్రాప్తంబు సార్థార్ణమై
ధ్యానింతు ర్మను లెవ్వనిన్ నియమితప్రాణాదులై ముక్తికై
తా నిశ్శ్రేయస మిద్ధభక్తివశుఁ డాస్థాణుండు మీ కిచ్చుతన్.

---

## ప్రస్తావన.

### నాంద్యంతమున

సూత్రధారుఁడు.—అతివిస్తరము వలదు. [నేపథ్యమువైపు చూచి] మారిషా, ఇటు రావోయి.

[పారిపార్శ్వకుఁడు ప్రవేశించును.]

పారిపార్శ్వకుఁడు.—వచ్చితిని బావా.

సూత్ర.—మారిషా, ఈ సభవారు పూర్వకవుల ప్రయోగబంధములను పెల్లుగా చిత్తగించియున్నారు, కావున, నే నిపుడు విక్రమోర్వశీయ మనెడి యపూర్వనాటకమును ప్రయోగించెదను. అందులకై పాత్రవర్గమును తమతమ పాఠములయందు అప్రమత్తులుగా సిద్ధపడవలసినదని హెచ్చరింపుము.

పారి.—బావ యాజ్ఞాపించినట్లు. [అని నిష్క్రమించును.]

సూత్ర.—ఇదె యిపుడు ఆర్యమిశ్రులకు విన్నవించుకొనుచున్నాను. [ప్రణమిల్లి]

తే. ప్రణయవంతులమీఁది దక్షిణత నేని,
వస్తుపురుషులపై గౌరవమున నేని,
అవధరింపుఁడి సావధానాత్ములగుచుఁ,
గాళిదాసగ్రథితరూపకమును దీని. 2

(నేపథ్యమున)

కావరయ్యా కావరయ్యా! వేల్పులమీఁద పక్షపాతంగలవాడు గానీ, ఆకాశగమనం గలవాడుగానీ, కలడేని

సూత్ర.—(చెవి యొగ్గి) ఏమి యిది! నేను విన్నపము చేసికొన్న వెంటనే గోరవంక కొమ్మలదియుం బోలె ఆకసమునుండి నాదము వినఁబడుచున్నది! (ఆలోచించి) కానీ, తెలిసినది:—

తే. నరసఖమునీంద్రునూరుజ నాకరమణి
విత్తపునిమోలి *నాడి నివృత్తయగుడు,
నర్ధపథమున నమరారు లాఁకఁగొనఁగ,
శరణుకై కుయ్యి వెట్టు నచ్చరలగణము. 3

(అని నిష్క్రమించును.)

ప్రస్తావన ముగిసినది.

---

* ఆడి - "కైలాసనాథ ముపసృత్య" అని పా. మదూహితము.

# ప్రథమాంకము.

---

[అంతట అప్సరసలు ప్రవేశింతురు.]

అందఱు — కావరయ్యా కావరయ్యా! వేల్పులమీఁద పక్షపాతంగలవాఁడుగానీ, ఆకాశగమనం గలవాఁడుగానీ, కలఁడేని.

[అంతట రథముచేత రాజును సారథియుం (అపటీక్షేపమున) ప్రవేశింతురు.]

రాజు — మొఱ యిడవలదు, మొఱ యిడవలదు! సూర్యోపస్థానమునుండి మరలిన నన్ను పురూరవునిఁ దఱియుఁడు; ఎందువలననుండి మిమ్ముఁ గావవలెయునో చెప్పుఁడు.

రంభ. — అసురదర్పమునుంచి.

రాజు. — ఏమీ! అసురదర్పము మీకు ఎగ్గుచేసినదా?

మేనక. — అవధారు మహారాజా! ఎవతె తపోవిశేషపరిశంకితుడైన మహేంద్రునికి కోమలాయుధమో, రూపగర్వితయైన శ్రీకి గుండెతల్లడమో, స్వర్గానికి అలంకారమో, ఆ మా ప్రియసఖిని ఊర్వశిని కుబేరాస్థానినుంచి మరల వస్తూవున్నదాన్ని చిత్రలేఖాద్వితీయను హిరణ్యపురవాసి కేశి యనే దానవుడు ఆకస్మికంగాచూచి చెఱబట్టుకొని పోయినాడు.

రాజు — ఆజాల్ముఁడు ఏదిగ్విభాగమువైపు పోయినాఁడో ఎఱుఁగుదురా?

సహజన్య — పూర్వోత్తరంవైపు.

రాజు. — అటయిన దిగులు మానుఁడు. మీసకిని తెచ్చుటకు యత్నించెదను.

అచ్చరలు — సోమునినుంచి ఒకకే ఎడమువాడ నైన నీయం దిదేమి యాశ్చర్యం?

రాజు.—నన్ను మీరు ఎచట ఎదురు సూచుచుండెదరు ?

అచ్చరలు.—ఇదె యీ హేమకూట శిఖరముమీద.

రాజు.—సూతుఁడా! ఐశానదిక్కునకు గుఱ్ఱములను వడి గొలుపుము.

సూతుఁడు.—ఆయుష్మంతునియాజ్ఞ. [అని అట్లు చేయును.

రాజు.—[రథవేగమును రూపించి] బళిబళి! తేరు పోవుచున్న యీ వేగముచేత నేను ముందు తరలు గరుత్మంతుని సయితము కలసికొనఁ గలను. మఱి యీయింద్రాపకారిమాట చెప్పవలయునా? అట్లే గదా.

చ. పొడిపొడి యౌచుఁ దేరిమునుపోవు దుమారము వోలె మేఘముల్,
అడరెడినో యరిభ్రమి నరాంతరపంక్తి యరాంతరంబులన్,
నిడివిగఁ జిత్రముల్పలె వినిశ్చలముల్ హయమాళి జామరల్,
పడగ చెలంగు యష్టితుదిఁ బ్రాంతమునన్ సరి గాలితీవ్రతన్. 4

[రథముతో రాజును సూతుఁడును నిష్క్రమింతురు.

రంభ.—ఒసే, ఆ రాజర్షి వెళ్లినాడు. ఆ నిర్దిష్టప్రదేశానికే పోదాము రండి.

ఇతరలు.—సఖి, అట్లే చేతాము.

[అని అందఱు శైల మెక్కుట నభినయించి నిలుతురు.

రంభ —ఆరాజర్షి మనహృదయశల్యాన్ని పెలువరించునా?

మేనక —నీకేల సంశయం? పోరు ఆసన్నమయినప్పుడు మహేంద్రుడు మర్త్యలోకంనుంచి ఈయననే సగౌరవంగా రప్పించి విజయసేన మొనలో నియోగిస్తాడు గదా.

రంభ.—తప్పకుండా యిపుడు విజయం పొందును గాక.

సహ.—[క్షణమాత్ర ముండి] ఓసి, ఊఱడిల్లండి ఊఱడిల్లండి. ఇదుగో నిగుడుతున్న లేడిజెండాతోటిది ఆరాజర్షి రథము సోమదత్తము కనబడుతున్నది. ఆతడు పోయినపని సాధించక మరలడు గదా.

[అందఱు పైకి కన్నులెత్తి చూచుచున్నారు.

[అంతట రాజు సూతుఁడును, చిత్రలేఖావలంబితహస్త భయనిమీలితాక్షి ఊర్వశియు ప్రవేశింతురు.]

చిత్రలేఖ.—ఊఱడిల్లు ఊఱడిల్లు ప్రియసఖి.

రాజు.—

తే. తొలఁగె భీరుక, సురరిపువలని భయము,
వజ్రిమహిమ జగత్త్రయావనము గాదె?
కానఁ దెఱవు వెడంద యాక్రాలుగన్ను,
నళిని ప్రత్యూషమున మహోత్పలముఁ బోలె. 5

చిత్ర.—అయ్యో! ఉచ్ఛ్వాసమాత్రమే జీవచిహ్నంగావున్నది! ఈమెకు ఇంకనూ చైతన్యం రాకున్నది;

రాజు.—మీసకి బిట్టు బెగ్గడిల్లినది. అట్లే గదా.

క. విడువద యిప్పటికి నదరు,పడఁతియెదను గుసుమసదృశబంధనమును, దె
ల్పెడి స్తనమధ్యోచ్ఛ్వాసిత, నడరెడుహరిచందనద్రవాంకము దీనిన్.

చిత్ర.—ఒసే! మనస్సు నిబ్బరంచేసుకోవే, అచ్చరలాగ తోచకున్నావే! [ఊర్వశి తెలివిపొందును.

రాజు.—కోమలీ, నీచెలి మూర్ఛఁదేరుచున్నది. చూడు.

తే. శశి పొడువఁ జీకటి యడంగు నిశయుఁ బోలె,
సాంద్రధూమం బణునిశాగ్నిజ్వాల వోలె,
లోనిమూర్ఛ యొడలుచుండఁ జాన దోఁచు
గట్టురిలినఁ గలఁగి తేరు గంగ వోలె. 7

చిత్ర.—సకీ, దిగులు మానవే. ఆవేల్పులపగతుర హతాశులు పరాహతులైనారుగదా.

ఉర్వశి.—[కన్నులు తెఱచి] మహేంద్రు డేమయినా తన ప్రభావాన్ని చూపించినాడా!

చిత్ర.—మహేంద్రుడు గాడు, మహేంద్రునితో సమానుడైన యీరాజర్షి.

ఉర్వశి.—(*తన్నుం జూచుకొని, ఆత్మగతము) దానవులు నాకు ఉపకారం చేసినారు సుమా.

రాజు.—(ప్రకృతిస్థను ఉర్వశిని నిర్వర్ణించి, స్వగతము) అచ్చర లందఱును నారాయణఋషిని వలపింప వచ్చి అతనితొడనుండి జనించిన యీరమణిని గాంచి సిగ్గు చెందుట యుక్తమే సుమా. అట్లన నేల, ఈ రూపము తాపసునిసృష్టి యనఁదగినదిగాదు. అట్లే గదా—

ఉ. వైదలిఁ జేయ నయ్యె విధి ప్రాప్తమహోజ్జ్వలకాంతి చంద్రుఁడో?
ఆదిరసైకకంద మగు నయ్యసమాస్త్రుఁడో? పుష్పమాసమో?
వేదజడుండు ప్రాఁదకసి వీతసమస్తకుతూహలుం డెటుల్
శ్రీ దొలఁకన్ మనోహరముఁ జేయఁగ నేర్చెడి నిట్టిరూపమున్. 8

ఉర్వశి.—చెలీ, ఆ సఖీజనము ఎక్కడ ఉండును.

చిత్ర.—అభయ మిచ్చినమహారాజు జెలుగును.

రాజు.—(ఉర్వశిని గాంచుచు) మిక్కుటపునెగులులో నున్నది నీవే యూహింపుము.

తే. స్వైరముగ నీవు భామ, యవంధ్యమైన
యెవని కనుమోడ్పుల నొకపరి యేని నిలుతో,
ని న్నెడయ లేక యాతఁడే నెగులుఁ జెందఁ,
జెలుల స్నేహరసార్ద్రలఁ జెప్ప నేల? 9

ఉర్వశి.—(అపవారించి) ఇతనివాక్కు ఎంత నాకెనముగా నున్నది! కా కేమి! చంద్రునివల్ల అమృత మన్న ఆశ్చర్య మేమి? (ప్రకాశము) కను కనే చూడడానికి నా హృదయము తమకపడుతూ ఉన్నది.

రాజు.—(చేతితో చూపుచు)

* పా. రాజుం జూచుచు.

క. నీమొగముం జూచెద రిదె, కోమలి, నీచెలులు హేమకూటస్థిత లై,
గామముం బాసిన రాతిరి, సామిం బ్రత్యాగతప్రసాదుం బోలెన్. 10

(అని ఊర్వశిని సాభిలాషముగాఁ గనును.)

చిత్ర.—సఖీ, చూడు.

ఊర్వశి.—(రాజును ఆసతోఁ గాంచుచు) సమదుఃఖత చేత నన్ను కన్నులతో త్రాగుతున్నట్లు తోచేని.

చిత్ర.—(సాకూతముగా) ఎవరు ?

ఊర్వశి.—ఇదె ప్రణయిజనము.

రంభ.—(హర్షముతోఁ గాంచి) సఖి, సచిత్రలేఖను ప్రియసఖి నూర్వశినితోడ కొని విశాఖాసహితుడు భగవంతుడు చంద్రుఁడువోలె రాజర్షి వచ్చినాడు.

మేనక.—(చూచి) సఖి, మనకు ఇందు రెండు ప్రియములు. మన ప్రియసఖిని ఊర్వశిని తేవడమున్ను, మహారాజు అక్షతశరీరుడుగా రావడమున్ను.

సహజన్య.—సఖి, సరిగా చెప్పితివి. దానవులు దుర్జయులుగదా.

రాజు.—సూతుఁడా, ఇదే ఆకొండశిఖరము, రథమును డిగ్గ నడుపుము.

సూతుఁడు.—ఆయుష్మంతుని యాజ్ఞ. (అని అట్లే చేయును.)

రాజు.—(చక్రోద్ఘాతమును రూపించి, ఆత్మగతము) ఆహా! రథము విషమముగా కొండమీఁద దిగుట నాకు ఉపకారమే అయినది.

ఆ. తేరికుదుపుచేత నీరథాంగశ్రోణి, రోమవిక్రియాభిరామముగను
అంసమున మదీయమంసంబునొరయుట, యించువిల్తుఁ డంకురించుటబలె!

ఊర్వశి.—సఖి, కొంచె మటు ఓసరిల్లవే.

చిత్ర.—(స్మితముతో) నాకు శక్యం గాదు.

రంభ.—రండి రాజర్షిని సంభావింతము. [అందఱు సమీపింతురు.

రాజు.—

తే. సూత, నిలుపుము రథము నిచ్చోట నిముసము,
ఉత్సుక లగుసఖులతో సముత్సుకతను,
లతలతోఁ గూడ నార్తవలక్ష్మి వోలె,
నీయుదిరనేత్ర వెండి కూర్పనయ్యెడాఁక. 12

[సూతుఁడు అట్లే చేయును.

రంభాదులు అందఱు.—ఆహా! మహారాజు విజయముచేత వర్ధిల్లుచున్నాడు!

రాజు.—మీరును మీసకి వచ్చుటచేత.

ఊర్వశి.—[చిత్రలేఖ కేలూఁత యియ్యఁగా తేరినుండి దిగి] సఖులారా, రండి, నన్ను గాఢంగా కౌగిలించుకోండి; మళ్ళీ సఖుల ముఖాన్ని చూస్తా నన్న ఆశ నాకు లేకపోయింది గదా,

[సత్వరముగా కౌఁగిలించుకొందురు.

రంభ.—తప్పకుండ మహారాజు నూర్లకొలది యేండ్లు భూమిని పాలించుచుండునుగాక.

సూతుఁడు.—ఆయుష్మంతుఁడా, తూర్పు దిక్కునుండి మిక్కుటంపు రథవేగంపుశబ్దము వినఁబడుచున్నది.

క. డిగియెడి నెవ్వఁడో యీతఁడు, గగనంబుననుండి తప్తకనకాంగదుఁడై
నిగనిగని మెఱుపులొలసెడి, జిగిమొగులుంబోలె నద్రిశిఖరంబునకున్.

[అచ్చరలు చూచుచుందురు.

అచ్చర లందఱు.—అహో! చిత్రరథుఁడు!

[అంతట చిత్రరథుఁడు ప్రవేశించును.

చిత్రరథుఁడు.—[రాజును గాంచి గౌరవముతో] ఆహాహా! నీవు మహేంద్రుని ఉపకరించుటకుఁ జాలినపరాక్రమముతో వర్ధిల్లుచున్నావు!

రాజు.—ఓహో! గంధర్వరాజు! [తేరు డిగి] ప్రియమిత్రునికి స్వాగతము. [ఒండొరులచేతులం గైకొందురు.

చిత్రర:—కేశిదానవుఁడు ఉర్వశిని చెఱఁబట్టినాఁ డని నారదుని వలన విని మహేంద్రుఁడు ఆమెను విడిపించుకొని రమ్మని గంధర్వసేనకు ముదలవెట్టినాఁడు. అంతట మేము మధ్యమార్గమున చారణులవలన నీజయోదాహరణమును విన్నవారమై ఇట నున్న నిన్నుఁ దఱిసితిమి. నీవును ఈమెను ముం దిడుకొని మాతోఁగూడ దేవేంద్రుని దర్శించుట తగవు. మహానుభావునికి దేవేంద్రునికి నీవు మహత్తర మయిన ప్రియము ఆచరించితివి గదా. చూడు,

క. మును పొసఁగెను నారాయణ
ముని యీయమృతోపమాంగిఁ బురుహూతునికిన్,
దన జానికయినుండి యొడిచి
యనుఁగుంజెలి నీ విపుడు సమర్పించితివే. 14

రాజు.—అట్లు గాదు.

తే. అశనిధరుతేజము గ దయ్య యతనిరిపుల
నతనిపక్షమువారలు హతులఁ జేత;
భూమిధరకందరంబుల మ్రోఁగునట్టి
సింగపుంబ్రతిశబ్దంబు చెండుఁ గరుల. 15

చిత్రర.—ఇది యుక్తమే. గర్వము లేమి విక్రమాలంకారము గదా.

రాజు.—సఖుఁడా, నాకు శతక్రతుని దర్శించుటకు ఇది అవసరముగాదు. ఈమెగారిని నీవు ప్రభువుకడకుం గొనిపొమ్ము.

చిత్ర.—నీవు ఇచ్ఛగించినట్లే. [అచ్చరలనుగూర్చి] ఇటు ఇటు మీరు. [అచ్చరలు తరలుదురు.

ఉర్వశి.—[జనాంతికము] సఖి, చిత్రలేఖా, ఉపకారినైనను రాజర్షిని ఆమంత్రింప నేరకున్నాను. నీవు నాముఖమవు గమ్ము.

చిత్ర.—[రాజును దఱిసి] వయస్యుఁడా, ఉర్వశి విన్నవిస్తున్నది. 'మహారాజుచేత అనుజ్ఞ పొంది ప్రియసఖిని బోలె మహారాజుకీర్తిని మహేంద్రలోకానికి కొనిపోవడానికి కోరుతున్నాను.' అని.

రాజు.—పోవుదుగాక, మరల దర్శనమునకు.

[స్త్రీలు అందఱు సగంధర్వులు మింటికెగయుట నభినయింతురు.

ఉర్వశి.—ఉత్పతనభంగము రూపించి అహో! నా యేకావళి తీగకొమ్మకు తగులుకొన్నది. [వెనుకకు మరలి] చిత్రలేఖా, దీన్ని వదిలించు.

చిత్ర.—[చిఱునగవుతో] దిట్టముగా తగులుకొన్నది వదలింప నశక్యమని నాకు తోస్తున్నది, అయినా యత్నిస్తాను.

ఉర్వశి.—నీ వన్న యీమాట మఱచిపోకు.

[చిత్రలేఖ వదలించుట నభినయించును.

రాజు.—[స్వగతము]

క. ప్రియ వైతి లతిక, నాకుఁ,
బ్రియపయనమునకు నిమేషవిఘ్నము సేతః;
నయనాంతేక్షణఁ గంటిని
బ్రియఁ బరివృత్తార్ధముఖిని వెండియుఁ గానన్. 16

సూతుఁడు.—ఆయుష్మంతుఁడా,

ఆ. వాసవునికి నెగ్గు సేసినదైత్యుల
నుప్పుఁగడలిలోన నురలవైచి
మరలఁ జొచ్చె నీదుమారుతాస్త్రము పొదిఁ
గలుఁగునను మహోరగంబు మాడ్కి. 17

రాజు.—మఱి రథమును చేరఁ బట్టుము. ఎక్కెదను.

సూతుఁడు రథమును చేరఁ బట్టును; రాజు నాట్యమున రథమును ఎక్కును; ఉర్వశి రాజును గాంచి నిట్టూర్పు పుచ్చుచు సఖితోఁగూడ నిష్క్రమించును చిత్రరథుండును.

రాజు.—ఏమి యిది! దుర్లభమందు తగులుగొల్పుచున్నాఁడు మన్మథుఁడు?

తే. నాయొడలినుండి సుందరి నామనమును,
తం డ్రిమధ్యమపదమునకై తా నెగయుచు
నాఁచికొనె రాజహంసి లూనాగ్రమైన
కమలనాళంబునుండి సూత్రమును బోలె. 18

అందఱు నిష్క్రమింతురు.

---

(ప్రథమద్వితీయాంకముల నడుమ)

ప్ర వే శ క ము.

[అంతట విదూషకుఁడు ప్రవేశించును.]

విదూషకుఁడు.—హీహీహీ! నిమంత్రణైకపరవశుఁడయిన బ్రాహ్మణునిలాగు రాజరహస్యంచేత పైకి పిగులుచున్నవాడనై జనులు నిండిన యీచోట నానాలుకని కట్టివేసుకోలేకున్నాను. కనక ఆయనగారు నా ప్రియవయస్యుడు కార్యాసనమునుంచి లేచేదాకా జనసంపాతము తక్కువగా వున్న యీవిమానపరిసరంలో ఉంటాను. పరిక్రమించి నిలుచును.

చేటిక.—ప్రవేశించి దేవి కాశీరాజకూతురు నన్ను ఆజ్ఞాపించింది; "ఒసే నిపుణికా, సూర్యభగవానుని ఉపస్థానంచేసి వచ్చినప్పటి నుంచి ఆర్యపుత్రుడు శూన్యహృదయుడుగా కనబడుతున్నాడు. కనక ఆయన ప్రియవయస్యుణ్ణి మాణవకయ్యని అడిగి ఆయనకి ఉత్కంఠా కారణ మేమో తెలుసుకొనిరావే" అని. ఆ బ్రహ్మబంధుణ్ణి నే నేలాగ

కంగిస్తాను ? కంగించ కేమి ? సన్నని గరికపోచకొస నున్న మంచుబొట్టు లాగ ఇతని నాలికలో రహస్యము చాలసేపు ఉండదు. మఱి యితనినే వెతుకుతాను. [పరిక్రమించి చూచి] ఇదుగో మాణవకయ్య కదలక మెదలక చిత్తరువులోని కోతిలాగ నిలుచున్నాడు. ఇతనికాడికి వెళ్తాను. [సమీపించి] అయ్యా, దండము.

విదూ.—నీకు మేలు కలుగునుగాక. [ఆత్మగతము] ఈ చెడు చేటిని చూడగానే ఆరాజరహస్యము హృదయాన్ని భేదించుకొని వెడలుతూ వున్నది. [ప్రకాశము] నిపుణికా, సంగీతవ్యాపారముమాని ఎక్కడికి వెడలినావు ?

నిపుణిక.—అయ్యా దేవిపంపున నిన్నే చూడడానికి.

విదూ.—దేవి యేమి ఆజ్ఞాపిస్తున్నది ?

నిపు.—ఆర్యుడు ఎప్పుడున్ను నాయందు పక్షపాతి. నేను అనుచిత వేదనచేత దుఃఖిస్తూ ఉంటే ఉపేక్షించడు.

విదూ.—[సవితర్కము] నావయస్యు డేమయినా ఆమెకి ప్రతికూలం చేసినాడా !

నిపు.—అయ్యా, ఎవతెనిమిత్తమై భర్త ఉత్కంఠితుడుగా ఉన్నాడో ఆమె పేర దేవిని పలకరించాడు.

విదూ.—[స్వగతము] స్వయముగానే ఆయనగారు రహస్యము వెలిబుచ్చినాడు. మఱి యింక నే నెందుకు నాలికని కట్టిపెట్టుకొని కష్టపడడము ? [ప్రకాశము] ఏమి ? దేవిని ఉర్వశీ అని పిలిచినాడా ? ఆమెని చూచినందువల్ల ఆయన వేదురుగొని వినోదములు మానుకొని నన్ను కూడా మిక్కిలీ పీడిస్తూవున్నాడు.

నిపు.—[ఆత్మగతము] ప్రభువుయొక్క రహస్యదుర్గాన్ని నేను భేదించితిని. [ప్రకాశము] అయ్యా, దేవికి ఏమి ఉత్తరం మనవి చేయను?

విదూ.—నిపుణికా, ఆ మెగారితో ఈలాగు విన్నపించు "నేనున్ను వయస్యుణ్ణి ఎండమావులనుంచి మళ్ళించడానికి యత్నించిన తర్వాత దేవిముఖం చూస్తాను," అని.

నిపు.—అయ్య చెప్పినట్టు చేస్తాను.

[అని నిష్క్రమించును.]

[నేపథ్యమున వైతాళికుడు.]

ఉ. నీకును హేళికిన్ సరిగ నెక్కొనెఁ గార్యభరాధికారముల్,
లోకతమః ప్రవృత్తి ప్రజలోఁ బరిలూనము మీకృతంబునన్;
ఏకనిమేష మాఁగును గ్రహేశ్వరుఁ డంబరమధ్యమంబునన్,
నీకును షష్ఠకాలమున నీమదిచొప్పున వర్తిలం దగున్. 19

విదూ.—[చెవి యొగ్గి] వీఁడుగో వయస్యుఁడు, కార్యాసనంనుంచి లేచి ఇటువైపే వస్తున్నాడు. ఇతనికి పార్శ్వవర్తిని అవుతాను.

[అని నిష్క్రమించును.]

ప్రవేశకము ముగిసినది.

# ద్వితీయాంకము.

[అంతట ఉత్కంఠితుఁడు రాజు ప్రవేశించును, విదూషకుఁడును.]

రాజు.—

క. చూచియుఁ జూడక మున్నే, నాచిత్తము నిర్జరాంగనామణి సొచ్చెన్,
ఏచి వలరాచపాడుపహః చేసిననారసంపు ద్వారమున నసన్ . 20

విదూ.— (ఆత్మగతము) పాపము కాశిరాజపుత్త్రి మిక్కిలి వెత జెందివున్నది

రాజు.—రహస్యనిక్షేపమును కాచుచున్నావా ?

విదూ.— (విషాదముతో ఆత్మగతము) అయ్యో ! అయ్యో ! ఆదాసి నన్ను మోసగించినది! కాకపోతే వయస్యుఁడు ఈలాగు అడగడు.

రాజు.— (సాశంకము) ఏమి? నీవు బదులు చెప్పకున్నావు ?

విదూ.—ఈలాగు నీకు కూడా బదులుచెప్పనట్టుగా నేను నాలికని కట్టిపెట్టుకొని వున్నాను.

రాజు.—సరి. మఱి యిప్పుడెచ్చట ఆత్మను వినోదపెట్టుకొందును?

విదూ.—వంటయింటికి వెళ్దాము.

రాజు.—ఏ మక్కడ ?

విదూ.—అక్కడ పంచవిధభక్ష్యాలని దానిదాని సంభారాలతో కూరుస్తూవుండడం చూస్తూవుంటే ఉత్కంఠ తీరుతుంది.

రాజు.— (చిఱునవ్వు నవ్వుచు) అక్కడ ఈప్సితసంవిధానముచేత నీవు అలరుదువు. నాకోరిక తీరునట్టిది గాదు, నాకు అచట వినోదమేల కలుగును ?

విదూ.—నీవు ఆమహానుభావురాలికి ఉర్వశికి కంటబడినావా?

రాజు —అయిన నేమి ?

విదూ.—అయిన, ఆమె దుర్లభ అని తలవనే తలవను.

రాజు.—పక్షపాతముచేత నిట్లు పలుకుచున్నావు.

విదూ.—నీవు ఇంత చెప్పినందున నాకు కుతూహలం కలిగినది. ఏమి? ఆభాగ్యవంతురాలు ఉర్వశి నాలాగు సురూపంలో సాటిలేనిదిగా వుంటుందా ?

రాజు.—మాణవకుఁడా, ఆరమణిని ప్రత్యవయవవర్ణన సేయుట అశక్యమని యెఱుంగుము. మొత్తముగా విను.

విదూ.—అవధానంతో వింటున్నాను.

రాజు.—

తే. భూషణమునకు మేలివిభూషణము, ప్ర
సాధనవిధికి మహిత ప్రసాధనంబు;
అమరసుందరివపువు సొంపారెడి నుప
మానమున కెల్ల బ్రత్యుపమాన మగుచు. 21

విదూ—అందువల్లనే నీవు దివ్యరసానికి ఆశించినవాడవై చాతక వ్రతం గ్రహించినావు.

రాజు —ఉత్కంఠితునికి వివిక్తముకన్న వేఱే శరణము లేదు. కావున నీవు ప్రమదవనమార్గముం జూపుము.

విదూ.—(ఆత్మగతము) ఏమి గతి? (ప్రకాశము) ఇటు ఇటు (పరిక్రమించి) ఈదక్షిణవాయువు ప్రమదవనము పంపున ఆగంతునికి నీకు ఎదురు వస్తున్నట్లు ఒప్పుతూ వున్నాడు.

రాజు.—(చూచి) ఈవాయువునకు ఆవిశేషణము తగినదే ఏలన,

ఆ. మాధవిని నిషేకముంజులఁ జేయుచు; గొండ్లి నేరుపుచును గుందలతకు,
స్నేహదక్షిణతల నెఱపుచు నీతఁడు, కామివోలె నాకుఁ గానఁబడెడి.

విదూ.—నీయభినివేశం కూడా ఇటువంటిదే అగుగాక. (పరిక్రామితకముచేత) ఇదే ప్రమదవనద్వారము నీవు ప్రవేశించు.

రాజు.—నీవు ముందు ప్రవేశింపుము. (ఇరువురును చొత్తురు.)

రాజు.—(ఎదురం గాంచి) వయస్యుఁడా, ప్రమదోద్యానప్రవేశము నాయాపదకు ప్రతీకారమని నేను తలంచితినే, అది పొరఁబాటు.

క. కోరితిని నేను జొరఁ బ్రమ
దారామము; గాని, శాంతి యలరదు దానన్;
బోరన జక్కర కొని పో,
నేరి కయిన శక్య మగునె యెదు రీఁదంగాన్. 23

విదూ.—అదేలాగు?

రాజు.—

చ. దొరకనివస్తువున్ వలచి దుండగ మైనమదీయచేతమున్,
మరుఁ, డర లేక, మున్నె, పరిమార్చుచు నుండెః మఱిప్పు డన్ననో,
తర మిడి పాండుపత్త్రముల దక్షిణమారుత మూడ్చఁ, దోఁట నం
కురములఁ జూపఁ జాగినవి క్రూరత మావు లిఁకేమి చెప్ప నా! 24

విదూ.—ఎందు కేడుస్తావు? త్వరలోనే అనంగుడే నీయిష్టాన్ని సమకూర్చి నీకు సుఖము కలిగిస్తాడులే.

రాజు.—బ్రాహ్మణవచనమును ప్రతిగ్రహించితిని. (పరిక్రమింతురు.)

విదూ.—చూడవోయి నీవు వసంతావతారసూచకాన్ని ప్రమదవనముయొక్క సొంపును.

రాజు.—అంతటను చూచుచున్నాను, ఎట్లనిన నిట—

ఉ. స్త్రీనఖపాటలాగ్రములు కృష్ణము లౌనిరుపాళ్లఁ గోరఁటల్,
కానఁగ నౌ భిదోన్ముఖము గాఁగ నశోక ముపోఢరాగ మై,
నూ నగు నూత్నమంజరులు నూని రజోలవపింగళాగ్రముల్,
పూనె వసంతలక్ష్మి సఖ, ముగ్ధకుఁ బ్రౌఢకు మధ్యప్రాయమున్. 25

విదూ.—ఇదే బండిగురివెందతీగమంటపము, నీకై స్వయముగా ఉపచారములు సిద్ధపఱిచిన దనే లాగ తేంట్లసమ్మర్దంచేత రాలినపువ్వుల తోడి మణిశిలాపట్టముగలదై, నిన్ను ఎదురుచూస్తూ వున్నది కనక, దీనిని అనుగ్రహించు వయస్యుడా.

రాజు.—నీకు రుచించినట్లు చేసెదను.

విదూ.—ఇక్కడ నీవు సుఖంగా కూర్చుని, అందంపు లతలు నీ నేత్రాలను విందుగొల్పుతూ వుండఁగా, ఊర్వశిమీఁది నీయుత్కంఠను తీర్చుకో.

రాజు.—నిట్టూర్చి,

తే. జాతకుసుమలె యైనను శ్యామలందు
నమ్రవిటపలయం దిది నాదుదృష్టి
రతి భజింపద యాదేవరమణిరూపుఁ
గన్నకారణమున దుండగము వహించి. 26

కావున నాకోర్కి తీరునట్టియుపాయము నరయుము.

విదూ.—[నవ్వి] ఓయి, అహల్యాకాముకునికి ఇంద్రునికి సచివుడు వజ్రమున్ను ఊర్వశీలాలసునికి నీకుసచివుణ్ణి నేనున్ను ఇద్దఱము వెఱ్ఱులము.

రాజు.—అతిస్నేహముచేత కార్యమార్గము తోఁచును.

విదూ.—ఇదె ఆలోచిస్తాను, నీయేడ్పులచేత నాసమాధిని భంగపఱచకు. [చింతను రూపించును.

రాజు.—[నిమిత్తమును సూచించి, ఆత్మగతము]

తే. సకలశశిమండలాస్యయో సాధ్యగాదు!
ఇదియు మదనువిచేష్టిత మేమొ యేమొ!
ఐనఁ బ్రార్థిత మభిముఖం బైనభంగి,
నున్నయట్లుండి నిర్వృతి నొందె మనము. 27

[జాతాశుఁడై యుండును.

[అంతట ఆకాశయానమున ఉర్వశియు చిత్రలేఖయు ప్రవేశింతురు.]

చిత్ర.—సఖి, ఎక్కడికే కారణం లేకుండా నే యీ పోవడం ?

ఉర్వశి.—సఖి, అప్పుడు హేమకూటశిఖరాన తీవకొమ్మచేత నా యాకాశగమనము క్షణము విఘ్నముపొందగా నన్ను పరిహాసించిన దానవు, ఇప్పుడు ఈలాగు అడుగుతావేమి ?

చిత్ర.—ఏమి ? ఆ రాజర్షి పురూరవునికడకు తరలినావా?

ఉర్వశి.—ఇది లజ్జను వంచించిన నాజతనము.

చిత్ర.—సఖి, ఎవరిని మఱి ముందుగా పంపితివి ?

ఉర్వశి.—నాహృదయమునే.

చిత్ర.—అయినా చక్కగా ఆలోచించు.

ఉర్వశి.—మదనుడు నన్ను నియోగిస్తున్నాడు, ఇకను ఆలోచన కేమున్నది ?

చిత్ర.—ఇక నేను బదులు చెప్పలేను.

ఉర్వశి.—అట్లయితే మధ్యలో విఘ్నము కలగకుండా నాకు దారిచూపు.

చిత్ర.—సఖి, భయపడకు, భగవానుడు దేవగురువు అపరాజిత యనే ఆశిఖాబంధనవిద్యను ఉపదేశించి మనలని దేవవైరులకు అలంఘనీయలనిగా చేశినాడుగాడా ?

ఉర్వశి.—అహా! నాహృదయము దాన్ని మఱచినది!

*(సిద్ధమార్గములోనికి వచ్చి) ఇరువురు భ్రమణము రూపింతురు.

చిత్ర.—ఇదుగో యమునతోకూడడంచేత విశేషపావనములైన భాగీరథీభగవతి నీళ్లలో తన్ను తాను చూచుకొంటూ వున్న ప్రతిష్ఠాననగరానికి శిఖాభరణ మయిన రాజగృహమునకు వచ్చితిమి.

ఉర్వశి.—చూచి చెలీ, స్థానాంతరగత మయిన స్వర్గము అని చెప్పవలెను. ఆయాపన్నశరణ్యుడు ఎక్కడ ఉండును ?

చిత్ర —నందనవనఖండమువంటి యీ ప్రమదవనంలో దిగి తెలుసుకొందాము. [ఇరువురు దిగుదురు.

చిత్ర.—[చూచి సంతోషముతో] సఖి. ముందుదయించిన చంద్రుడు వెన్నెలనుం బోలె ఇతడు నిన్నెదురు చూస్తున్నాడు.

ఉర్వశి —[చూచి] సఖి యిప్పుడు ప్రథమదర్శనమునకన్నా సాతిశయప్రియదర్శనుడుగా మహారాజు అవుపడుతున్నాడు.

చిత్ర —యుక్తమే, కనుక రా, చెంతకు పోదాము.

ఉర్వశి —తిరస్కరిణిచేత దాగి ఈయన చెంతనే ఉండి విందాముగానీ, ఈయేకాంతంలో పార్శ్వవర్తియైన వయస్యునితో ఈయన ఏమి మాటలాడుతున్నాడో.

చిత్ర —నీయిచ్ఛప్రకారము. [అట్లు చేయుదురు.

విదూ —ఓ యోయ్యవు,ఆలోచించినానోయి నేను దొరకని ప్రియని పొందడానికి ఉపాయాన్ని. [రాజు ఊరకుండును.

ఉర్వశి —ఎవతెగా నుండును ఆచెలువ, ఈయన్ని వలపుపాలు చేసి తన్ను పొగిడించుకొంటున్నది ?

చిత్ర.—ఏమి మానుషవృత్తము నవలంబించితివి.

ఉర్వశి.—తటాలున ప్రభావంచేత తెలుసుకోడానికి భయపడుతున్నాను.

విదూ.—ఓయి, చెప్పుతున్నానుగదా ఉపాయమాలోచించితి నని.

రాజు.—అటయిన చెప్పుము.

విదూ —నీవు స్వప్నసమాగమకారిణి యైననిద్రను సేవించు. అటుగాకపోతే ఆమహానుభావురాలు ఉర్వశియొక్క పటము వ్రాసి చూస్తూ వుండు.

ఉర్వశి.—[సహర్షము] లఘుసత్త్వమా, హృదయమా, ఊరడిలూపడిల్లు.

రాజు.—ఉభయమును సరిపడదు.

చ. అనయము కామునంపలకు నయ్యె సశల్యము చిత్త, మెట్లుగా
నెనయుదు నిద్ర స్వప్నమున నిందుముఖిన్ సముహూర్పునెచ్చెలిన్,
కనుగొనఁ జిత్రమం దయినఁ గాంతను నోఁచన దైతి, నెట్లనన్,
మునుపడి యశ్రు లుబ్బి కనుమించెడి వ్రాంత ముగింపనీయకే. 28

చిత్ర.—సఖి, నీవు విన్నావా ?

ఉర్వశి.—వింటిని, కాని, హృదయానికి తనివి తీఱకున్నది.

విదూ.—ఈపాటిదే నా బుద్ధివిశేషము.

రాజు.—[నిట్టూర్చుచు]

చ. తెలియదొ దేవభామ యతి తీవ్రము మద్హృదయాభిషంగమున్ ?
తెలిసియు శక్తిచేత నవధీరణ సేయునొ నాదుకూరిమిన్ ?
లలనగుఱించి తద్దయు నలబ్ధఫలోదయనీరసంబులన్
గలయికకోర్కులం బెనిచి కాముఁడు తా సుఖ మొందుఁ గావుతన్.

చిత్ర.—విన్నావా ?

ఉర్వశి.—అయ్యో! అయ్యో! నన్ను ఇటువంటిదాన్నిగా భావిస్తున్నాడు! ఇతనియెదుట బడి బదులు చెప్పడానికి అసమర్థురాలినిగా ఉన్నాను. ప్రభావముచేత భూర్జపత్రము నిర్మించి అందులో దీనికి బదులు వ్రాతామని కోరుతున్నాను.

చిత్ర.—నాకు సమ్మతమే.

[ఉర్వశి సంభ్రమముతో యథోక్తముగా వించి ఆకమ్మను వైచును.

విదూ.—[చూచి] ఓ యమ్మో! ఓయి బాబో! ఇదేమిటి యిది! పాము కుప్పసం లాగ మనయెదట పడినది ?

రాజు.—[చూచి] భూర్జపత్రమందు అక్షరపంక్తులు.

విదూ.—కనబడకుండా ఉండి ఆమహానుభావురాలు ఉర్వశి నీ మొఱ ఆలకించి సమానప్రేమను సూచించే యక్షరాలు వ్రాసి, వేశి ఉండరాదా?

రాజు.—కోరికలకు అందరానిది ఉండదు. [పుచ్చుకొని చదువుకొని హర్షముతో] సఖుడా! నీయూహ ప్రసన్నముగానే ఉన్నది.

విదూ.—నీవున్ను ప్రసన్నుడవు అవు. ఇందులోని వ్రాత వినగోరుతున్నాను.

ఉర్వశి—బళీ, అయ్యా, నాగరకుడవయ్యా!

రాజు.—విను [చదువును].

క. సామీ, సంభావించితి, వే మని నను నీవు తెలియ, కే నటు లేనిఁ,
అమ్రుదితకల్పతల్పము, నీ మెయి నందనసమీర మేలా యేఁచుఁ. 30

ఉర్వశి.—ఇప్పుడు ఏమి చెప్పునో?

చిత్ర.—తామరతూండ్లలాగ అవుతూవున్న, అవయవాలచేత చెప్పనే చెప్పినాడు గదా.

విదూ.—బళీ!ఆకలిగొన్న నాకు స్వస్తివాచనంలాగ నీకు ఓదార్పు దొరికింది.

రాజు.—ఏమి! ఓదార్పనియా వచించెదవు?

మ. అనురాగంపుసముత్థ మట్టిపడఁగా, నర్థంపులాలిత్యముఁ
దనుకఁ, బ్రేయసి యీయుదాహరణముఁ దానింపఁ బత్త్రంబునఁ,
దన రెం బో మదిరాక్షిమోమె యిది యుత్ఫుల్లంపునామోముతో
నను సక్తం బయినట్టు లబ్రముగ నాకర్షించు చానందముఁ. 31

ఉర్వశి—ఇందు మా ప్రీతి సమవిభాగములుగా నున్నది.

రాజు.—వయస్యుఁడా, వ్రేళ్ల చెమరుచేత అక్షరములు చెడును. దీనిని ప్రేయసీ స్వహస్తమును పదిలముగా నుంపుము.

విదూ.—[కైకొని] ఏమి మఱి ఆమహానీయురాలు ఉర్వశి నీ కోరికలకు పువ్వుచూపి పండువిషయంలో కినుకిస్తూ వున్నది!

ఉర్వశి.—సఖి, సరసకు పోవడానికి భయపడుతూవున్న నా హృదయాన్ని నేను కుదుటబడ జేసుకొనే లోపల నీవు ముందుగా ఆయనకు అగపడి నాకై తగిన మాటలు పలుకవే.

చిత్ర.—అట్లే [అని తిరస్కరిణిని మాని రాజును దఱిసి]జయము జయము మహారాజునకు.

రాజు.—[సహర్షము] స్వాగతము నీకు కల్యాణీ,

క. చెలితోఁ గనఁబడుదానవు, చెలిఁ దేరక యంత ప్రీతి సేయవు నాకున్,
అలకూడలిలోఁ జూచిన, కళిందభవ గంగ లేక కనఁబడినగతిన్. 32

చిత్ర.—తొలుత మబ్బుబారున్న తర్వాత మెఱుపుతీగానున్న గదా అగుపడును.

విదూ.—[అపవారించి] ఏమి! ఈమె ఉర్వశి కాదా? ఆమహానుభావురాలికి సహచరియైన నెచ్చెలియా?

చిత్ర.—ఉర్వశి మహారాజును శిరస్సుతో ప్రణమిల్లి విన్నవిస్తున్నది.

రాజు.—ఏమి ఆజ్ఞాపించుచున్నది?

చిత్ర.—"నాకు రక్కసునివల్ల కలిగిన యిక్కట్టులో మహారాజే శరణమాయెను. ఆనేను నీదర్శనమువల్ల ఏచిన మన్మథునిచేత మిక్కిలి బాధపడుతూ మళ్లీ మహారాజే కనికరించవలసినదాన్నిగా ఉన్నాను." అని.

రాజు.—భద్రముఖి,

తే. పలికెదవు ప్రియదర్శనబాలి నీవు,
అరయవు పురూరవసునిఁ దదర్థ మార్తు;
మరుని కిది మాయిరువురయుష్మదీప్రణయము
తప్త మగునిన్ను సుఘటంబు తప్తమునకు. 3

చిత్ర.—[ఉర్వశిని దఱిసి] సఖి, రావే, నీమీఁదికంటె మదనుఁడు ప్రియవయస్యుడిమీఁద క్రూరంగా వుండడం చూచి, నేను ప్రియవయస్యుని దూతినై నీకడకు వచ్చినాను.

ఉర్వశి.—[తిరస్కరిణిని తొలఁగించి] అహా! ఎంతలో నన్ను వదలివేసితివి!

చిత్ర.—ఇక ముహూర్తములో తెలుస్తుందిలే, ఎవరు ఎవరిని వదలుతారో. ఆచారమును జరుపు.

ఉర్వశి.—[లజ్జతో] జయము జయము మహారాజునకు.

రాజు.—సుందరీ,

తే. జయమనఁగ నాదె, యేనీదుజయపదంపుఁ
బ్రాప్తి లేదో సహస్రాక్షుకన్నఁ బెఱకు,
ఆజయపదంబు మోదమానాత్మ వగుచుఁ
జెలువ, నాకిప్పు డుచ్చరించితివి గాన. 34

[కేలం గొని ఆమెను కూర్చుండఁ బెట్టును.

విదూ.—ఏమమ్మా! రాజు ప్రియవయస్యుడికి బ్రాహ్మణుడికి మొక్క వేమి? [ఉర్వశి స్మితముతో ప్రణమిల్లును.

విదూ.—స్వస్తి నీకు.

[నేపథ్యమున—చిత్రరేఖా, ఉర్వశిని వడిగొల్పు.]

తే. భరతముని యష్టరసముల నిరవు కొల్పె
నేప్రయోగంబు మీయందు, నెలమి దానిఁ
గనఁగ లలితాభినయము దాఁ గాంక్ష సేయు
లోకపాలురును సహస్రలోకుఁ డిపుడు. 35

[అందరు చెవి యొగ్గుదురు. ఉర్వశి విషాదము నటించును.

చిత్ర.—నెచ్చెలీ, దేవదూతవచనమును విన్నావా? మహారాజును సెలవడుగు.

ఉర్వశి —నాకు వాక్కు లేదు

చిత్ర —మహారాజా, ఈజనము పరవశంగదా. అందుచేత మహారాజువల్ల అనుజ్ఞపొంది దేవతలయెడల అపరాధించక మెలగడానికి వేడుతున్నది.

రాజు — ఎట్టకేలకు వాక్కును తెచ్చుకొని మీయిరువురయెడ వలికయానకు అడ్డపడువాఁడను గాను. మహేంద్రుని స్మరింపవలయును.

ఉర్వశి వియోగదుఃఖమును రూపించుచు సఖితో నిష్క్రమించును.

రాజు.—[నిట్టూర్పుతో మిత్రుఁడా, ఇప్పుడు కంటికి వ్యర్థతవలె.

విదూ.— ప్రత్రమును చూపఁగోరి ఓయి, ఇదుగో; అని సగము మాటలో, ఆత్మగతము] అయ్యో! అయ్యో! ఉర్వశీదర్శనాశ్చర్యముగ్నుణ్ణై నేను నాచేతులోనుంచి ప్రమాదమున ఆపత్రము జాఱిపోవడం ఎఱక్కపోతిని.

రాజు —భద్రుఁడా, ఏమో చెప్పవచ్చితివే ?

విదూ —నీవు దేహాన్ని వదలకు నీమీద ఉర్వశి గట్టిగా భావమును కట్టిపెట్టి ఉన్నది. ఆమె యిక్కడ నాటుకొన్న యనురాగాన్ని సళ్ళించదు.

రాజు.—నామనస్సుకూడ అట్లే తలపోయుచున్నది ఏలన తరలునపుడు ప్రేయసి,

క. తనవశము గానిమెయితోఁ జనుచున్నా మీఁద నునిచె స్వవశంబునెదన్
స్తనకంపకృత్యలక్ష్యంపునిడుదక్రొవ్వేఁడియూరుపులచేతబలెన్. 36

విదూః— ఆత్మగతము ఏక్షణములో ఈయనగారు ఆభూర్జపత్రాన్ని వేర్కొంటాడో అని నాగుండె తటతట కొట్టుకొంటూ వున్నది.

రాజు.—ఇపుడు దేనితో నాదృష్టిని లాలింతును ? స్మరించి ఆ! ఓయి, ఆభూర్జపత్రమును తేవోయి.

విదూ.—[విషాదము నటించి] అయ్యో అగపడదే! ఓయి, ఆ భూర్జపత్రము దివ్యము, కనక ఉర్వశితో కూడా నేపోయింది.

రాజు —మూర్ఖుఁడు, అన్నిటను ప్రమాదియే. వెదకవోయి వెదకు.

విదూ.—[లేచి] ఇదుగో ఇక్కడ ఉంటుంది, ఇక్కడ ఉంటుంది

[అని వెదకుట నభినయించును.

[అంతట సపరివార దేవి కాశిరాజపుత్త్రి ప్రవేశించును.]

దేవి.—ఒసే నిపుణికా, నీవు చెప్పితివే! 'మాణవకయ్యతో గూడ ఆర్యపుత్త్రుడు ఈతీగయింట ప్రవేశిస్తుండగా చూస్తి' నని, ఆమాట నిజమేనా ?

నిపు.—నే నెప్పుడయినా లేనిదానిని భట్టినికి విన్నవించి ఉంటినా?

దేవి.—అటయితే తీగలచాటున ఉండి విందాముకానీ, ఇతని నమ్మకపు సంభాషణలని; నీవు చెప్పినట్టు సత్య మవునో కాదో అని

నిపు —భట్టిని ఆజ్ఞాపించినట్లు.

దేవి.—[పరిక్రమించి] ఒసే నిపుణికా, ఇదేమిటే పాతవేలికలాగ దక్షిణపుగాలికి ఇటే కొట్టుకొని వస్తూవుంది ?

నిపు.—[విభావించి] భట్టిని, దొర్లడంలో పాడకట్టుతూవున్న అక్షరాలతోటిది భూర్జపత్రము సుమా యిది. ఆహా! భట్టినియందె మొనకే తగులొంటున్నది [కైకొని] ఏమి ? చదువుదునా ?

దేవి —నీలోనీవు చదువుకో, విరుద్ధము కాదేని నాకు వినిపించు.

నిపు.—అట్లే చేసి భట్టిని, ఆగుట్టే అని తోస్తున్నది. భర్తను గూర్చి ఉర్వశి అల్లిన కవనబంధంగా కనపడుతూవున్నది. మాణవకయ్య ప్రమాదంమూలాన మనచేతులోపడ్డది.

దేవి.—అటయితే దానియర్థాన్ని తెలుసుకొంటాను.

[రాజు మున్ను చదివినదానిని నిపుణిక చదువును.

దేవి.—ఇక్కడ ఇదే చేకానుకగా అచ్చర కాముకుని దర్శిస్తాను.

[అని పరిజనసమేతముగా తీవయింటి కరుగును.

విదూ.—ఓయి వయస్యా, ఏమిటి ఇది? ప్రమదవనము చెంగటి ఆటకొండ పర్యంతాన కనబడుతున్నది?

రాజు.—[లేచి] భగవానుఁడా, వసంతప్రియుఁడా, దక్షిణ మారుతుఁడా,

ఉ. తావికినై హరింపుము లతాసుమధూళి వసంతసంభృతం,
బీవగ నాకుఁ గూర్మి హృదయేశ్వరిపంపుస్వహస్త పఁటుదే!
ఈవహి యాపివోదముల నే మదనార్తుఁ ప్రాణ ముండు నం
చీవ యెఱుంగు దంజన కహీనత మేల్పడి ప్రాణిప్రాణమా. 37

నిపు—భట్టిని, దీన్నే వెతుకుతున్నారు.

విదూ.—ఓయి, మూసిపోతూవున్న కేసరాలకాంతితోడి నెమలి పురిచేత మనము మోసపోతిమి.

రాజు.—ఎల్లవిధములను చెడితిని.

దేవి.—[సమీపించి] ఆర్యపుత్త్రుఁడా, ఆకులపడకు, ఇదుగో ఆ భూర్జపత్త్రము.

రాజు.—[సంభ్రమముతో] అహో దేవి! స్వాగతము దేవికి.

విదూ.—[అపవారించి] ఇపుడు దురాగతము అయినది.

రాజు.—వయస్యుఁడా, ఇపుడు ఇందుకు ఏమి ప్రతిచేయవలయును?

విదూ.—దొంగసొత్తుతో దొరికిన దొంగకు ప్రతివచనం ఉంటుందా?

రాజు.—దేవీ, నేను దీనిని వెదకుచుండలేదు, వేఱొకదానిని వెదకుట యిది.

దేవి.—తనసౌభాగ్యమును ప్రచ్ఛాదించడం తగినదే.

విదూ.—అమ్మా, ఈయనకు పైత్త్యోపశాంతి చేయగలభోజనం త్వరగా సిద్ధం చేయించు.

దేవి.—నిపుణికా, బ్రాహ్మణుడు శోభనముగా వయస్యుని ఆశ్వాసిస్తున్నాడు.

విదూ.—అమ్మా, చూడు కుటీ, పిశాచం కూడా భోజనంచేత ఆశ్వసిల్లుతుంది.

రాజు.—మూర్ఖుడా, నన్ను బిట్టు అపరాధినిగా తెలుపుచున్నావు

దేవి.—మీయందపరాధము లేదు. నేనే ఇందులో అపరాధను; వలన, నేను ప్రతికూలదర్శన నై మీయెదుట నిలుచుచున్నాను. నేటనుండి వెళ్తాను. [కోపము నటించి తరలును.

రాజు.—

తే. ఏ నగుదుఁగాక యపరాధినే క్షమింపు,
ముదుగు సంరంభగతిని రంభోరుకాండ,
సేవ్యజన మిట్లు కోపంబు చెంది యుండ
దాసునికి నెట్లు నిరపరాధత ఘటించు. 38

[అని పాదములం ద్రెళ్లును.

దేవి.—(ఆత్మగతము) మెత్తమనసు దానిని నేను ఈ బతిమాలడంచేత ఉబ్బకుందునుగాక. కాని, నిర్దాక్షిణ్యము వహించునందుకు కలిగే పశ్చాత్తాపానికి వెరుస్తాను.

[రాజును విడిచి పరివారముతో నిష్క్రమించును.

విదూ.—వర్షానదివలె అప్రసన్నగానే వెళ్లినదిదేవి లేవోయి లే.

రాజు.—(లేచి) ఇది అనుపపన్నము గాదు. చూడు:—

తే. ఊనరసము లౌ ప్రియోక్తులు నూత్నైనఁ
బ్రియునియనునయంబు ప్రియుల కెపుడుఁ
దాఁక నేర దెదను దద్విదులకుఁ గృత్రి
మంపుటెలుపువన్నె కెంపువోలె. 39

విదూ.—నీ కిప్పు డిది అనుకూలమే. కళ్లు కలగినవాడు ఎదట దీపశిఖను ఓర్వలేడు గదా.

రాజు.—అట్లుగాదు. నామనసు ఉర్వశిని తగులుకొన్నను, నాకు దేవియందు ఆయిప్పటిబహుమానమే కాని, నాప్రణిపాతమును అతిక్రమించినది గావున నేను దేవివిషయమున ధైర్య మవలంబించెదను.

విదూ.—నీధైర్యముమాట అటుండనీ, ఆకలిగొన్న బ్రాహ్మణుని ప్రాణములను కాపాడడానికి నీవు యత్నించు, స్నానభోజనాలు కానీయడానికి ఇది సమయంగదా.

రాజు.—[మీఁదికి చూచి] పగలు సగము కడచినది.

తే. ఉలికి వేఁడికి నెమలి గూర్చుండు సరగ
వలిఁ దొలఁకుతరుమూలాలవాలమందు,
కొండగోఁగున ముకుళింపుఁగొనను దెఱచి
లోన నిందిందిరమ్ము తా లీన మగును.

తే. క్రాఁగినజలంబు విడఁ దన్ని కన్నెలేడి
గట్టునను మెట్టదామరచెట్టుఁ జేరె;
కేళిగృహమునఁ బంజరకీర మదిగొ
వినుము క్లాంతమై పారెడు వేఁడు జలము. 40

[అందఱు నిష్క్రమింతురు.

ద్వితీయాంకము ముగిసినది.

## మిశ్రవిష్కంభకము.

[అంతట ఇరువురు భరతశిష్యులు ప్రవేశింతురు.]

ప్రథముఁడు.—చెలికాఁడా, పైలవుఁడా, మహేంద్ర మందిర మునకు పోవుచు ఉపాధ్యాయులవారు నీచేతికి ఆసనమిచ్చిరి. నన్ను గృహసంరక్షణకై నిలిపిరి. కావున నడిగెదను. గురువుగారి ప్రయోగ మును దేవసభ మెచ్చుకొన్నదా ?

ద్వితీయుఁడు.—గాలవా, మెచ్చుకొన్నదో లేదో చెప్పలేను. కాని, సరస్వతి రచించిన లక్ష్మీస్వయంవరం అనే ఆ కావ్యబంధంలో ఆయా రసాంతరాలలో సభ తన్మయమైపోయింది కాని,

ప్రథ.—ఏమో తప్పు సంభవించినదని చెప్పుచున్నావు.

ద్వితీ.—అవును, అందులో ఉర్వశి వాక్కులో పారపాటు కలిగింది.

ప్రథ.—ఎట్లు ?

ద్వితీ.—లక్ష్మీవేషంలో ఉన్న ఉర్వశిని వారుణివేషంలో ఉన్న మేనక అడిగింది:—'సఖీ, త్రైలోక్యమహాపురుషులు సకేశవులు లోక పాలురు వీరే వచ్చిఉన్నారు; ఇందులో ఎవరిమీద నీమనస్సు తగులు కొంటున్నదో చెప్పు' అని.

ప్రథ.—తర్వాత తర్వాత ?

ద్వితీ.—అంతట ఆమెనోటినుండి 'పురుషోత్తమునిమీద' అని రావలసిఉండగా, 'పురూరవసునిమీద' అని వ్రాక్కు వచ్చినది.

ప్రథ.—ఇంద్రియములు కానున్న దానిని అనుసరించునవి. అం దుకై ఆమెమీఁద గురువు కోపగింపలేదా ?

ద్వితీ.—ఆమెని ఒజ్జ శపించినారు. మఱి మహేంద్రుడు ఆమెని కనికరించినాడు.

ప్రథ.—ఎట్లు ?

## మిశ్రవిష్కంభకము.

[అంతట ఇరువురు భరతశిష్యులు ప్రవేశింతురు.]

ప్రథముఁడు.—చెలికాఁడా, పైలవుఁడా, మహేంద్రమందిరమునకు పోవుచు ఉపాధ్యాయులవారు నీచేతికి ఆసనమిచ్చిరి. నన్ను గృహసంరక్షణకై నిలిపిరి. కావున నడిగెదను. గురువుగారి ప్రయోగమును దేవసభ మెచ్చుకొన్నదా?

ద్వితీయుఁడు.—గాలవా, మెచ్చుకొన్నదో లేదో చెప్పలేను. మఱి, సరస్వతి రచించిన లక్ష్మీస్వయంవరం అనే ఆ కావ్యబంధంలో ఆయా రసాంతరాలలో సభ తన్మయమైపోయింది కాని,

ప్రథ.—ఏమో తప్పు సంభవించినదని చెప్పుచున్నావు.

ద్వితీ.—అవును, అందులో ఉర్వశి వాక్కులో పొరబాటుకలిగింది.

ప్రథ.—ఎట్లు?

ద్వితీ.—లక్ష్మివేషంలో ఉన్న ఉర్వశిని వారుణివేషంలో ఉన్న మేనక అడిగింది:—'సఖి, త్రైలోక్యమహాపురుషులు సకేశవులు లోకపాలురు వీరే వచ్చిఉన్నారు; ఇందులో ఎవరిమీద నీమనస్సు తగులుకొంటున్నదో చెప్పు' అని.

ప్రథ.—తర్వాత తర్వాత?

ద్వితీ.—అంతట ఆమెనోటినుండి 'పురుషోత్తమునిమీద' అని రావలసిఉండగా, 'పురూరవసునిమీద' అని వాక్కు వచ్చినది.

ప్రథ.—ఇంద్రియములు కానున్నదానిని అనుసరించునవి. అందుకై ఆమెమీఁద గురువు కోపగింపలేదా?

ద్వితీ.—ఆమెని ఒజ్జ శపించినారు. మఱి మహేంద్రుడు ఆమెని కనికరించినాడు.

ప్రథ.—ఎట్లు?

# తృతీయాంకము.

[అంతట కంచుకి ప్రవేశించును.]

కంచుకి —

ఉ. వేసవప్రాయమం దనుభవింపుదు రెల్లకుటుంబు లర్థముల్,
తోకములం దనంతరము ద్రోచి భరంబు భజింతు రూఱటన్;
మాకయినన్ శరీరమును మాల్చుచు నిచ్చలు వార్ధకంబునన్
బైకొను సేవ యంచుఁ జెలి! పైదలులం దధికార మక్కటా! 41

(పరిక్రమించి) నియమస్థురాలు కాశిరాజపుత్రి నన్ను ఆదేశించి నది ఏమనగా—"నేను వ్రతము కొఱవేర్చుకొనుదాననై అలుక ఉజ్జగించి నిపుణికముఖముగా మహారాజును పూర్వము వేడియున్నాను. దానినే నీవు నామాటవలన విన్నవింపుము." అని. నేనును ఇప్పుడు సంధ్యాజాప్యమును ముగించుకొన్న మహారాజును చూచెదను. (పరిక్రమించి, చూచి,) రాజభవనమందు దివసావసానవృత్తాంతము రమణీయముగదా. ఎట్లన, నిచట,—

మ. నిలుచున్ మల్లినయట్లు మన్కిగడలన్ నిద్రాలసంబుల్ శిఖుల్,
వలభుల్ భాసిలు జాలధూపములచేఁ బారావతాధ్యక్రియన్,
బలిపుష్పాంచితమైనతావులను బ్రజ్వాలంబులన్ సాంధ్యమున్
గళదీపంబులఁ బంతు రాచరణనిక్తల్ వృద్ధ లంతఃపురిన్. 42

(నేపథ్యమువైపుచూచి) అహో మహారాజు ఇట్లే వచ్చుచున్నాడు.

తే. చుట్టురాఁ గరదివ్వెలఁ బట్టి కేల
మూడిగపుటాండ్రు గొలిచి రా, నొప్పు నితఁడు,

కొండగోఁగులు తటములనిండఁ బూన,
జట్టుపలుపోమిఁ జరియించు శైల మనఁగ. 43

ఈయనను దృష్టిపథములో నిలిచి ఎదురుచూచెదను.

[అంతట యథానిర్దిష్టుఁడు రాజు ప్రవేశించును, విదూషకుఁడును.]

రాజు.— (ఆత్మగతము)

తే. పనులలోఁ జొచ్చి యుత్కంఠ వెనుక కుంచి
పవలు గడపితి నంతగా బాధపడక,
అకలితవినోదమై దీర్ఘ యామ మగుచు
నొంచురాతిరి నెట్లు వేగించువాఁడ. 44

కంచుకి.— (సమీపించి) జయము జయము దేవరకు దేవేరి విన్నవించుచున్నది:— "మణిహర్మ్యము మీఁద చంద్రుఁడు ఎంతయు మనోహరముగా నగపడును. అచట సన్నిధియొసంగు దేవరతోఁగూడ రోహిణీ సంయోగము దాఁక ఎదురు చూచుచుండఁ గోరుచున్నాను" అని.

రాజు.— ఆర్యుఁడా, లాతవ్యుఁడా, దేవితో 'నీయిచ్చ' అని విన్నవింపుము.

కంచు.— ఏలినవారి యాజ్ఞ. [అని నిష్క్రమించును.

రాజు.— వయస్యా, దేవేరియారంభ మిది, ఏమి పారమార్థికముగా వ్రతము నిమిత్తమే అగునా?

విదూ.— ఓయి నాకు తోస్తుంది. దేవిగారు పశ్చాత్తాపం పొందినదై నీప్రణిపాతపు ఉల్లంఘనాన్ని వ్రతమిషచేత తుడిచివెయ్యడానికి కోరుతున్నది. అని.

రాజు.— ఉపపన్నమునే నీవు చెప్పితివి. అట్లే గదా.

క. ప్రణతిఁ లంఘించి తొలిఁ
వెనుకం దాపంబు నొంది వినిగూఢముగా

ననునయము లొసఁగి ప్రియునికి
మనస్వినులు మాన్పికొంద్రు మదిలోనిత్రపఁ. 45

కనుక మణిహర్మ్యముమీఁదికే మార్గము చూపుము.

విదూ.—ఇటు ఇటు గంగాతరంగాలలాగు శోభిస్తూవున్న యీ స్ఫటికమణిమెట్లమీదుగా ప్రదోషావసరరమణీయాన్ని మణిహర్మ్యాన్ని ఎక్కవయ్యా.

రాజా.—నీవు ముందుగా ఎక్కు.

[అందఱు మెట్లెక్కుట నభినయింతురు.

విదూ.—[చూచి] ఓయి చంద్రోదయం కానున్నది. కనుకనే చీకటి వదలుతున్న తూర్పుదిక్కు మొగము వెలుతురుచేత సొంపెక్కుతూవుంది.

రాజా.—నీవు సరిగానే చెప్పితివి.

ఆ. ఉదయతటిమఱుఁగున నున్న యిందుని కాంతి
తమము నచటినుండి దవ్వు తఱుమఁ,
గుంతలములు దీర్చుకొన్న తీరున నాదు
కనుల నింద్రదిఙ్ముఖంబు తనరు. 46

విదూ.—హీహీ! ఓహో! ద్విజాతులరే డితడు కలకండమోదకపుసిరిగలవాడు ఉదయించినాడు.

రాజా.—[స్మితముతో] ఉదరపరాయణునికి ఎల్లయెడలను తిండిమీఁదనే లోకము. [చేతులు మోడ్చి ప్రణమిల్లి] భగవంతుఁడా, యామినీరమణా!—

తే. సాధువులక్రియకై నీవు సవితఁ జొత్తు,
సుధ యొసఁగి తనియింతువు సురలఁ బితల,
రేలు పర్వెడుతమము వారింతువయ్య,
గిరిశచూడాహితాత్మ, మ్రొక్కెదను నిన్ను. 47

[అని లేచును.

విదూ.—బ్రాహ్మణునినోటితో పలుకుచున్న నీపితామహుని చేత అభ్యనుజ్ఞాతుడవై నీవు ఆసనపరిగ్రహం చెయ్యి, నేనున్ను సుఖాసీనుడ నౌతాను!

రాజు.—[అట్లే విదూషకునిమాట నంగీకరించి కూర్చుండి పరిజనముం గాంచి] పట్టపగలుగా వెన్నెల గాయుచుండఁగా దివ్వెటీ లేల? చెలువలారా, మీరు విశ్రమింపుఁడు.

పరిజనము.—ఏలినవారియాజ్ఞ. [అని నిష్క్రమింతురు.

రాజు.—[చంద్రునిం గాంచి] వయస్యుఁడా, ఇఁక నొక ముహూర్తమునకు దేవి వచ్చును. కనుక ఏకాంతమున నాయవస్థను వచించెదను.

విదూ.—ఎందుకూ? అగపడుతూనేవున్నది అది. అయినాగాని, అటువంటి యనురాగం చూడగా ఆసముడిచేత ఆత్మను నిలుపుకోవడం శక్యమే.

రాజు.—అట్లే ఇది. కాని, నామనస్సులోని యభితాపము కడిఁదిగా నున్నది.

ఆ. విషమశిలలచాలు వేగంబునుడిపిన
యేటిజాలు వోలె నింతితోడి
పొందు విఘ్ననిహతిఁ బొందినకతమున
శతగుణత్వ మొందు స్వాంతశయుఁడు. 48

విదూ.—అంగములు కృస్సిపోవుచున్నను అధికంగా శోభిస్తున్నావు. అందువల్ల నీకు ప్రియాసమాగమము చెంతనే ఉన్నదనితలుస్తాను.

రాజు.—[నిమిత్తమును సూచించి] వయస్యా,

క. గురుశోకాతురు నన్ను
నెరకోర్కులు గొల్పునుడుల నీ వెటులో యటుల్
కర మాశ్వాసించు బలే!
స్ఫురణములన్ దక్షిణంబు భుజ మిది మిత్రా. 49

విదూ.—బ్రాహ్మణునివచనం తప్పదు గదా.

[రాజు సప్రత్యాశముగా నుండును.

[అంతట ఆకాశయానమున అభిసారికావేష ఉర్వశియు,
చిత్రలేఖయు ప్రవేశింతురు.]

ఉర్వశి.—[తన్ను తాను చూచుకొని] సఖి చిత్రలేఖా, అల్పాభరణభూషితము నల్లని వీణాంశుకంతోడి యీయభిసారికావేషము నీకు అందగిస్తూ ఉన్నదా?

చిత్ర.—వర్ణించడానికి నాకు వాగ్వైభవము లేదు. ఇట్లు తలుస్తున్నాను, నేను పురూరవుణ్ణి అవుకుచు గాక, అని,

ఉర్వశి.—సఖి, మదనుని ఆన నీకు, నన్ను శీఘ్రంగా ఆసొబగుని యింటికి కొనిపొమ్మని.

చిత్ర.—ఇదుగో, మలిచిన కైలాసశిఖరంలాగ ఒప్పుతున్న ప్రియమిత్రుని భవనాన్ని దఱిసితివి.

ఉర్వశి.—అలాగైతే, ప్రభావంచేత తెలుసుకోవే ఆయన నాహృదయచోరుడు ఎక్కడ ఉన్నాడో ఏమి చేస్తున్నాడో.

చిత్ర.—[ధ్యానించి, ఆత్మగతము] కానీ, ఈమెను కొంచెము ఆడిస్తాను. [ప్రకాశము] సఖి, ఈయన మనోరథప్రాప్త మయిన ప్రియాసమాగమసుఖాన్ని అనుభవిస్తూ ఉపభోగక్షమమైన ప్రదేశంలో ఉన్నాడు. [ఉర్వశి విషాదము నటించును.

చిత్ర.—ఓసిగోలా, ప్రియాసమాగమానికి వేఱేచింత యేమున్నది?

ఉర్వశి.—[ఊఱడిలి] అదక్షిణము కాయొద సందేహపడినది.

చిత్ర.—[చూచి] వీడుగో మణిహర్మ్యముమీద వయస్యమాత్రసహాయుడు రాజర్షి. రా మఱి అతనిని సమీపింతాము.

[ఇరువురు దిగుదురు.

రాజు.—వయస్యుడా, రాత్రితోఁగూడ మదనబాధ పేర్చుచున్నది.

ఉర్వశి.—అర్థము బయలుపడని యీవచనంచేత నాగుండె తల్లడిల్లుచున్నది. అగపడకుండియే విందాముగాక మన సంశయము తీరిందాకా, వీరినమ్మకపు నుడువులు.

చిత్ర.—నీ కిచ్ఛయయినట్లు.

విదూ.—ఓయి అమృతము లీనుతున్న యీచంద్రపాదాలని సేవించు.

రాజు.—వయస్యుఁడా, ఈవ్యాధి, యిట్టి సాధనములకు కుదురునది గాదు చూడు:—

చ. సుమశయనంబు నూతనము, సోమునినిండుమరీచిపిండు, దే
హమున నలందుచందనము, నచ్చపుముత్తెపుఁజే, ర్లివన్నియున్
శమములు గావు నామనసిజాతరుజన్ గుదియింప; శక్త యా
యమరియున్—

ఉర్వశి.—మఱి యన్య ఎవతె?

రాజు.—

వివిక్తమున వ్యాహ్రియమాణము తత్కథాళియున్. 50

ఉర్వశి.—హృదయమా, నన్ను వదలి ఇతనిం గూడినందుకు ఫలమును నీవు ఇప్పుడు అనుభవించితివి.

విదూ.—అవును. నేనున్ను మిష్ట మయిన లేడిమాంసం తివ దొరకనప్పుడు దానిని వేడుతూ కీర్తిస్తూ ఊటఊడిల్లుతాను.

రాజు.—ఇది నీకు ఘటించును.

విదూ.—నీకున్ను అది త్వరలోనే ఘటించును.

రాజు.—సఖుఁడా, ఇట్లు తలంచెదను.

చిత్ర.—ఓసీ! అసంతుష్టురాలా, విను.

విదూ.—ఎట్లు ?

రాజు.—

క. ఆయింతి తేరికుదుపున
నైకై యేయీయాయంస మొత్తె నాత్మాంసముచే,
నాయంగ మిది యొకఁడె నా
కాయమునఁ గృతార్థమగా, మిగత భర మిలకుఁ. 51

చిత్ర.—ఇప్పుడు తామసింప నేల ?

ఉర్వశి.—[తటాలునఁ దటిసి] సఖి, నేను దరిసి ఎదుర నిలిచినా మహారాజు ఉదాసీనుడుగా నున్నాడే?

చిత్ర.—[స్మితముతో] మరీ వేగిరము చేత తిరస్కరిణిని తొలగింప వైతివి.

[నేపథ్యమున]

భట్టిని ఇటు, ఇటు.

[అందఱు చెవి యొగ్గుదురు. ఉర్వశి సఖితోఁగూడ విషాదము చెందును.]

విదూ.—ఓహో!వచ్చినది దేవి!కనక వాచంయముడవుగా వుండు.

రాజు.—నీవును గుట్టు దాఁచి యుండుము.

ఉర్వశి.—సఖి, ఇపు డేమి చేతాము ?

చిత్ర.—దిగులు పడవద్దు. మనము మఱగియున్నాము. రాజర్షి పట్టపుదేవి ఉపవాసవ్రతకృశగా కనబడుతున్నది. కనక ఈమె యిక్కడ చాలాసేపు ఉండదు.

[అంతట ఔపహారికహస్తపరిజన దేవి ప్రవేశించును.]

దేవి.—[పరిక్రమించియు చూచియు] ఓసే, నిపుణికా, వీడుగో భగవానుడు చంద్రుడు, రోహిణింగూడి అధికంగా శోభిస్తున్నాడు.

చేటి — సఖి దేవితోఁగూడితే భర్త విశేషరమణీయుఁడుగాఁడా?

[పరిక్రమించును.

విదూ.— [చూచి] ఓయి నాకు స్వస్తివాచనం ఇస్తుందో, కాక, నీకు వ్రతమిషచేత రోషము మాని ప్రణిపాతలంఘనాన్ని తుడిచివేసుకో గోరి యున్నదో, ఎఱుగను, గాని, ఇపుడు నాకండ్లకు శుభదర్శనగా ఉన్నది దేవి.

రాజు.— [స్మితముతోఁ] ఉభయమును ఘటిల్లును. అయినను నీవు పిమ్మట చెప్పితివే అది నన్ను గుఱించినదిగా తోఁచుచున్నది. ఏలన ఈ మహనీయురాలు—

ఉ. ధౌతదుకూలయుగ్మమును దాలిచి మంగళమాత్రభూషయై,
పూతము లైన లేఁగఱిక మోసులఁ జూర్ణకచాళిఁ జెర్వియున్
చేతములోనిగర్వ ముపచిత్ర్యపదేశమునన్ ద్యజించియున్
గాతరనేత్ర నాపయిని గన్నప్రసాదముఁ దెల్పు నేననే 52

దేవి — [దఱిసి] జయము జయము ఆర్యపుత్రునికి.

విదూ.— దేవిగారికి స్వస్తి.

రాజు — దేవికి స్వాగతము.

[ఆమెను చేతఁబట్టి కూర్చుండఁబెట్టును.

ఉర్వశి — సఖి, ఈమె దేవీశబ్దముచేత ఉపచార మొందుట యుక్తమే. తేజములో శచికి ఏమాత్రము తక్కువపడదు.

చిత్ర — బళి, అసూయావిముఖంగాఁ పల్కితివి

దేవి.— ఆర్యపుత్రుని పురస్కరించుకొని నే నొకానొక నోము నోచవలసి ఉన్నది. అందుకై ముహూర్తము సేపు ఆకను సహింపవలెను.

రాజు.— అట్లనవలదు. ఇది ఆక యెట్లు? అనుగ్రహము గదా.

విదూ — స్వస్తివాచనము కలదైన యిటువంటి నిర్బంధము తరచుగా కలుగునుగాక.

రాజు.—దేవి చేసెడి యీనోము పే రేమి?

[దేవి నిపుణికం గాంచును]

నిపు.—దేవరా, దీనిపేరు ప్రియానుప్రసాదనము.

రాజు.—[దేవిని చూచి] అట్లే?.

తే. గాత్రమును బిసమృదువు నకారణముగ
నీవ్రతముచేతఁ గల్యాణి యేల వాడ్చ?
చాఁచు నెవఁడంజలిని నీప్రసాదమునకు
ననునయింతువె యాదాసజనుని నీవు? 53

ఉర్వశి.—ఈమెయందు ఇతనికి బహుమానము మిక్కుటంగా నున్నది.

చిత్ర.—ఓసిబేలా, ప్రేముడి ఒరులపా లయినపుడు నాగరకులు అధికంగా దాక్షిణ్యము చూపుతారు.

దేవి.—[సస్మితముగా] మఱి యీనోము నోచడంవల్ల ఈప్రభావము; ఏమన, ఆర్యపుత్రుడు ఈపాటియేని పల్కరించినాడే.

విదూ.—ఊరకోవయ్యా! మంచిమాటను నిరాకరించకూడదు

దేవి.—పిల్లలారా, పూజాద్రవ్యాలని తెండి, మణిహర్మ్యమందున్న చంద్రపాదములను పూజిస్తాను.

పరి.—ఇదుగో, గంధము పువ్వులు లోనైన యుపహారము.

దేవి.—[నాట్యమున గంధపుష్పాదులతో చంద్రపాదములను అర్చించి] ఒసే, ఈయుపహారమోదకాలని మాణవకయ్యకు సమర్పించండి.

పరి.—దేవియాజ్ఞ. మాణవకయ్యా, ఇదుగో ఇది నీకు.

విదూ.—[మోదకాలపళ్లెరముం గైకొని] అమ్మా, నీకు స్వస్తి. నీయుపవాసము బహుఫలము అగుగాక.

దేవి.—ఆర్యపుత్రుడా, ఇటు.

రాజు.—ఇదె ఉన్నాను.

దేవి — [నాట్యముచే రాజును పూజించి, చేమోడ్పుతో మొ్రక్కి] ఇదుగో నేను ఈదేవతాదంపతులను రోహిణీహరిణాంకులను సాక్షీకరించి ఆర్యపుత్రుని అనుప్రసన్నుని చేస్తున్నాను. ఇది మొదలుకొని ఏ చెలువను ఆర్యపుత్రుడు వేడునో, ఎవతె ఆర్యపుత్రుని సమాగమానికి ఉవ్విళ్లూరుతుందో, ఆచెలువతో నేను ప్రేమబంధముతో వర్తింపవలయు నని.

ఉర్వశి — అహో! ఈమాటకు అభిప్రాయమేమో ఎఱుగకున్నాను. నాకు మటి హృదయము విశ్వాసముచేత విశదమైనది.

చిత్ర. — సఖి, మహానుభావురాలు పతివ్రత నీకు అనుజ్ఞ యిచ్చింది, ఇక నిర్విఘ్నంగా నీకు ప్రియసమాగమం కలుగుతుంది.

విదూ. — [అపవారించి] చెయి తెగిన చెంబడివాడు చేప తప్పించుకొనిపోగా 'ఇందువల్ల నాకు ధర్మం కలుగుతుంది' అని చెప్తాడు. [ప్రకాశము] అమ్మా, ఏమి నీకు అట్టి ప్రియుడా ఈదొడ్డవాడు ?

దేవి — మూర్ఖా, నేను నాసుఖమును మానుకొని ఆర్యపుత్రుని సుఖితశరీరుని చేయడానికి కోరుతున్నాను. అందువల్ల తెలుసుకో ప్రియుడో కాడో అని.

రాజు. —

క. ఈఁగల నొండొక తెకుఁ, గ్రైకోఁగల పీదాసు నీవు కొమ్మ; యమైనఁ,
నేఁ గా నట్టిఁడ నెట్టినిఁ, గాఁ గొంటివా నను నకాండ కాతరమతి వై.

దేవి. — అవుదువో కావో, ఉద్దేశించినప్రకారము ప్రియాను ప్రసాదవ్రతము నెఱవేఱినది. పిల్లలారా రండి వెళ్దాం. [దేవి తరలినది.

రాజు. — ప్రేయసీ, ఇపుడు నన్ను వదలిపోయెదేని నేను ప్రసాదితుఁడను గాను.

దేవి. — ఆర్యపుత్రుడా, నే నెప్పుడు నియమమును ఉల్లంఘించినదాన్ని కాను. [దేవి సపరివార నిష్క్రమించును.

ఉర్వశి.—సఖీ, రాజర్షి ప్రియకళత్రుడు, మఱి నేను హృదయాన్ని ఆపుకోలేక ఉన్నాను.

చిత్ర.—అయితే, నీవు నిరాశవై నివర్తిస్తావా ?

రాజు.—[ఆసనముం బొంది] వయస్యా, దేవి దూరముపోయి యుండదు.

విదూ.—చెప్పదలచుకొన్నమాటను జంకు లేకుండా చెప్పు. రోగము అసాధ్యమని వైద్యుడు రోగిని విడిచి వేశినట్లు, నిన్ను ఆ యిల్లాలు స్వచ్ఛందవర్తినిగా వదలివేశింది.

రాజు.—మఱి ఉర్వశి నేమయినా—

ఉర్వశి.—కృతార్థురాలు అగునా!

రాజు.—[కుళకము]

తే. లీనరై యుందెరవళిమాత్రాన నాదు
వీనుదోయికి విందుగావించునొక్కొ ?
వెనుక కల్లన వచ్చి నావీక్షణములఁ
ముగ్ధకరపంకజములతో మూయునొక్కొ ?

తే. హర్మ్యతలమున నిచటఁ దా నవతరిల్లి
మలసి మందాక్షమందాయమాన యగుచు
నడుగడుగు గాఁగఁ బెట్టించి గడుసుఁజెలియ
బలిమిఁ దేర నాకడకుఁ దా వచ్చునొక్కొ ? 55

ఉర్వశి.—సఖీ, ముందుగా, ఇతని యీకోరికను తీరుస్తాను.
[వెనుకకుఁ బోయి ఱేనికన్నులను మూయును.]

చిత్రలేఖ విదూషకునికి సన్న సేయును.

రాజు.—[స్పర్శ రూపించి] చెలికాఁడా, ఈ వరారోహ నారాయణునితొడనుండి జనించినట్టిది.

విదూ.—నీవు ఎట్లు తెలిసికొంటివి ?

రాజు.—ఇందు తెలియని దే మున్నది ?

క. స్మరశరజర్జరితం బీ
శరీర మింక నెవతెచేతిస్పర్శముఁ దనియున్!
హరిణాంకాంశువులకుబలెఁ
దరణికిరణములకుఁ గలువ దాల్చదు తనువున్. 56

ఉర్వశి.—[చేతుల నెడలించి లేచి కొంచెము ఆవలికి జరిగి] జయము జయము మహారాజు గారికి.

రాజు.—సుందరీ, స్వాగతేము.

[తనతో ఏకాసనముందే కూర్చుండఁ బెట్టును.

చిత్ర.—వయస్యునికి సుఖమా ?

రాజు.—నిశ్చయముగా సమకూడినది.

ఉర్వశి.—సఖి, మహారాజును దేవి యిచ్చినది, అందువల్ల ప్రణయినివలె ఈయనతో శరీరసంపర్కం పొందితిని; అంతేగాని నాయందు సౌభాగ్యగర్వాన్ని సమర్థించకు.

విదూ.—ఏమి! ఇక్కడనే మీాకు పొద్దు కుంకినదా?

రాజు.—[ఉర్వశిని చూచి]

క. దేవి యొసంగిన దనిమే
యీావపువున వ్యాపృతిన్ వహించెదవేనిన్,
ఏ వారియనుమతంబున
నీవు తొలుత మ్రుచ్చిలించి తీహృదయంబున్ ? 57

చిత్ర.—వయస్యా, ఈమె చెప్పగల ఉత్తరము లేదు. ఇపుడు నావిన్నపము నాలకించు.

రాజు.—అవహితుఁడను.

చిత్ర —వయస్యుడా, ఆమనితర్వాత వేసవిలో నేను సూర్య భగవంతుని ఉపాసించవలశివున్నది. కనక ఈనాప్రియసఖి స్వర్గాన్ని స్మరించకుండా వుండేలాగు వయస్యుడు చేయవలెను.

రాజు.—కల్యాణీ.

తే. వర్ణనాతీతసౌఖ్యమై పఱలు దివము,
దాని మఱపింప నెవ్వాఁడు దంట యగును?
ఈరమణికైన విను మీపురూరవుండు
దాసుఁ డగుఁ దాననన్యసాధారణుండు. 58

చిత్ర —అనుగృహీతనైతిని. సఖి ఉర్వశీ, అలందురక నన్ను వీడ్కొల్పుము.

ఉర్వశి.—[చిత్రలేఖను కౌఁగిలించి] సఖి, నన్ను మఱవకుమా.

చిత్ర.—[స్మితముతో] వయస్యునితోకూడిన నిన్నే నేను అట్లు వేడుకోవలసినదానను. [అని రాజునకు బ్రణమిల్లి నిష్క్రమించును.

విదూ.—ఆహా! కోరికతీరడంచేత నీవు వర్ధిలుతున్నావు.

రాజు.—ఎంత వర్ధిల్లుచున్నానసఁగా, చూడు.

శా. రాకేశాతపవారణం బిడ దటుల్ నానావనీరాజ చూ
డాకల్పోజ్జ్వలరత్నభాసిపదపీఠాప్తాధిరాజ్యంబు దాన్,
ఈకంజేక్షణపాదపీఠమున నే నేకాంతసేవాకృతి
శ్రీకిం బాత్రము నౌట యెట్లిడునో పూర్తిన్ జెందుధన్యత్వముల్.59

ఉర్వశి—ఇంతకన్న ప్రియతరము పల్కడానికి నాకు విభవం లేదు.

రాజు.—[ఉర్వశిని కేలఁ బట్టి] అహో! ఈప్సితలాభ మనఁగా విరుద్ధములు పెరుఁగుట గదా.

శా. ఆపాదంబులె య్యైందవంబులు పరాహ్లాదం బిడున్ మేనికిన్,
ఆపౌష్పేషవబాణసంతతులె పెల్లానంద మొందించెడిన్,

వపుం జూపుచు నేది యేది మును వన్నెంచెన్ సఖీ; యిష్ట దే
ప్రాపయ్యెన్ నినుఁ గూడ నా కనునయ ప్రాప్తంబువోలెన్ వెసన్.

ఉర్వశి.—విలంబము చేత ఆర్యపుత్త్రునియెడ అపరాధిని నైతిని.

రాజు.—కాదు అట్లు గాదు.

తే. ఎట్టకేలకుఁ గ్రుచ్చాళ్ళిన నెనసినట్టి, సుఖమె రసవత్తరంబయి శోభఁజెందు
వడకుసోలిన కతని నిర్వాణమొసఁగుఁ, జెట్టునీడ నరునకు విశేషముగను.

విదూ.—ప్రదోషరమణీయమైన చంద్రపాదాలని సేవించినావు, ఇప్పుడు నీకు పడకటిల్లు చేరడానికి సమయము.

రాజు.—అటయిన, నీసఖికి మార్గము చూపుము.

విదూ.—అమ్మా, ఇటు ఇటు [అని పరిక్రమింతురు.

రాజు.—ఇది ఇప్పుడు నాప్రార్థన.

ఉర్వశి.—ఏమని ?

రాజు.—

ఆ. శతగుణితయుఁ బోలె జరిగె మున్ను త్రియామ
యనుపగతమనోరథునకు నాకు,
అట్లె జరుగునేని యంభోజపత్త్రాక్షి
నీసమాగమమున నేను గృతిని. 6

[అని అందఱు నిష్క్రమింతురు.

తృతీయాంకము సమాప్తము.

# ప్ర వే శ క ము.

క. అనుఁగుసఖిఁ బాసి వనటం
బనవు సఖీయుక్త హంసి వ్యాకులమతిరై,
ఇనకరసంస్పర్శకు వి
చ్చినవెత్తామరలకొలనిసీమలయందుఁ. ౧

[అని చిత్రలేఖాసహజన్యల ప్రావేశికి ఆక్షిప్తిక]

[అంతట విమనస్క చిత్రలేఖయు సహజన్యయు ప్రవేశింతురు.]

[చిత్రలేఖ ప్రవేశాంతరమున ద్విపదికతో దిక్కులుచూచి]

[గేయము]

సఖి కనఁబడనియంత,
సరసునఁ గ్రందిలు వంత,
అశ్రులు వెల్లువ గాఁగ,
హంసీయుగము మది గ్రాఁగ. ౨

సహజన్య.—సఖి, చిత్రలేఖా, వాడిపోతూవున్న నూఱు రేకుల తామరపూవులాగు ఉన్న నీముఖంయొక్క ఛాయ నీ హృదయంలోపలి అస్వస్థతని తెల్పుతున్నది. నిదుఃఖానికి కారణమేమో చెప్పవే నీతో సమదుఃఖను కాగోరుతున్నాను.

చిత్ర.—సఖీ, సహజన్యా! అచ్చరలవంతువరుసను ఇక్కడ సూర్య భగవంతునికి పాదములసేవ నేను చేయవలశివున్నాను అందుచేత ఉర్వశి కోసము అధికంగా ఉత్కంఠితురాలి నై యున్నాను.

సహ.—ఎఱుగుదును మీయన్యోన్యప్రేమను. తర్వాత తర్వాత?

చిత్ర.—అంతట ఈదినములలో దానివృత్తాంత మేమో అని సంయమమున చూడగా అత్యాహితము కనబడినది.

సహ.—[ఆవేగముతో] ఏలాగు ?

చిత్ర —ఉర్వశి రాజ్యభారమును మంత్రులమీద ఉంచిన రతి సహాయుణ్ణి ఆ రాజర్షిని తోడుకొని విహారార్థమై గంధమాదనవనానికి వెళ్ళినది.

సహ.—అటువంటిస్థలములలో కలిగేది ఏదో అదేగదా సంభోగ మనగా తర్వాత తర్వాత ?

చిత్ర —అక్కడ మిన్నేటి యిసుకదిన్నెలలో క్రీడిస్తూ వున్న ఉదయవతి అనే విద్యాధరకన్యకను ఆ రాజర్షి తేరి చూచినాడని ఉర్వశి అలిగినది

సహ —సరే మిక్కుటమైన ప్రేమకు సహనముండదుగదా. తర్వాత తర్వాత ?

చిత్ర —అంతట, కాంతుడు ఎంత బతిమాలుకొన్నా మెత్తబడక ఉపాధ్యాయశాపహతహృదయ యై స్త్రీలు చొరరానిదైన కుమార వనం చొచ్చినది. చొచ్చినవెంటనే కారణాంతరముచేత ఈమెరూపము తీగగా మారిపోయినది.

సహ.—విధికి అసాధ్యము లేదు. అటువంటి అనురాగానికి ఆక స్మికంగా ఇటువంటి యీ యనర్థపరిణామము! ఇప్పుడు ఆ రాజర్షి యవస్థ యేమి ?

చిత్ర.—ఆయన ఆకానలోనే ప్రియతమను వెతుక్కొంటూ రేయింబగళ్లు గడుపుతూ వున్నాడు; వీతరాగులకుకూడా ఉత్కంఠను కలిగించే యీ మేఘోదయంచేత అనర్థముపాలయి పోయ్యేని.

[అనంతరమున జంభలిక]

[గేయము]

సఖి కనఁబడనియంత,
సరసున గ్రుందిలు వంత,

అశ్రులు వెల్లువ గాఁగ,
హంసీయుగము మది గ్రాఁగ. 3

సహ.—సఖి, అటువంటి ఆకృతివిశేషములు చిరకాలము దుఃఖభాజనములు కానేరవు. తప్పకుండ ఏదో అనుగ్రహరూపమైననిమిత్తము వారికి సమాగమకారణమవుతుంది. రా మరి, పొడువనున్న ప్రొద్దువేల్పును సేవింతాము.

[అనంతరమున ఖండధార

గేయము.

చింతావిదూనమానసయై
స్నిగ్ధాదర్శనలాలసయై
వికచపద్మాంచితనీరమున
విహరించు హంసి కాసారమున.

[అని నిష్క్రమింతురు.

ప్రవేశకము ముగిసినది.

# చతుర్థాంకము.

[గేయము]

క. కరిపతి సొచ్చె వనిఁ బ్రియా
విరహోన్మాదంబువలనివికృతిఁ దెలుపుచున్
తరుపతితకిసలయసుమో
త్కరమండిత మగుచు భూరికాయమ్మొప్పన్. ౫

[అని పురూరవుని ప్రావేశికి ఆక్షిప్తిక.]

[అంతట ఉన్మత్తవేషుఁడు రాజు ప్రవేశించును.]

రాజు.—ఆ! ఓరిపాపిష్ఠా రక్కసుఁడా, నిలునిలు. నాప్రేయసిం గొని యెట కేఁగెదవు? ఆ! కొండకొమ్మునుండి మింటి కెగసి నామీఁద బాణాలు కురిపించుచున్నాఁడు [బెడ్డ చేకొని కొట్టుటకు పరువిడుచు, అనంతరము ద్విపదికచే దిక్కులు సూచి]

[గేయము]

స్వాంతము సకి వగ యేర్చన్, సరసిం దాఁ జట్టుప లార్చన్
అశ్రుపూరితనయనుండై, హంసతరుణుఁడు దీనుండై. ౬

[పరికించి]

మ. ఇది సన్నద్ధము నూత్నవారిదము, గాఁ డింద్రారి గర్వాంధుఁ డీ;
య్యది యింద్రాయుధ మౌనుగాని; శ్రవణాంతాకృష్టమౌవిల్లు గా;
దిది యాసారము గాని, ముల్కితతి గా దీ హేమకాపాధ నా
హృదయాధీశ్వరియైన యుర్వశియుఁగాదే, శంప యౌ నక్కటా! ౬౭

[అని మూర్ఛిల్లిపడి ద్విపదికచే లేచి నిట్టూర్చి

క. మదిరేక్షణను హరించెన్, మదమున రక్కసుఁ, డనుచు భ్రమంబడితిని నే,
నది సూడ గ్రొమ్మెఱుఁగుఁదీవ దళత్తళలాడఁ బ్రబ్బి వర్షించెడి నే. 62

[ఆలోచించి] రంభోరువు ఎటకేఁగి యుండును ?

మ. కినుకన్ శక్తత దిచ్చ్వమో మయినదో? కిన్కం జికం బూనదే;
చనెనో నాకముఁగూర్చి నాయెడఁ గడున్ స్వాతంబు భావార్ద్రిమా;
కాని పో నాయెదురన్ దెగింపుదురె రక్షోవీరు లైనన్ సఖీ ?
కనుకన్ బ్రియ యత్తమిల్లె! నిటులన్ గారింతువే దైవమా! 63

[అని ద్విపదికచే] [దిక్కులం గాంచి, నిశ్వాసముతో] [అశ్రువులతో] దైవము విపరీతమయినవారికి దుఃఖమువెంట దుఃఖము సంభవించును ఎట్లనః—

ఆ. వచ్చె నిపుడె నాకుఁ బ్రాణనాయికతోడ
నోపరాని విరహతాపభరము,
అభినవాంబుధరము లాతపద్ధిన్ నడఁప
హితము లగుదినములు నివె తొడంగె 64

[అనంతరమున చర్చరి]

క. జలద, కినియకు, మదల; యవిరళధారాధౌతభాసురదిశాముఖుఁడా,
ఇలఁ గందునేని సకి, నవ్వల నీ వేమి పలిపిన నవారణ సైతున్, 65

[విహసించి] వ్యర్థముగా నేను నామనస్సులోని సంతాపవృద్ధిని ఉపేక్షించుచున్నాను. మునులుకూడ చెప్పుదురు గదా, 'రాజా కాలమునకు కారణము' అని. కనుక నే నేల మేఘర్తువును మాన్పివేయఁగూడదు.

[అనంతరమున చర్చరి]

[గేయము]

గంధమత్తమధుకరకలగానము, వాద్యమానపికవాద్యధ్వానము
పవనోద్వేల్లితపల్లవపూరము, ఆడెడిఁ గల్పక మభినయసారమున్

[అని వర్తించి] వలదు. వార్షికచిహ్నములచేతనే నాకు రాజోప
చారములు ఇపుడు జరుగుచున్నవి. ఎట్లన,

తే. మించుఁబొన్నించు మేఘంబె మేలుకట్టు,
వీచుఁ బూరెమ్మచామరల్ వేతసములు,
వందు లగు ఘర్మ మఱ నెలుంగొందుశిఖులు,
సెలసరులఁ గానుకలిడెడు వేరు లగు గిరులు. 65

కానీ, ఇట్లు నాపరిచ్ఛదమును శ్లాఘించుకొన్న నేమి ఫలము? ఈ
యడవిలోనే ఆ ప్రియను వెదకెదనుగాక.

మరల చర్చరీపాఠాంతమున భిన్నకము]

[గేయము]

అబలావిరహితుఁ డతిదుఃఖితుఁడు, దైవము దూరుచు స్తంభితుఁడు
భూధరవనమునఁ బుష్పోజ్జ్వలమున, గజరాజేగెడి తుణగమనమున.

[చూచి] అయ్యో, వెదకఁ దొడఁగిన నాకు సందీపనమువలె
అయినది. ఏలన,

తే. గర్భజలకణము లారక్తరేఖములు నయిన
పుష్పములచేత నిదె నవభూమికదళి
కినుక నంతరశ్రుపూర్ణనవనితకనుల
నుత్కలితోడ స్మరియింప నూన్చె నన్ను. 66

ఈదారిని పోయియుండినను ఆమహానీయను ఎట్లు కనిపట్టనగును?

తే. అడుగులిలమీఁద మోపె నే నాసుగాత్రి
వానఁ దడియును మైన యీావనతలమున,
శ్రోణిభరమున మడములు క్రుంగఁ బాలు
యావకపుఁజారుపదపంక్తి యగపడెడిని. 67

[ద్విపదికచే ప్రరిక్రమించి హర్షముతో] దొరకినది గుర్తు, దీని
చేత ఆకోపనమార్గమును ఊహింప నగును.

తే. మగ్ననాభి రుమాసంభ్రమగతి దడువఁ
గాఉనశ్రుల మోవిరాగంపుగుర్తు
లైనది యిది శుకోదరశ్యామలంబు
చ్యుతము నిస్సంశయము స్తనాంశుకము! బళిరె. 68

(అరసి ఏమి) ఇంద్రగోపములతోఁడ క్రొత్తపచ్చిక బయలు ఇది. ఈనిర్జనవనమున ప్రియావృత్తాంతము ఎట్లు తెలియును? (చూచి) ఆహా! జడివానకు ఉబ్బినశిలాజతుస్థలి పాషాణము నెక్కి,—

ఆ. తూర్పుగాలిజుట్టుఁ ద్రోచుచు నుండఁగ
నంబుదముల నెమలి యట్టె గాంచు,
గర్భమందు గేక గ్రాలుకంఠంబును
సాఁగినంతపయికి సాఁచికొనుచు. 69

(సమీపించి) దీని నడిగెదను.

(గేయము)

సంప్రాప్తాపద్భారుండై, క్షుణహాతపరేఖ వారుండై,
కాంతాదర్శనలాలసుఁడై, కరిపతి విస్మితమానసుఁడై. ౧౧

(దానితో ఖండకాంతమున చర్చరి)

(గేయము)

కేకిసార్వభౌమ, లోకానందన, కేల్మోడ్చి నిన్ను వేఁడెదను,
ఈకానలోఁ గంటె యెందేని నాప్రియఁ జెప్పుమి దయఁ బూనియెదను
వినవయ్య చెప్పెద వనితను గనిపట్టు స్పష్టమయిన యానవాలు,
రాకాచంద్రానన రాజహంసయాన, యీపాటియే నీకుఁజాలు. ౧౨

(చర్చరికచే కూర్చుండి ప్రాంజలియై)

తే. కల దయా నాకు నుత్కంఠ కాలకంఠ,
ఆయతాపాంగ నోసితాపాంగ నీవు

చూచుకన్దోయి తనియనిసొగసుకత్తె
వనిత నొక్కతెఁ గంటివో వనతలమున. 70

[చర్చరికతో చూచి] ఏమి? బదులు పల్కకయె నర్తింపం దొడంగినది! దీనికి హర్ష కారణ మేమి? [చింతించి] కానీ ఇది తెలిసినది.

ఉ. నా ప్రియ కానరానికతన న్మృదువాతవిభిన్నబర్హమై
యేపున నిస్పృహత్వత వహించెడి నీయహిభోజి యిప్పు; డౌ
రా! ప్రియ కేశపాళి పురుషాయితకేళివిశీర్ణబంధమై
ప్రావితపుష్పదామముల భాసిల, మోళ్లిల నిదేమి సేయునో? 71

కానీ ఒరులవ్యసనముచే సంతసించెడి దీనిని అడుగను. [ద్విపదికచే దిక్కులు సూచి] [పరిక్రమించి] ఇది కోయిల కోమలి, ఎండల కనంతరము మదమేచి నేరేటి చెట్టున నెలకొన్నది. పక్షులలో ఈజాతి పండితము. దీనిని ప్రార్థింతునుగాక.

[అనంతరమున ఖురకము]

[గేయము]

విద్యాధరవనలీనుం డై, విపులబాష్పనయనుం డై,
గజపతి యడలునఁ గలఁగుచు, గగనము గొల్చుచు మెలఁగుచు. 73

[ఖురకాంతమున చర్చరి]

సఖి! సఖి!

[గేయము]

నందనవనిని స్వచ్ఛందగామినీ, కలవాణి పికకామినీ,
నాతోఁ జెప్పవె నర్మిలి యొప్పుగఁ, బ్రియఁ గంటేని నే నుప్పొంగ.

[దీనినే నర్తించి వలంతికచేఁ దఱిసి మోఁకరించి] అమ్మా,

తే. కాముదూతి వటంచు నిన్ గామిజనులు,
మానహరణా ప్రతిహతాస్త్రమంత్ర మీవు;

ప్రియతమను నాకడకు నేని వేగ తెమ్ము,
కొనుము కలవాణి నన్నేమి కొమ్మకడకు. 72

*వాచికముచే ఇంచుక మరలి ఏమనెదవమ్మా నీవు ? 'నిన్ను ఇంత యనురక్తుని విడిచి ఎట్లు పోయినది' అని అడిగెదవా? చెప్పెదను వినవమ్మా.

తే. కోప మూనిన దేని యాకోపమునకు
హేతు వొకటియు నాయందు నే నెఱుంగ;
ప్రియతములయం దెటను ననపేక్షితములు
ప్రభుత భావస్ఖలితములు భామినులకు. 73

ఏమి ! కథాచ్ఛేదము కావించి తనపనిలోనే చొచ్చినది.

తే. ఒరులవగ పెంతయినఁ జల్లనుంట నిజమె,
ఇడుమపాలైననాయాజ్ఞ నెడఁగఁ ద్రోచి
ఆను నభినవపాక మియ్యది మదాంధ
రాజజంబూఫలము నధరమును బోలె. 74

ఇట్లయినను నాప్రియవలె మంజులస్వన యగుటంబట్టి ఈమె యందు నాకు కోపము లేదు. ఇచటినుండి నేను ద్విపదికచే పరిక్రామిత కముచేత చెవి యొగ్గి అహో! దక్షిణమున ప్రియాచరణన్యాసమును అందెరవళి తెల్పుచున్నది! కానీ, అట కేఁగెదను. పరిక్రమించి

## గేయము

దయితావిరహాక్రాంతవదనుఁడు, అవిరళబాష్పనయనుఁడు,
శోకభారవిసంష్ఠులగమనుఁడు, గురుతాపదీపితతనుఁడు,
కరిపతి నూనుఁడై గవి నున్నవాఁడు, కానలోఁ దిరుగుచున్నాఁడు.

అని కకుభముచే ఆఱు ఉపభంగములు; అనంతరమున ద్విపది కచే దిక్కులు సూచి

[గేయము]

ప్రియకరిణీవిశ్లేషితుఁ డై, గురుశోకానలదీపితుఁ డై. ౧౬

అయ్యో! ఇసీ ఇసీ!

*క. జలదముల నిర్ఘోను దిక్కులఁ గన్గొని మానసమునకు సముత్సుకతన్
వెలలేడిమదకలహంసల కలరుత మిది, యందెరవళి గాదాయెఁ గటా!

కానీ, మానసోత్సుకము లయిన యీహంసములు సరస్సునుండి ఎగిరి పోకమునుపే వీనివలన ప్రియావృత్తాంతమును తెలిసికొనవలయును. [వలంతిక చేత సమీపించి] ఓహోయి జలవిహంగమరాజా,

తే. పోవుదువు గాక మానసమునకు వెనుక,
వదలు బత్తెంపుబిసముఁ గొనెదవు పిదప,
తీర్తు గాక నావగ ప్రియవార్త దెలిపి,
తనపనికి మున్నె కృతి చెలిపనిని జేయు. 76

నీవు తలయెత్తి మిన్ను సూచటచేత 'మానసోత్సుకుఁడను నేను చూడ నయితిని' అని పల్కెదవా? [కూర్చుండి చర్చరి]

[గేయము]

తస్కర, హంసా, దాఁతువు రా

[అని నర్తించి లేచి]

తే. సువదనను నాదుప్రియతమఁ జూచి నీవు
కొలనిదరి నంచ, కానిచోఁ గొంటి వెట్లు
మదవిలాసపదముఁ దద్గమనము నెల్లఁ,
దెక్కలివి, లేదు కా దనఁ దెగువ గలవు. 77

---

*క. ఘనములు నిర్ఘోషించిన । నను గను మానసమునకును నాలసతోడన్
జనఁ గోరు రాజహంసుని వ్వని । గని మానీకరించితివి కాదు కటా?

గేయము

గతిచేతనె నేఁ గంటిని రా

చర్చరికతో సమీపించి కేలు మోడ్చి. అందువలననే

క. నాకొమ్మ నిమ్ము హంసము, కైకొంటి తదీయ మైన కాంతగతంబుల్,
ఏకాంశము కనఁబడుచో, నీకొని యభియుక్త మెల్ల నియ్యనవలయున్.

మరల చర్చరి

గేయము

కలిచితి వెట నీగతి గతిలాలస ?
సకిని గంటివి పో జఘునభరాలస. ౧౭

మరల చర్చరి ['నాకొమ్మ' ఇత్యాది పఠించి ద్విపదికచే నిరూపించి] విహసించి ఇది దొంగలను దండించువాఁడు రాజు అని భయము చేత ఎగిరిపోయినది పరిక్రమించి ఇది యిట ప్రియాసమేతము చక్రవాకము. దీని నడిగెదఁగాక.

అనంతరమున కుటిలిక

గేయము

మర్మరరణితకచారువున మల్లఘటి —
కుసుమితపల్లవితతరువున, చర్చరి —
దయితావిరహోన్మాదమున
కరిపతి భ్రమరు గహనమున. ౧౮

ద్విపదియాంతమున చర్చరి

గేయము

గోరోచనాకుంకుమవర్ణాంచిత జక్కవరాణి నాప్రియను,
ఆమనిపవల విహారము సల్పఁగఁ గంటేని చెప్పుము దయను. ౧౯

చర్చరికతోఁ దఱిసి మోఁకరించి.

క. ఓయీ రథాంగ, యీరథి, ప్రేయసిఁ బాసెను రథాంగవిజయి శ్రోణిన్
నీయెడ నను యోగంబున్, జేయు మనోరథశతంబుచే వృతుఁడగుచున్.

ఏమి! 'కః కః' అన్నదే, ఇది నన్ను తెలిసికో లేదా ?

క. ఎవనికి రవియున్ శశియున్
దవుదురొ మాతామహుఁడుఁ బితామహుఁడును నై,
ఎవని వరించిరొ యిరువురు
ధవు గా స్వీయ మూర్వరయును దా నుర్వశియున్. 80

ఏమి ఊరకున్నది! కానీ, దీనిని చీవాట్లు పెట్టెదను.

చ. సరసిని దామరాకొకటి చాటకుమాత్రన నీవు నీసకిన్
బొరయక దూర మేగె నని పొక్కుచు బెల్లెలుఁ గిత్తు, నీ కిటుల్
పరఁగుఁ బ్రియానురాగమునఁ బాసి వసించు భయంబు, ప్రేయసీ
విరహికి నాకు నీక్రియఁ బ్రవృత్తిపరాఙ్ముఖతన్ వహింతువే! 81

ఎల్లప్రకారములను నాయదృష్టవిపర్యాసము ప్రభావము సూపుచున్నది వేఱవకాశము చూచుకొనెదను. [పదాంతరమున నిలిచి] కానీ, ఇటనుండి జరుగను. [ద్విపదికచే పరిక్రమించి, అవలోకించి]

ఆ. లోనఁ దేఁటి యులియఁగా నొప్పునీతమ్మి
యేఁగనీదు నన్ను నిచటు దలఁగి,
నేను మోవి చుఱుకుగా నొక్క సీత్కార
ముగ్ధ మైనకాంతముఖము వోలె. 82

కానీ, కమలాధ్యాసి యైన యీమధుకరమునుగూర్చి యే యాచకుఁడ నయ్యెదను. ఇటనుండి పోయి పశ్చాత్తాప పడనేల ?

[దీని యంతరమున అర్ధద్విచతురస్రకము.
గేయము]

క్రమవృద్ధగురుప్రేమరసంబున ఆడుఁ గోడెహంస కామరసంబున. ౨౦
[చతురస్రకముచేత దఱిసి కేలు మోడ్చి]

ఆ. మధుపమా, వచింపు మదిరాక్షివార్తను,

[విభావించి]

వలవ దీవు నాదువనితఁ గనవు ;
ఆవదనపుటూర్పుఁదావి యానితి వేని,
ప్రీతి గొనుదె పుండరీకమందు ? 83

చనియెదనుగాక [ద్విపదిక చేత] [పరిక్రామితకము చేత] వీఁడె కరిరాజు తొండమును ఇప్పమ్రానిపలవమీఁదఁ బెట్టి కరిణీసమేతుఁడై యున్నాఁడు. ఇతనివలన ప్రియావృత్తాంతము నెఱింగెదను. సమీపించెదను. [కుటిలిక చేత]

[గేయము]

దయితావిరహోత్తాపమున

[మల్లఘటి]

గంధాక్తమధుపుఁడు గహనమున. ౨౧

[దానియంతరమున] [చూచి] కాపీ, త్వరపడఁగూడదు.

తే. అభినవోద్భిన్నదళమును నిభవిభుండు
ఆసవసురభిరసము హస్తాగ్రమునను
నోర వల్లభ యిడినయందుగు రివటను
ఆస్వదించును గాక సమగ్రముగను. 84

[క్షణమాత్ర ముండి] ఆహా! ఇతఁడు ఆహ్నికమును నెఱవేర్చుకొన్నాఁడు, మఱి యడిగెదను.

[గేయము]

చేమో డ్విడెదను జెప్పుము గజపతి, లలితప్రహతిశోకలితవృక్షతతి,
దూరవిజితకమలారికాంతిని, వీక్షించితె నావేలుపుటింతిని ? ౨౨

తే. మదకలుఁడ సుందరిని జాంద్రమసకలాభ,
యూధికాశబలాలకయూథనాథ,
కానవే స్థిరయౌవనఁ బ్రాణదయిత
హర్షదాలోక నోయి దీర్ఘావలోక ? 85

[హర్షముతో] ప్రియాప్రాప్తిని చెప్పెడి యీ నిస్నిగ్ధగంభీరగర్జితముచేత సమాశ్వాసితుఁడ నైతిని. సాధర్మ్యముచేతఁ గూడ నీయందు నాకు మహాప్రేమ.

మ. ననుఁ బేర్కొంద్రు నృపాధిరా జని నినున్ నాగాధిరా జండ్రుగా,
గొన బా నీకును దానధారధుని నాకున్ యాచకౌఘంబునన్,
కొని న న్నూర్వశి నిన్ను నీవశయు ధన్యుం జేసి రిస్త్రీమణుల్,
కన నన్నోర్చిలియునుం బ్రియావిరహదుఃఖం బొంద కీ వుండుతన్. 86

నీవు సుఖ ముండుము. నేను పోయివచ్చెదను. [పార్శ్వమున చూడ్కి నిగిడించి] అహో! సురభికందర మను పేరిది విశేషరమణీయము ఈకొండ యగపడుచున్నది. ఇది అచ్చరలకు ప్రియమైనదియు; నాసు తనువు దీని నెత్తమున దొరకునా? [పరిక్రమించి చూచియు] అయ్యో! నాపాపములపంటచేత మేఘము శంపాశూన్యము అయినది. అయినను ఈకొండను అడుగక నివర్తిల్లను. [అనంతరము ఖండిక]

[గేయము]

ఖరఖురదళితక్ష్మాతలుఁ డై,-వన-,గహనమునం దవిచలుఁ డై,
పూని తనపని లీనుం డై, కిరి-,దొర చను ముదధీనుం డై. 23

తే. పృథునితంబుండ నీవు నాపృథునితంబ
సంగతానంగ శృంగారమంగళాంగ
పర్వసన్నుత నోయి పర్వతవిభుండ
యణుకుచాంతరఁ గంటె వనాంతరమున. 87

ఏమి ఊరక యున్నది! దూరముచేత నామాట వినఁబడలే దని శంకించెద. సమీపమునకుం బోయి యడిగెదను. [అనంతరము చర్చరి]

[గేయము]

స్ఫటిక శిలాతల భాస్వర నిర్ఝర, బహువిధ సుమనో భర చిత శేఖర
కిన్నరమధు రోద్గీత మనోహర, కనఁబడుపుము నా కాంతను భూధర.

అని [పరిక్రమించి] [అంజలిసేసి]

తే. సర్వభూభృదధిప సర్వాంగసుందరి
రామ సన్నుతాభి రామక మునఁ
గానవాంతరమునఁ గానంగఁబడియె నే
నాకుఁ బాసినయది నీకుఁ బ్రియుఁడ. 88

[ఆకర్ణించి, హర్షముతో] ఏమి యథాక్రమముగా 'చూచితిని' అని పలికినది. నీవును ఇంతకన్న ప్రియతరమును విందువుగాక. అ టయిన నాప్రియతమ ఎటనున్నది? [నేపథ్యమున అదే వినఁబడును] హా! ఇసీ! నాశబ్దమునకే గుహాముఖమునుండి వెలువడిన ప్రతిశబ్దము! [విషాదమును రూపించి] బడలితిని. ఈసెలయేటిదరిని నెలకొని, అలలగాలిని అనుభవించెద. క్రొత్తనీటిచేత కలఁగినదాని నైనను ఈయేటిని చూచుటచేత నాహృదయము ప్రీతి నొందుచున్నది.

ఉ. వీచులు గాఁగ భ్రూకుటులు, విక్షణదండజపంక్తి కాంచి గా,
వే చన జాఱుపైఁటవలె ఫేనచయం బిటు నట్టు నీడ్చుచున్,
ఏచినమేటిసంస్ఖలిత మెంచుచు తీవ్రపదప్రయాత యై,
నాచెలి యోర్పు లేక పరిణామము నొందె నదీస్వరూపతన్. 89

కానీ, దీనిని యాచించెదఁగాక. [అనంతరము కుటిలిక]

[గేయము]

దయగొనుమా ప్రియతమ సుందరి నది, క్షుభితాకరుణాకుంతికా,నది,
దోర్యసరిత్తటసముత్సుకా, నది, కల మధుకర ఝంకారితా, నది. అని

[కుటిలికాంతమువ చర్చరి]

గేయము

ప్రథమదిశాపవనహతః ప్రబలోర్మికోర్ధ్వభుజముల
నర్తించు సలలితుఁ డుదధిః శాఖుఁడు మేఘాంకముల
శకటాంగహంసకుంకుమః శంఖకృతమండనముల
కరిమకరాకులకృష్ణః కమలకృతావతంసముల
తటసలిలోద్వేల్లితః వత్తహస్తతాళుండు
అవతరించెడి దశదిశలఃనలమునవాబ్దకాలుండు. ౮౯

[అని దఱిసి] [కేలు మోడ్చి]

తే. ప్రియమె వల్కితి, నీయందె ప్రీతి యుడితిఁ,
ప్రణయభంగవిముఖభావపరత నుంటి;
నే మదపరాధలేశంబు నీవు గంటి ?
దాసు నను విడనాడితి వీసుఁ బూని. 90

కాక, ఇది వాస్తవనదియే గావలయు, ఉర్వశి పురూరవుని వదలి సముద్రుని అభిసరింపదు గదా. అనిర్విణ్ణతచే శ్రేయస్సులు కలుగును. కానీ ఎచట సువదన నాకంటి కగపడక దిచ్చు మొగమయినదో అచ్చోటికే ఏఁగెదను. [పరిక్రమించియు చూచియు] అహా! ప్రేయసిమార్గముయొక్క గుర్తు కనఁబడినది.

ఆ. ఎఱ్ఱకడపపుష్ప మిది, దీనిఁ బ్రేయసీ
సిగను దోడవుగాఁగఁ జెరివికొనియె
ఎండకారుతుదను హెచ్చరించెడు నని
యఱయకరుల విషము మైనను ధృతి. 91

[విలోకించి] పరుండియున్న యీ సారంగమును ప్రియావృత్తాంతమునకై ప్రార్థించెదను.

గేయము

నూతనకుసుమస్తబకమండితానోకహాపర్యంతమున
మదకలకూజతోకిలఝంకృతమధుకరమనోహారమున

ప్రాణాధికనిజకరిణీవిరహ • జ్వాలాకృతతాపమున
విచరించెడి నైరావతద్విపముఁ • వేల్పులయుద్యానమున. ౯౧

[గళితకము, మోఁకారించి]

తే. కృష్ణసారప్రభం బిది కేరు నిచటఁ
గనులపండువు నభినవఘనపటలిఁ,
గాననేందిర తాఁ దమకమునఁ జూడఁ
జాఁచినట్టినిడుదకటాక్షం బనంగ. 92

[విలోకించి] ఏమి యిది! నన్ను సరకు సేయనియట్లు పెడమొగం బయినది [చూచి]

క. కన దీని వచ్చుహరిణిని, జనుగుడువఁగ లేఁగ నడుమ జయ్యన నిలుపన్,
అనితరదృష్టుల నిదియున్, గను దానినె తాను భుగ్నకంఠం బగుచున్.

[అని నర్తించి, చర్చరి]

[గేయము]

వేలుపుభామిని జఘనభరాలస పీనోత్తుంగస్తనియు
స్థిరయౌవనయుఁ తనుశరీరయు శ్రీలహంసగతియు
మింటి నారయు కాననమునఁ దిరుగుచు మృగనేత్రఁ గంటివయేని
నాకుఁ బలికి యీవిరహాబ్ధిఁ బడిన ననుఁ దేల్పుము యిఁక నేని. ౯౩

[తలసి కేలు మోడ్చి] ఓహోయి కదుపు నాయకుఁడా,

తే. కంటివో నా ప్రియను నీవు కాననమున ?
మానినికి విను చెప్పెద నానవాలు ;
నీవయిత యామె యెట్లో యాపైదలియును
సొబగురాలు పృథులనేత్ర సుమ్ము మిత్ర. 94

ఏమి నామాటను ఆదరింపక పెండ్లామువైపు మొగము త్రిప్పుకొన్నది! న్యాయ్యమే, దశావిపర్యాసము పరిభవాస్పదము. ఇటనుండి

నేను.—[పరిక్రామితకముతో జూచి] ఇది యెట్టిది రాతిపగులులో కనఁబడుచున్నది?

ఉ. కాదు మృగేంద్రకృత్తకరిక్రవ్యలవంబు, ప్రభాప్రలేపి యౌ;
కాదు వెలుంగునిప్పుకయుఁ, గాన సమస్తము దోఁగె వానచే;
[పరికించి]
ప్రోదిగ రక్తవంజుళము బోలెడి రక్తిమ, బద్మరాగ మౌ;
నాదట దీని నెత్తబలె నర్కుఁడు దా గమిచెం గరంబులన్. 95

ఇది నామనస్సును కారించుచున్నది.

[గేయము]

ప్రణయినీబద్ధాకాంక్షుఁడు, బాష్పాకులనిజాక్షుండు
గజపతితిరుగు దుఃఖాన, క్షామితాస్యుఁడు కానలోన. ౨౯

[ద్విపదికచేఁ దఱిసి, కైకొనుటను నటించుచు.] దీనిం గైకొని యొద. అయినను ఏల యిది!

తే. ఎవతుకకుఁ బారిజాతంపుఁబువ్వులతావి
గుబులుగొనుసిగలో దీనిఁ గూర్పఁ దగునొ
అమనోనాయిక యలభ్య యయ్యె; నింక,
నశ్రునిహతంబు దీనిఁ జేయంగ నేల? 96

[నేపథ్యమున-వత్సా! పుచ్చుకో పుచ్చుకో.]

క. ఇది సంగమనీయాఖ్యన్, గదితం బగుమానికము, నగప్రభుపుత్రీ
పదరాగజనిత; మిది దాల్ప దయితజనసంగమంబు పరఁగున్ దోడ్తోన్.

రాజు.—[చెవి యొగ్గి] ఎవరు నన్నిట్లు శాసించుచున్నారు? [దిక్కులు గని] ఆహా! ఎవరో భగవానుఁడు-మృగచారి ముని నన్ను కనికరించుచున్నాఁడు. భగవానుఁడా, నీ యుపదేశమువలన నేను అనుగృహీతుఁడను. [మణిని కైకొని] ఓహో సంగమనీయమా!

తే. అబల ననుఁ బాసె నయ్యె మగ్నావలగ్న,
మమ్ముఁ గూర్చెద వేని యో మణిశరీర,
నిను శిఖామణిగ ధరించుకొనెద నేను,
బాలునిం జంద్రు నలమహేశ్వరుఁడు వోలె. 93

[పరిక్రమించి చూచి,] ఏమి యిది? ఆహా! పూవులు లేనిదానినే అయినను ఈతీఁగను చూడఁగా నాకు రతి కలిగినది! కాకేమి? యుక్తమే యిది నామనోరమయగుట. ఏలన, నిది—

తే. వర్షమునఁ దోఁగియున్నట్టిపల్లవంబు
బాష్పధౌతం బయినమోవి వడువు దాల్ప,
తనదుతఱి గామిఁ బూవక తనరుతీరు
భూషణంబులఁ దాల్పనిపోలుపు చూప,
తే. మధులిహంబులయలివులు మాని యుంట
చింతచే నైనమౌనంపుఁజెన్ను నెరప,
ప్రణతు ననుఁ ద్రోచి యనుదాపభరము గొన్న
తన్విని మదీయ నీలత తన్వి వోలు 94

ప్రియానుకారిణిని దీనిని కౌఁగిలింపఁ గోరెదను

[గేయము]

తీవా, కనుమా యెద లేకయె నేఁ దిరిగెద నీవనమందు,
దైవయోగమునఁ గందున యేని దయితారత్నము నిందు,
మఱి కృతాంతమున నీయరణ్యమున మానిని నుంపను క్షణము,
కొని చని చేయుదు వెండి దీనిఁ గనఁ గోర నీని రక్షణము. 30

[అని (చర్చరికచేఁ దఱిసి) లతను ఆలింగనము చేయును.]

[అంతట దానితావున ఉర్వశి ప్రవేశించును.]

రాజు.—[కన్నులు మూసికొనియే స్పర్శసుఖమును రూపించి] ఏమి యిది? ఉర్వశి నెమ్మేనిసంపర్కమునం బోలె నాశరీరము నిర్వృతిం జెందినది! అట్లయినను, నాకు విశ్వాసము జనింపకున్నది. ఏలన—

తే. కందు నేఁ దోల్త దేని నాకలికిఁ గాఁగ,
నిముసమున నది వే ఱయి నెగులు గొల్పె;
కాని స్పర్శవిభావితఁ గాంత దీనిఁ
గనఁగఁ దెఱవను దెఱవను గన్నుఁగవను. 100

[మెల్లఁగా కన్ను దెఱచి] ఏమి! సత్యముగా ప్రియతమయే!

ఉర్వశి—[బాష్పములు విడిచి] జయుంజయం నీకు మహారాజా

రాజు—

తే. తమమున భవద్వియోగజాతమునఁ జండి
మునిఁగి యడు గంటుచున్న నావనట దీఱ
భాగ్యవశమున వెండి ని న్బడసినాఁడ,
నపగతాసుండు చేతన నందినట్లు. 101

ఉర్వశి—మహారాజా, అలాగే; అంతఃకరణంచేత నీవృత్తాంతాన్ని సాక్షాత్కరిస్తూనే వుంటిని.

రాజు—అంతఃకరణముచే నన్నమాట నాకు బోధపడకున్నది.

ఉర్వశి—విను. ఇందుకు మహారాజు నన్ను క్షమింపవలెను, ఎందు కనగా, నేను కోపవశ నై మహారాజును ఈ యవస్థాంతరము పొందించితిని.

రాజు—కల్యాణీ, నన్ను ప్రసన్నుం జేయ నక్కఱలేదు. నిన్నుఁ గన్నంతనే నాయాత్మ ప్రసన్న బాహ్యాంతఃకరణ మయినది. చెప్పుము చెప్పుము. ఇంతకాలము నేను లేక నీవు ఎట్లు ఉంటివి?

[అనంతరము చర్చరి]

[గేయము]

అసితకంఠముఁ, బికి, నంచ, రథాంగముఁ
దుమ్మెదఁ, గరి, గిరి, ధునిని, కురంగము,

నినుఁగూర్చి వనిలోన నేను భ్రమించుచు
బరువడి నడిగితిఁ బరిదేవించుచు. 3౧

ఉర్వశి.—అవధారుమహారాజా. కుమారస్వామి శాశ్వతకుమార వ్రత మవలంబించి అకలుష మనేవేరిగంధమాదనకచ్ఛాన్ని ఆశ్రయించి నాడు. ఈవిధి యేర్పఱిచినాడు.

రాజు.—ఏమివిధి?

ఉర్వశి.—ఈచోట ఎవతె ప్రవేశిస్తుందో అది లతయైపోతుంది. గౌరీచరణసంజాత మయినమణిచేత తప్ప తొంటిరూపాన్ని పొందదు. అట్లుండగా నేను గురుశాపవిమోహితాత్మనై దేవతావిధిని మఱచి నీయనునయాలకు లోగక ఈకుమారవనాన్ని చొచ్చితిని. చొచ్చినంతనే బండిగురివెందతీవ నయితిని.

రాజు.—సర్వము ఉపపన్నము.

క. నను సురతఖేదసుప్తుని, వనిత విదేశగతుఁగాఁగ వగచెదు సెజ్జన్,
ఎన లేని యీచిరవియుక్తి నీదృశము నెట్లు లోర్చితివి చెప్పు సఖీ.

నీవు చెప్పిన యామణిని నీసంగమకారణమును మునివలనం బొంది మణిప్రభావమున నిన్ను మరల నేను పొందితిని.

[అని మణిని చూపును.

ఉర్వశి.—అహో! సంగమనీయమా! అందువల్లనేగదా మహా రాజు నన్ను కౌగిలించినమాత్రాన తొంటిరూపు పొందితిని.

[మణిని కైకొని ఔదలం దాల్చును.

రాజు.—సుందరీ, ఇట్లె క్షణమాత్ర ముండు.

క. నుదుటం బెట్టినయీమణి నుదయించినరాగ మొలయ నొప్పారెడి నీ వదనము లేయెండకుఁ గెంపొదవిన నెత్తమ్మిలక్ష్మి కుపమానంబై.

ఉర్వశి.—ప్రతిష్ఠానమునుంచి నీవు వచ్చి చిరకాల మయినది. ప్రకృతులు నాపై అసూయ వహింతురు. కావున మరలుదాము.

రాజు —నీ వాజ్ఞాపించినట్లు.

ఉర్వశి.—మహారాజా ఎట్లు పోగోరుదు.

రాజు.—

క. స్ఫురియించుమించు సిడముగ
సురచాపము నూత్న చిత్రశోభగఁ గ్రొమ్మ
బ్బు రహించువిమానముఁ జే
సి రయంబున నన్ను వసతిఁ జేర్పుము తరుణీ. 104

[చర్చరి]

గేయము

సహచరితోడను సంగతుఁ డై, అఖిలగాత్రపుల కాంకితుఁ డై
స్వేచ్ఛాప్రాప్తవిమానమున, హంసయువ చను విహారమున. 3౨

[అని ఖండధారచే నిష్క్రమింతురు.

చతుర్థాంకము సమాప్తము.



# పంచమాంకము.

---

[అంతట పరితుష్టుఁడు విదూషకుఁడు ప్రవేశించును.]

విదూ.—సంతోషం సంతోషం! చిరకాలము ఊర్వశీసమేతుఁడై నందనవనం మొదలైన దేవతారణ్యములలో విహరించి ప్రియవయస్యుడు మరలివచ్చినాడు ఇప్పుడు సత్కారోపచారాలతో ప్రకృతులచేత అనురంజనం పొందుతూ రాజ్యము చేస్తూవున్నాడు; సంతానము లేమి తప్ప ఆతనికి ఏకొఱతా లేదు. ఈదినము తిథివిశేషమని గంగాయమునా భగవతుల కూడలిలో దేవేరులతో స్నానమాడి రాచనగరు ప్రవేశించినాడు కనక ఆతని యలంకరణసమయంలో తొలివాడ నౌతాను.

అని పరిక్రమించును.

నేపథ్యమున

అయ్యో! అయ్యో! విసనకఱ్ఱమీద తెల్లపట్టువస్త్రంమీద ఉంచి తీసుకొనివెళ్లుతున్న దానిని అంతఃపురవిలాసినులు మాళిలో ధరించడానికి యోగ్యమయిన మణిని ఎరచి భ్రమచేత గద్ద తన్నుకొని పోయింది.

విదూ.—చెవియొగ్గి అక్కటా! అక్కటా! అది సంగమనీయమనే చూడారత్నము, వయస్యునికి అత్యంతం ప్రియంగదా. అందువల్లనే గదా ఆయన ముగియని నేపథ్యముతోనే ఆసనమునుండి లేచి ఇటే వస్తున్నాడు. ఇతనిని కలసికొంటాను.

[అంతట ససంభ్రమపరిజనుఁడు రాజు ప్రవేశించును.]

రాజు.—

తే. ఎక్కడను జూపుమా పక్షి తెక్కలీఁడు?
ఎవఁడు ప్రాణంబు చేఁ దయి మృత్యు వెనము

తన మొదలి చోరకృత్యంబు దా నొనర్చె
శాసకునియింటనే పటుసాహసమున. 105

కిరాతి.—ఇదుగో, ఇదుగో, నోటికొనను తగుల్కొని వున్న బంగారంపుదారములోని మణితో ఆకాశాన్ని చిత్రిస్తూవున్న దనేలాగ నుడుస్తున్నది

రాజు.—నాకును కనఁబడుచున్నది.

తే. నోర మణిప్రేలుజాళువాదార మొప్ప,
మింట వడి మండలముల భ్రమించుకతనఁ,
గొఱవి గిఱగిఱఁ దిరిగెడితెఱఁగు దోఁప
రాగరేఖావలయము లేర్పఱుచుఁ బులుఁగు. 106

ఇప్పుడు ఏమి చేయవలయును ?

విదూ.—[సమీపించి] దీనిమీద కనికరింపరాదు. ఇది దండనీయము.

రాజు.—నీవు చెప్పినమాట సరి. విల్లు విల్లు విల్లు!

[ధనుర్గ్రాహిణి యవని నిష్క్రమించును.

రాజు.—వయస్యుఁడా, పక్షి అగపడలేదే.

విదూ.—ఇటనుండి దక్షిణపుతుదమీదుగా పోయినది దండనీయమైన పీనుగుమేతరి.

రాజు.—[తిరిగి చూచి] ఇప్పుడు కనఁబడుచున్నది.

తే. నిగ్గు లివురులఁ బోలుమానికము చేత
వంజుళపువిరిగుత్తిచే బలె ఖగంబు
దిగ్వధూవక్త్రములను సాధించెఁ జూడఁ
జారుతరము వతంసప్రసాధనంబు. 107

యవని.—[చాపహస్త ప్రవేశించి] ప్రభూ, ఇదుగో, విల్లు, అత్తెముకూడ.

రాజు.—ఇఁక నిపుడు వింటివలన నేమి కార్యము. ఆ పాలతిండి బాణమార్గమును దాఁటిపోయినది. అట్లే గదా.

తే. ఖగము దవ్వుగఁ గొనిచన్న కారణమున
మెఱసెడిని మానికం బది మింట నిపుడు,
పరుషజలధరచ్ఛేదంబుదరిని రాత్రిఁ
గ్రాలుచుండునంగారకగ్రహము వోలె. 108

[అంగజాలను గాంచి లాతవ్యా, మామాటగా చెప్పుము నాగరికునితో సాయంకాలమున నివాసవృక్షమును చేరు నీదొంగపక్షిని వెదకు మని.

కంచుకి.—ఏలినవారియాజ్ఞ. [అని నిష్క్రమించును.

విదూ.—ఇప్పుడు నీవు కూర్చుండు. ఈరత్నపుదొంగకు ఎక్కడికిపోతే నీ శాసనము తప్పుతుంది?

రాజు.—[విదూషకునితోఁగూడ కూర్చుండి] వయస్యా,

క. రతన మ్మని గాదు పతగ
హృతమునకై సాప్రయాస, హృదయసఖిసం
గతుఁ జేసి చేసె ననుఁ బ్రా
ణితు సంగమనీయ మనుమణి యిది వయస్యా. 109

విదూ.—ఈయర్థమును పూర్వమే నాకు చెప్పియున్నావు.

[అంతట బాణమును మణిని తెచ్చుచు కంచుకి ప్రవేశించును.]

కంచుకి.—జయము జయము దేవరకు.

క. రోపత నొందిననీయా, కోపము చే ప్రస్నిఫులుఁగుకూలెను మణితో,
బ్రావించి నేరమున కనురూపం బగువధము ధర్మరూఢిగ దేవా.

అందఱు ఆశ్చర్యము రూపింతురు.

కంచుకి.—నీటితోఁ గడిగిన యీమణిని ఎవరిచేతి కిత్తును?

రాజు.—కిరాతీ, దీనిని అగ్నిశుద్ధముగావించి పెట్టెలోనుంపుము.

కిరాతి — ఏలినవారియాజ్ఞ. [అని మణిం గొని నిష్క్రమించును.

రాజు — లాతవ్యా, ఈబాణము ఎవనిదో నీ వెఱుఁగుదువా?

కంచుకి — చెక్కిన పేరు కనఁబడుచున్నది, గాని నాదృష్టికి అక్షరములను కనిపట్టుశక్తి లేదు.

రాజు — అటయిన ఆబాణము ఇటు తెమ్ము.

[కంచుకి అట్లు చేయును.

[రాజు నామాక్షరములం జదువుకొని సంతానవంతుఁ డయినట్లు రూపించును.

కంచుకి — నాపని నేను చూచికొనెదను. [అని నిష్క్రమించును.

విదూ — ఏమి విచారిస్తున్నావు?

రాజు — విను మఱి ఏసినవాని పేరి యక్షరములను. [చదువును

తే. ఔర్వశేయుండు విలుదాలు పైలసుతుఁడు
ఆయువు కుమారుఁ డవనిలో నతిబలుండు
ఆతనిది యని యెఱుఁగుఁ డీమాశుగంబు;
అపహరించును బగతురయాయువులను 111

విదూ — [పరితోషముతో] ఆహాహా! నీవు సంతానవంతుడవై వర్ధిల్లుతున్నావు!

రాజు — సఖుడా, ఇది యెట్లు? నైమిశేయ యాగసమయమునం దక్క నేను ఉర్వశిని ఎడఁబాయలేను, నేను గర్భవతినిగా కనిపట్టియేని యుండలేదు; మఱి ప్రసవమే ఎట్లు? అయినను

క. నలు పెక్కెను జన్నుమొనల్,
తెలుపెక్కెను లవలిదళము తెఱఁగున మొగముల్,
చెలువ కొకకొన్ని దినములు
వలయంబులు జాఱినట్లు వపువు వలేర్చెన్. 112

విదూ.—నీవు దివ్యస్త్రీలకి అన్నిటను మానుషీధర్మమే అని తలచకు. వారి చరితములు ప్రభావముచేత దాగివుండును.

రాజు.—కానీ నీవన్నట్లే అగునుగాక మఱి పుత్రుని దాఁచుటలో ఆమహాశయకు కారణ మేమి ?

విదూ.—దేవతారహస్యములు ఎవరు తర్కించగలరు ? కంచుకి [ప్రవేశించి]—జయము జయము దేవరవారికి. దేవరా, చ్యవనాశ్రమమునుండి కుమారుం దోడ్కొని దేవరను కాంచుటకై తాపసి వచ్చియున్నది.

రాజు.—ఇరువురను అవిలంబితముగా ప్రవేశపెట్టుము.

కంచుకి.—దేవరయాజ్ఞ. [అని నిష్క్రమించి చాపహస్తుఁడగు కుమారునితోను తాపసితోను ప్రవేశించును.]

కంచుకి.—అమ్మా ఇటు ఇటు. [అందఱు పరిక్రమింతురు.]

విదూ.—[చూచి] ఏమి ? గద్దను గుఱిపెట్టి యేసిన ఆ అర్ధసార సాన చెక్కిన పేరివాడు ఆక్షత్రియకుమారుడు ఇతడేనా ? అట్లే, నిన్ను బహుతరంగా పోలివున్నాడు.

రాజు.—అట్లే ఉండును. అందువలననే—

తే. అశ్రులుబుకును వీనిఁ గన్నంతఁ గనుల,
స్వాంతమునఁ బ్రేమ, మదిని బ్రసాద మొదవు,
గళితధైర్యుఁడ, వడఁకునంగములతోడ
నదయముగఁ గౌఁగిలింపఁ గోరెదను వీని.



కంచుకి.—భగవతీ ఇట్టుండుఁడు. [తాపసీకుమారులు అట్లే ఉందురు.]

రాజు.—అమ్మా నమస్కారము.

తాపసి.—మహారాజ, సోమవంశవర్ధనుఁడవు కమ్ము. [ఆత్మగతము] అహా చెప్పకుండనే తెలియవచ్చుచున్నది. ఈరాజర్షికి వీనితోడి

యాకారససంబంధము [ప్రకాశము] బాలకా, మీనాయనకు మ్రొక్కుము.

[కుమారుఁడు చాపగర్భముగా అంజలిసేయును.

రాజు.—ఆయుష్మంతుఁడవు కమ్ము.

కుమా.—[ఆత్మగతము]

ఆ. ఇతఁడు నాయన యని సుతుఁడను నే నని
వినఁగ నిట్టిప్రేమ ప్రిదిలె నెదను;
ఒకులయందుఁ బెరుఁగుబుడుత కెంతటిప్రేమ
గురువు దేలుకొనదొ గురులమీఁద ? 114

రాజు.—భగవతీ, ఏ ప్రయోజనమునకై మీరాక ?

తాపసి.—వినుము మహారాజా, ఈదీర్ఘాయువును ఆయువును పుట్టినప్పుడే ఉర్వశి ఏనిమిత్తముననో నాచేతిలో ఇల్లడ యుంచినది. క్షత్రియకుమారునికి వలసిన జాతకర్మాది విధానమును సర్వమును ఇతనికి భగవానుఁడు చ్యవనముని గావించినాఁడు. ఇతరవిద్యలు నేర్పి ధనుర్వేదమందును నేర్పరిం గావించినాఁడు.

రాజు.—సనాథుఁడ నైతిని గదా.

తాపసి.—ఇప్పుడు పుష్పసమిధలకొఱకు ఋషికుమారులతోఁ గూడ ఇతఁడును వచ్చి ఆశ్రమవిరుద్ధ మాచరించినాఁడు.

విదూ.—[ఆవేగముతో] ఏలాగు ?

తాపసి.—మాంసము తెచ్చుకొని గద్ద చెట్టుకొనను వాలుచుండఁగా వీఁడు దానిని కోలకు గుఱిచేసినాఁడు.

[విదూషకుఁడు రాజును చూచును.

రాజు.—తర్వాత తర్వాత ?

తాపసి.—అంతట ఆవృత్తాంతము నెఱింగి భగవంతుఁడు చ్యవనముని నన్నాజ్ఞాపించినాఁడు:—'నీచేతి యీయిల్లడను పంపివైపుము' అని. కావున, దేవిని ఉర్వశిని చూడఁగోరుచున్నాను.

రాజు.—అటయిన, అమ్మగారు కూర్చుండి నను గ్రహింపవలయును. [తెచ్చియుంచిన యాసనములో తాపసి కూర్చుండును.

రాజు.—లాతవ్యా, ఉర్వశిని పిలుచుకొనిరా.

కంచుకి.—దేవరయాజ్ఞ. [అని నిష్క్రమించును.

రాజు.—[కుమారుం గాంచి] రమ్ము వత్సా;

తే. సుతతనుస్పర్శ సకలాంగహిత మటంద్రు,
గాన నాదుకుమారక గాని నొసఁగి
నన్ను సాహ్లాదభరితుఁ జొనర్పు వేగ
కాంత మిందుకర మ్మిందుకాంతము బలె 115

తాపసి.—జాతా, నాయనకు ఆనందము సేయుము.

[కుమారుఁడు రాజును దరిసి పాదములం బట్టుకొనును.

రాజు.—[కుమారుని కౌఁగిలించి, పాదపీఠమునఁ గూర్చుండఁబెట్టి, ఇతనిని నీతండ్రికి ప్రియసఖుని బ్రాహ్మణుని అశంకితముగా ప్రణమిల్లుము.

విదూ.—ఏల శంకిస్తావు? శాఖామృగము ఆశ్రమవాసమున పరిచితమే.

కుమా.—[చిఱునవ్వుతో] బాబూ, నమస్కారము.

విదూ.—నీకు స్వస్తి,

[అంతట ఉర్వశియుం గంచుకియుం ప్రవేశింతురు.]

కంచుకి.—ఇటు ఇటు దేవి.

ఉర్వశి.—[కుమారుం గాంచి] ఎవరితఁడు? కేల విల్లున్నది, మహారాజు స్వయంగా పాదపీఠాన పిల్లజుట్టు ముడుస్తున్నాఁడు. [తాపసిని గాంచి] అహా! సత్యవతితోటి నాపుత్రకుడు ఆయువు; పెద్దవాఁడయినాడు. [పరిక్రమించును.

రాజు.—[ఉర్వశిం గాంచి]

క. చనుదెంచెను గౌతుకమున
నినుఁ గని కనుఁబండు వొంద నీజనని సుతా,
అనురక్తి మెయిం జేఁపిన
చనుగవపాలకుఁ దడిసినచనువలిపముతోఁ. 116

తాపసి.—జాతా, రా, లేచి అమ్మకు ఎదురేఁగుము.

[కుమారుఁడు ఉర్వశికి అభ్యుద్గమనము సేయును.

ఉర్వశి.—అమ్మా, నీపాదములకు మ్రొక్కెదను.
తాపసి.—బిడ్డా, భర్తకు బహుమతవు కమ్ము.
కుమా.—అమ్మా, అభివాదనము చేసెదను.

ఉర్వశి.—[కుమారుని ఉన్నమితముఖుని కవుంగిలించి] వత్సా, నాయనను ఆరాధించువాడవు కమ్ము. [రాజును దఱిసి] జయము జయము నీకు మహారాజా.

రాజు.—పుత్రవంతురాలికి స్వాగతము. ఇట కూర్చుండుము.

[అర్ధాసన మొసంగును.

[ఉర్వశి కూర్చుండును. అందఱు యథోచితముగా కూర్చుందురు.

తాపసి.—ఓసి వత్సా, ఈతఁడు ఆయువు విద్యలు నేర్చినాఁడు, ఇప్పుడు కవచధరుఁ డయినాఁడు. కావున ఇదె నీవుంచిన చేతియిల్లడను నీభర్త సముఖమున నీకు అప్పగించి వైచితిని. నాకు సెలవిండు; నేను పోయివచ్చెదను. నాయాశ్రమధర్మము నిర్బంధించుచున్నది.

ఉర్వశి.—చిరకాలానికి ఆర్యను చూచి బొత్తిగా తనివితీఱ కున్నాను. పోయి రమ్మననేరను. నిర్బంధించి నిలపడం న్యాయంగాదు. కనక ఆర్యా పోయిరా, మళ్ళీ దర్శనం కలుగును గాక

రాజు.—అమ్మా, భగవంతునికి చ్యవనమునికి నాప్రణామమును నివేదింపుము.

తాపసి.—అట్లె చేసెదను.

కుమా.—ఆర్యా, నిజముగా పోదువేని నన్నుకూడ ఆశ్రమము నకు గొనిపొమ్ము.

రాజు.—ఓయి బాలకా; ప్రథమాశ్రమమున అటనేయుంటివి. ఇప్పుడు రెండవ యాశ్రమమునం బ్రవేశించుటకు నీకు సమయము.

తాపసి.—జాతా, పితృవాక్యమును పాలింపుము.

కుమా.—అటయిన,

క. నాయొడిలోఁ జూడాకండూయనసుఖసుప్తమయ్యెడుఁగా శితికంఠం,
బోయన బురిమొలచినయా, నాయర్మిలి నెమలిబోదనాకుఁ బనుపుమా.

తాపసి.—[విహసించి] అట్లే చేసెదను మీకు స్వస్తియగుఁగాక!
[అని నిష్క్రమించును.

రాజు.—కల్యాణీ.

క. ఈనీదుసుపుత్త్రునిచే, నైనాఁడను బుత్త్రవంతు లందఱిలోనన్
నే నగ్రగణ్యుఁడ శచీ, సూనుఁ డగుజయంతుచేత సురపతివోలెన్.
[ఉర్వశి స్మరించి ఏడ్చును.

విదూ.—ఏమి యిది? ఈ మహానీయురాలు ఒక్కమ్మడిని అశ్రుముఖి యయినది?

రాజు.—[సావేగము]

తే. చెలియ యుత్తేల నేఁ గులస్థితిని బొంది
హర్ష వారాన్నిధిని నోలలాడుచుండ,
నిండుపాలిండ్ల కురలుకన్నీటిధార
మించు ముత్తెసరుల నిన్మడించు నట్లు. 119

[అని ఆమెయొక్క కన్నీళ్లను తుడిచివైచును.

ఉర్వశి.—చిత్తగింపుము మహారాజా. మొదల పుత్త్రదర్శనము చేత మఱచియుంటిని, ఇప్పుడు మఱి మహేంద్రసంకీర్తనముచేత ఏర్పాటు నాగుండెను తల్లడపెట్టుతున్నది.

రాజు.—ఆయేర్పాటును చెప్పుము.

ఉర్వశి.—పూర్వము నన్ను మహారాజగృహీతహృదయను మహేంద్రుడు ఆజ్ఞాపించెను.

రాజు.—ఏమని ?

ఉర్వశి.—"ఎప్పుడు ఈతఁడు నా ప్రియసఖుఁడు రాజర్షి నీయందు జనించిన వంశకరుని ముఖము చూస్తాడో అప్పుడు నీవు మళ్ళీ నా సమీపానికి రావలశినది" అని. అందువల్ల నేను మహారాజవియోగానికి వెఱచినదాననై జాతమాత్రుని వీనిని విద్యాప్రాప్తినిమిత్తమై చ్యవనభగవంతుని యాశ్రమపదంలో సత్యవతమ్మ చేతిలో అప్రకాశంగా ఇల్లడ వుంచితిని. ఇప్పుడు తండ్రిని కొలవడానికి సమర్థుడయినాడని ఆలోచించుకొని ఆమె మళ్లీ నాకు దీర్ఘాయుష్మంతుని అప్పగించింది, కనక నాకు ఇంతపాటియే మహారాజుతోటి సంవాసము. [అందఱు విషాదము రూపింతురు.

రాజు.—[నిట్టూర్పుతో] అహో! దైవము యొక్క సుఖవిరోధిత!

తే. ఆశ్వసిలితినొ లేదొ పుత్త్రప్రాప్తిచేత, వెంటనే,వను సకియా, నీవిరహ మంతె;
ప్రథమవృష్టికి వాతపజ్వర మెడసిన, వృక్షమునిరమ్మ వపువహ్ని యేర్చినట్లు.

విదూ.—ఈయర్థము అనర్థానుబంధి యయినది నాకు తోస్తుంది ఈయన ఇకమీద నారచీరలు ధరించి తపోవనాన్ని సేవించవలశినదని.

ఉర్వశి.—కృతవిద్యుణ్ణి పుత్రుణ్ణి బడసి మహారాజు మందభాగ్యను నన్ను స్వర్గానికి పో సెలవిచ్చి కృతార్థనుగా భావింపవలెను.

రాజు. వలదు వలదు.

చ. తనకుఁ బ్రియంబు సేరికొన దక్షతఁ జెందదు నాథవంత మా
జనము వియుక్తిభాజనము, సల్పుము నీ వధినాథు చానతిక్;
నిను నెడఁ బాసి యీబుసుత నీసుతు రాజ్యమునందు నిల్పి నే
వనముల నాశ్రయింతు సకి, వన్యమృగంబులె సంగడీలుగాక్. 121

కుమా.—మేటివృషభము మోచినభారమును లేతకోడెమీఁద మోపుట నాయనకు తగవుగాదు.

రాజు.—ఓయి వత్సా,

చ. కలభమ యయ్యునుం జదుపు గంధగజం బితరద్విపంబులన్,
వెలయును బ్రాఁచుఁగొందువిష వేగము తీవ్రతరంబుగాఁ గదున్,
ఇల నెకిమీఁడు బాలకుఁడ యేనియు నేలు సమర్థుఁడే యగున్,
వలదు వయస్సు, పుట్టుకనె వర్గ మి దాత్మకృతిక్షమంబగున్. 122

లాతవ్యా, నామాటగా అమాత్యపరిషత్తునకుం జెప్పుము. ఆయువునకు రాజ్యాభిషేకసంభారములను సమకూర్పుఁడని.

కంచుకి.—దేవరయాజ్ఞ. [అని దుఃఖితుఁడై నిష్క్రమించును.

[అందఱు కనులు మిఱుమిట్లుగొనుటను రూపింతురు.

రాజు.—[ఆకాశముం గని] ఏమి యిది! మేఘములేకయే మెఱపుల మొత్తము పడుట?

ఉర్వశి.—[విలోకించి] అహో! భగవంతుడు నారదుడు.

రాజు.—ఆహా! భగవంతుఁడు నారదుఁడు! ఈయన,

చ. జడగుమి గోరజంపునికపంపుఁబిశంగిమతో విరాజిలన్,
గడలుకొనంగ జన్నిదము కైరవబంధుకలామలచ్ఛవిన్
తొడిగినతారహారములు తోరపుఁగాంతిని గ్రాల, నేఁగుదెం
చెడిని బసిండియూడలకు జెందినజంగమకల్పకంబు నాన్. 123

ఈయనకు అర్ఘ్యము!

ఉర్వశి.—[చెప్పినట్లు తెచ్చి] ఇదిగో, భగవంతునికి పూజ.

[అంతట నారదుఁడు ప్రవేశించును.]

నారదుఁడు.—విజయము మధ్యమలోకపాలునికి.

రాజు.—[ఉర్వశి చేతినుండి అర్ఘ్యముందుకొని వంచి] భగవంతుఁడా, అభివాదనము చేయుచున్నాను.

ఉర్వశి.—భగవానుడా, ప్రణమిల్లుచున్నాను.

నార.—ఎడఁబా సునిదంపతుల రగుఁడు.

రాజు.—[ఆత్మగతము] ఆహా! ఇట్లగునా! [ప్రకాశము కుమారుని కవుంగిలించుకొని], వత్సా భగవానునికి నారదునికి ప్రణమిల్లుము.

కుమా.—భగవానుఁడా! ఔర్వశేయుఁడను ఆయువును ప్రణమిల్లుచున్నాను.

నార.—ఆయుష్మంతుఁడ వగుము.

రాజు.—ఇదె యాసనము, అలంకరింపవలయు.

[నారదుఁడు కూర్చుండును. అందఱు నారదునిపిమ్మటఁ గూర్చుండురు.

నార.—రాజా, మహేంద్రునిసందేశమును వినుము.

రాజు.—అవహితుఁడను

నార.—ప్రభావదర్శి శతమఖుఁడు అటవి కేఁగ సంకల్పించుకొన్న నిన్ను ఇట్లు అనుశాసించుచున్నాఁడు.

రాజు.—ఏమి యాజ్ఞాపించుచున్నాఁడు?

నార.—త్రైకాల్యదర్శులు మునులు ఆదేశించినారు-సురాసుర సంగ్రామము కలుగనున్నదని నీవు నాకు యుద్ధములలో గడిదేరినసహాయుఁడవు. కావున, నీవు ఇపుడు శస్త్రసన్న్యాసము చేయఁగూడదు. ఈ యుర్వశియు యావజ్జీవము నీకు సహధర్మచారిణిగా నుండవలసినది.

ఉర్వశి—[అపవారించి] అహో! నాహృదయమునుంచి శల్యము ఉద్ధృతమయినది!

రాజు.—ఇంద్రునిచేత సాథవంతుఁడను,

నార.—యుక్తము.

ఆ. నిర్వహించుఁ గాక నీకార్యమును వజ్రి,
యీవొనర్పు మతనియిష్టములను;
పెనుచుచుండు నినుఁడు వీతిహోత్రునివెల్గు,
వీతిహోత్రుఁ డినునివెల్గుఁ బెనుచు. 124

[మింటివైపు చూచి] రంభా, కుమారునికి ఆయువునకు మహేంద్రుఁడు స్వయముగా పంపిన యావరాజ్యాభిషేకసంభారములను తెండి.

[యథోక్తహస్తలు అచ్చరలు ప్రవేశింతురు.]

అచ్చరలు.—భగవంతుఁడా, ఇవుగో అభిషేకసంభారాలు.

నార.—భద్రపీఠమున ఆయుష్మంతుని కూర్చుండఁబెట్టుఁడు.

రంభ.—వత్సా, ఇటు. [కుమారునిఁ గూర్చుండఁబెట్టును.

నార.—[కుమారునిశిరమున కలశమును కుమ్మరించి రంభా, కడమవిధానమును నెఱవేర్పుము.

రంభ.—యథోక్తము కావించి వత్స, భగవంతునికిన్ని అమ్మకూ నాయనకున్ను ప్రణమిల్లు. [కుమారుఁడు వరుసగా ప్రణమిల్లును

నార.—నీకు స్వస్తి

రాజు.—కులధురంధరుఁడవు కమ్ము.

ఊర్వశి.—నాయనను ఆరాధించేవాడవు కమ్ము.

[నేపథ్యములో వైతాళికులు]

ప్రథముఁడు.—విజయము యువరాజునకు

తే. అజుని సురమౌని యత్రి, యా యత్రిని శశి,
శశిని సౌమ్యుఁడు, సౌమ్య భూజానివోలె,
అయ్య ననుకరింపును లోకహారిగుణత,
నెల్లయాశాస్యములకు మీాయిల్లె యిల్లు 125

ద్వితీయుఁడు.—

ఉ. ఉన్నతులందు నీజనకుఁ డున్నతుఁ, డీవును నప్రకంప్యతఁ
ము న్నయి మేర దప్పనిసు పుత్త్రుఁడ, వీమిముఁ గొల్చు చిర్వర్వఁ,
పన్నగ రాజ్యలక్ష్మి ప్రవిభక్త వహించెఁ దుషారశైలవా
రాన్నిధులందు వ్యాప్తి గొని రాజిలుగంగను బోలుభాగ్యముల్. 126

అచ్చరలు.—[ఊర్వశిని దఱిసి] అహాహా; పుత్త్రుని యువరాజశ్రీ చేతను భర్తతోటి అవియోగంచేతను వర్ధిల్లుతున్నావు!

ఊర్వశి.—ఈయభ్యుదయం అందఱిదిన్ని, [కుమారుని కేలంగొని] వత్సా రా, మీ దొడ్డమ్మకు నమస్కారం చేయి [కుమారుఁడు లేచును.

నార.—ఉండు, సమయాన ఆమెకడకు పోయెదవు.

క. నీయాత్మజుఁడగు నాయుని, శ్రీయువరాజత స్మరింపఁ జేయు నసుర స్వా
ర్నాయకుచే సురసేనా, నాయకతం బూన్పఁబడు పినాకితనూజా.

రాజు.—భగవంతునిచేత ఇట్లు అనుగృహీతుఁ డయినవాఁడు యోగ్యుఁడు కాకుండు టెట్లు?

నార.—నీకు పాకశాసనుఁడు ఇంక నేమి ప్రియము చేయవలయును?

రాజు.—మఘవంతుఁడు నాకు ప్రసన్నుఁడై యుండఁగా అంత కన్న ఏమి కోరుదును. అయినను ఇట్లగుఁగాక.

[భరతవాక్యము.]

క. సిరికి సరస్వతికిఁ బరస్పరవిద్వేషిణుల కేకసంశ్రయమునయం
దరుదగుసంగతి తలచై, పొరయించును గాత సాధువుల కుద్భూతిన్.

మఱియు—

క. ఎల్లరు నిడుములు గడచుత,
మెల్లరుఁ గల్యాణముల రహింతురు గాతన్,
ఎల్లరుకోర్కులు దీఱుత,
మెల్లరు నందింత్రుగాత మెల్లధరిత్రిన్. 129

పంచమాంకము సమాప్తము.

విక్రమోర్వశీయనాటకము సమాప్తము.



చెన్నపురి : చంద్రికాప్రెస్సున ముద్రితము.—1947
Q. H. M. S. 114 B.—2000—1-8-1947.

## లఘు వివరణము

[సంపాదక కృతము]

ప. ౧. ఎవనిని వేదాంతములందు రోదసిని వ్యాపించియున్న యేక పురుషుంగా చెప్పుదురో, అనన్యవిషయమైన యీశ్వరశబ్దము ఎవ్వనియందు యథార్థాక్షరమో, ఎవనిని ముముక్షువులు ప్రాణాదులను నిరోధించి లోన వెదకుదురో, ఆస్థాణుఁడు స్థిరభక్తియోగసులభుఁడు మీకు నిశ్శ్రేయస మొసంగుఁగాక.

వేదాంతము - మూలము, వేదాంతేషు=అన్ని ఉపనిషత్తులలోను. ఉపనిషత్తులు వేదసారమగుటచేతను వరుసక్రమమున సంహితలకును ఆరణ్యకములకును బ్రాహ్మణములకును తర్వాతివిగావున వేదాంతమని ప్రసిద్ధి.

రోదసి=భూమ్యాకాశముల నడిమిప్రదేశము. సృష్టిలోని చోటెల్ల

ఏకాత్ము=అద్వితీయుని

ఇతర+అప్రాప్తంబు=ఇతరులకు వర్తింపక

సార్థార్థమైనమా, యథార్థాక్షరః; స+అర్థ+అర్ణము+ఐ

నియమితప్రాణాదులు=ప్రాణ, అపాన, సమాన, వ్యాన, ఉదానము లనెడియైదు వాయువులను తమకు వశముచేసికొనినవారు; ఇంద్రియములను జయించినవారు.

నిశ్శ్రేయసము=నిశ్చితమైన శ్రేయసము. (మేలు.)

ఇద్ధభక్తివశుఁడు=స్ఫుటమైనభక్తికి వశుఁడగువాఁడు. స్థాణుఁడు ధ్యానగోచరుఁడని రంగనాథవ్యాఖ్య. 'శ్రద్ధాభక్తి ధ్యానాత్ అవేహి.' కైవల్యోపనిషత్. భక్తియోగము అష్టాఙ్గయోగముకన్న సులువు.

స్థాణుండు=స్థాణువనఁగా చలింపని మ్రాఁడు లేక శాశ్వతమైనదని యర్థము. ఈ రెండవ యర్థముననే శివునకు వర్తించుచున్నది. ఈశబ్దము శివునియందు ప్రాచీనకవులకును ముఖ్యముగా కాళిదాసునికిఁగల భక్త్యతిశయమును సూచించుచున్నది. ఉదా— 'వాగర్థావివ' రఘు. 'ఏకైశ్వర్యేస్థితోఽపి' (మాళవిక) యాస్సృష్టిః (శాకుం). అట్లే భవభూతి 'సానన్దం నన్దిహస్తాహత' 'చూడాపీడ' 'పత్న్యాః పిఙ్గళిమ్నః' ఈమాత్రముచేతనే

కాళిదాసుని శైవుఁడనరాదు. రఘువునందు విష్ణువును, కుమారసంభవమునందు బ్రహ్మదేవుని కావ్యమధ్యమున హెచ్చుగా స్తుతించియున్నాఁడు; త్రిమూర్తులయైక్యమును సయితఁ జెప్పుకొనియున్నాఁడు.

ఇది నాందీశ్లోకము—"నాందియనునది నాటకాదులయారంభమందు దేవబ్రాహ్మణ రాజప్రభృతులకు స్తుతిగా సామాజికాదులకు ఆశీర్వచనరూపముగా 8, 12, 18, 22 పదములుగలదిగా రచింపఁబడును. ఇందు బిల్వ శంఖ చంద్రకమలములు, చక్రవాకకుము దాది శుభ వస్తువాచకములను కావ్యార్థసూచనయు నుండవలయును. కొందఱమతంబున పదనియమ కథాంశసూచనలు పాక్షికములు. ప్రాయికముగా నాటకములలో నాంది యని తలంపఁబడుచున్నట్టిది పూర్వరంగముయొక్క రంగద్వార నామకమైన యంగము గాని నాందిగాదని కొందఱమతము. (వే. వేం. శాస్త్రిగారి, సాహిత్యదర్పణము.)

"నాటకమందు ముందుగాపూర్వరంగము, ఆటుపిమ్మట సభాపూజ, తర్వాత కవిని పేర్కొనుట, నాటకమునుఁగూడ పేర్కొనుట, తర్వాత ప్రస్తావన. అందు నాట్య వస్తువుకంటె ముందుగా రంగవిఘ్నోపశాంత్యర్థము నటులు గావించునట్టిది పూర్వ రంగమనఁబడును. దీని యంగములలో ముఖ్యమైనది నాంది యనునది.

"ఎందువలన మొదట అభినయమిందు తేఁబడునో అందువలన వాగంగాభినయా త్మకమైన యిది రంగద్వారమని యెఱుంగఁబడును. మఱియుం జెప్పిన ప్రకారంపు నాందిని రంగద్వారముకన్న ముందే నటులుచేయవలసినట్లుగా మహర్షి నిర్దేశించినాఁడు. అందు వలననే కాళిదాసాది ప్రబంధములయందును 'వేదాన్తేషు' (ఏనింజాటును) ఇత్యాదు లందు నాందీలక్షణము పట్టకున్నది. ఇక రంగద్వారము మొదలుగా కవి (నాటకమును) రచించునది, అనియుం జెప్పఁబడియున్నది. కావుననే ప్రాచీన పుస్తకములయందు 'నాన్ద్యన్తే సూత్రధారః' అనుదానియనంతరమే 'వేదాన్తేషు' ఇత్యాది శ్లోకము వ్రాఁత కనఁబడుచున్నది. ఎచ్చట 'నాన్ద్యన్తే సూత్రధారః' అను వ్రాఁత పిమ్మట అగపడు చున్నదో అచ్చట నభిప్రాయమేమనఁగా 'నాంద్యంతమున సూత్రధారుఁడు దీనిని ప్రయోగించినాఁడు. ఇదిమొదలు నాచేత నాటకము తొడఁగఁబడుచున్నది' అని కవి యభిప్రాయము సూచింపఁబడినది అని." (సాహిత్య)

ఇందు కథాంశసూచనను, శ్లోకమును పురూరవునికి అన్వయించి రంగనాథవ్యాఖ్య యిట్లు చెప్పుచున్నది—వేదాంతము (అనఁగా తత్సమీపమున) ఎవనిని అనన్యసామాన్య

ప్రజాపాలన దయాదాక్షిణ్యాదుల సంయోగముచే (ఏకాత్మ) ముఖ్యునిఁగా వచించుదురో (బుధులు వచింతురో), ఎవనికీర్తి రోదసియంతయు నిండియున్నదో, ఎవనియందు ఈశ్వర (రాజు) శబ్దము నిగ్రహానుగ్రహాది ప్రభుశక్తి సంపత్తిచే యథార్థాక్షరమో, ఏరాజును మునీశ్వరులు 'ఇంతటి ధర్మశీలుఁడైన రాజు ఇంతకుపూర్వము జగతిని లేఁడు' అని నిరంతరము హృదయమున తలంతురో, అట్టిస్థాణువు, అనఁగా అతిథిరుఁడు, (పురూరవుఁడను నీరాజు) ఇద్ధభక్తివశుఁడు (సంగమనీయాఖ్య మణిచే ఉర్వశికి మరల సులభముగా వశుఁడైనవాఁడు)—ఇట్టి సుగుణసంపత్తిగలరాజు—మీకు నిశ్శ్రేయసముల నిచ్చుఁగాక—అని.

పుట 1. సూత్రధారుఁడు—కథాసూత్రమును ధరించువాఁడు సూత్రధారుఁడు, ప్రధాన నటుఁడు. ఒక సూత్రధారుఁడు తెరచాటననేని బయటనేని నాందిని పఠించును; అనంతరము అతఁడేయేని, అతఁడుపోయి (స్థాపకుఁడను పేరి) యింకొక సూత్రధారుఁడేని తెరబయట ప్రస్తావనను జరుపును.

పారిపార్శ్వకుఁడు సూత్రధారుని యనుచరుఁడు; అతనికన్నను తక్కువనటుఁడు.

ప్రయోగబంధము='ప్రయోగః అభినయః బధ్యతే అస్మిన్ ఇతి ప్రయోగబంధో నాట్యమ్.' (కాటయవేమ) ప్రయోగమనఁగా అభినయము బంధింపఁబడియున్నది గాన ప్రయోగబంధము, అనగా నాట్యము, ఇచ్చట నాటకము.

ప్రయోగించెదను=ఆడించెదను.

ఆర్యమిశ్రులు=పెద్దలు, పూజ్యులు.

పద్యము ౨. స్నేహితులమీఁది దాక్షిణ్యముచేతనేమి, కథయందలి గౌరవముచేతనేమి, సావధానాత్ములై కాళిదాసు రచియించిన యీ రూపకమును మీరు అవధరింపుఁడు.

ప్రణయవంతులు=స్నేహితులు (తమ విద్యయందలి నేర్పును ప్రకటింపఁగా చూడఁ బ్రార్థించునట్టి మాయందలి దాక్షిణ్యముచేత అని కాటయవేమ.) వస్తు=ఇతివృత్తము, కథ. పురుషులు=వర్ణింపఁదగిన నాయకుఁడు మొదలైనవారు. దృశ్యము శ్రవ్యము అని కావ్యము ద్వివిధము. అందు దృశ్యమభినేయము. అదియే రూపకము—నాటకమని సామాన్యముగా చెప్పినను నాటకము దశరూపకములలో నొకటి. రూపకమే సామాన్యవాచకము. నటునియందు రామాదిరూపము నారోపించుటచేత నాటకము లన్నిటిని రూపకములందురు. రూపకములు పది, ఉపరూపకములు పదునెనిమిది.

విక్రమోర్వశీయమును సంస్కృతలాక్షణికులు ఉపరూపకములలో నొకటగు త్రోటకముగా పేర్కొనిరి. "త్రోటకమున ఏడు ఎనిమిది తొమ్మిది అయిదు అంకము లుండును; దివ్యాదివ్యుఁడు నాయకుఁడు; ప్రతియంకమునను విదూషకుఁడుండును. అందుచే నిందు శృంగారము అంగి." (సాహిత్య. 6-౨౪౦)

పు. 2. నేపథ్యము - పరదాలోపలి ప్రదేశము. అచటి సూచనకే చూళికయని పేరు. ఇది అర్థోపక్షేపకములలో నొకటి. అవి యైదు—విష్కంభ ప్రవేశక చూళి కాంకావతారాంక ముఖములు.

ప 3. నరునిసఖుఁడైన మునీంద్రుని తొడనుండి జనించిన యప్సరస (ఊర్వశి) కుబేరుని ప్రొలవృత్యసేవచేసి వచ్చుచుండఁగా మార్గమధ్యమున అసురులు అడ్డుపడగా అప్సరసలగణము శరణుకై కుయి వెట్టుచున్నది.

నరుఁడనియుం నారాయణుఁడనియుం నిరువురు ప్రాచీనులు ఋషులు ఋగ్వేదము నందు పఠింపఁబడియున్నారు. వీరిలో నారాయణఋషితొడనుండి ఊర్వశి జనించిన దని హరివంశము.

నాక రమణి=దేవస్త్రీ, అప్సరస ఊర్వశి. విత్తపుఁడు=కుబేరుఁడు.

అర్థపథమున=మార్గమధ్యమున. అమరారులు=దేవతల శత్రువులు, అసురులు.

ప్రస్తావన - నటియైన విదూషకుఁడైన పారి పార్శ్వకుఁడైనియు సూత్రధారునితో స్వకార్యములంగూర్చి చిత్రవాక్యములతో నారంభించి నాట్యవస్తువును ప్రశంసించునట్టి సంభాషణ ఆముఖము అనియుం ప్రస్తావనయనియుం పేర్కొనఁబడును. దీని అంగములు ఐదు - ఉద్ఘాత్యకము, కథోద్ఘాతకము, ప్రయోగాతిశయము, ప్రవర్తకము, అవలగితము అని. ఇచ్చట 'కావరయ్యా...' మొదలగు వాక్యములచేత అప్సరసల ప్రవేశమును సూచించి సూత్రధారుఁడు నిష్క్రమించుటచేత తన ప్రయోగమును అతిశయించిన ప్రయోగమును ప్రయోగించినాఁడు. దీనిచే తర్వాత ప్రవేశించువారు అప్సరసలని సామాజికులకు తెలియును. [విమర్శించి చూడఁగా ప్రస్తావనయనునది నాటకమును పేర్కొనినవెంటనే నాటకమును ప్రారంభించుటకు తగినవాక్యము, సూత్రధార సంభాషణకును నాటక ప్రథమాంకమునకును అతుకువంటిదిగాని నాందీ శ్లోకము మొదలు సూత్రధారాదులు నిష్క్రమించు వరకుగల సంభాషణయంతయంను కాదని తెలియం చున్నది.]

# ప్రథమాంకము

పు. 3 కావగయ్యా - అదేవాక్యమును మరలచెప్పుటచే సూత్రధారుఁడు సూచించిన యప్సరసలు వీరే అని తెలియును.

అపటీక్షేపము=తటాలున. సూచనలేక పాత్రము ప్రవేశించుటయు నిష్క్రమించుటయు నాటకలక్షణ విరుద్ధము. సూచనలేకయే పురూరవుఁడు ప్రవేశించినందున కవి అపటీక్షేపమని చెప్పుట. అపటియనఁగా తెర. దానిక్షేపము తెఱచుట. తటాలున తెరత్రోసికొనివచ్చుటయని యర్థము. కావుననే రాజు తనపేరు తానే చెప్పుకొనెను.

సూర్యోపస్థానము - సూర్యభగవానుని సేవ. నిత్యసంధ్యావందనము గాదు. దీనిచే నతఁడు సురిపక్షపాతియనియు ఆకాశగమనముగలవాఁడనియు సూచన. దానిని పురూరవుఁడు ఈ నాటకములో నొకపర్యాయమే జరిపియున్నాఁడు. చూ. 'సూర్య భగవానుని ఉపస్థానంచేసి వచ్చినప్పటినుంచి ఆర్యపుత్త్రుఁడు శూన్యహృదయుఁడుగా కనబడుతున్నాఁడు' రాణివాక్యమని చేటిచెప్పుట. ప్రవేశకము. పుట 11.

అసురదర్పము - మూ. 'అసురావలేపాత్' అవలేపమనఁగా గర్వమని రంగనాథ వ్యాఖ్య. దర్పమని కాటయవేముఁడు దర్పమే మెఱుఁగు. గర్వము కేవలము అహంకార సూచకము. దర్పము విశృంఖల వర్తనమును దురాశను సూచించును.

తపోవిశేష పరిశంకితుఁడు - విశేషతపశ్చర్యచే నెవఁడైనను తన పదమును వాంఛించి పొందునేమోయని దేవేంద్రునికి నిరంతరము భయము. కావుననే తపోభంగముచేయుటకు అప్సరసలను పంపుట.

హిరణ్యపురము ఆకాశముననున్నది. కావుననే 'ఆకాశగమనము' కావలసివచ్చినది, చూ. మహాభారత - వనపర్వ.

అవధారుఁ=చిత్తగింపవలయును. 'అవధారయతు' అను సంస్కృతపదముయొక్క ప్రాకృతరూపమగు 'అవధారఉ' అనుపదమునకు ఇది వైకృతము. ఇందు అచ్చ తెనుఁగులో లేనిది ఒత్తక్షరముండుటయు, ఇది ప్రాకృతమునుండి తెచ్చితమునకు వైకృతం బగుటయు, ప్రకృతిలో ప్రథమ పురుషమైయుండుటయు విశేషములు. (శృం. నై. సర్వంకషా వ్యాఖ్య. పు. 227) అవధారు - దీనికి విన్నము అర్థమనియు 'ఆవధారణాక్

ప్రకృతియనియు సీతారామాచార్యులవారు. 'అవధారయ' (=చిత్తగింపుము) 'అవధారయతు' (=చిత్తగించుఁగాక,) అను సంస్కృత క్రియాపదములకు క్రమముగా 'అవధారసు' 'అవధార ఉ' అని ప్రాకృతమున రూపములు. రెండవది రూపమునను తొలిది అర్థమునను 'అవధారు'నకు చేర్పగానున్నది. రెండవదియే ఇట్లు అర్థముతోఁగూడ మారియుండును. (శ్రృం. నై. సర్వంకషా వ్యాఖ్య. పు. 687–'88)

పు. 4. హేమకూటశిఖరము - ఎత్తుగావున చూచుట కనుకూలము.

ఆయుష్మంతునియాజ్ఞ - 'రథిని సారథి ఆయుష్మంతుఁడా అనవలయును.' (సా. ద 6 పరిచ్ఛేదము. సూ. ౪౩౧.) సూతుఁడు కంచుకితో సమాన మర్యాదనుపొందును; సామాన్యముగా వృద్ధుఁడుగానుండును. రాజు వీరిని మర్యాదగాచూచును. ఉదా. ఉత్తర రామచరిత్రలో కంచుకి 'రామభద్ర' అని అర్ధోక్తిలో 'మహారాజ' అని మార్చుకొనును. రాముఁడు చిఱునవ్వుతో 'ఆర్యా, నాయనగారి పరిజనమునకు నిక్కముగా నన్నుఁ గూర్చి రామభద్ర అను నుపచారమే శోభించును. కావున అలవాటుప్రకారము పలుకుము' అని చెప్పును. సాధారణముగా గొప్పవారే సారథ్యము చేయుచుండిరి. ఆవిద్యకు అధికమైన గౌరవముండెడిది. కృష్ణుఁడు అర్జునుని సారథి. సుభద్రకు అతఁడే ఆ విద్య నేర్పియుండినందున పాఱిపోవునప్పు డుపకరించినది. సత్యభామ. కైకేయి మున్నగువారు రథచర్యాదులను నేర్చియుండిరి.

ఇంద్రాపకారి - కావుననే తనకార్యము జయమగుననియు, దేవతలు సాయపడుదురనియు భావము.

ప. ౪. గాలి వీచుచున్న వేగముచేత మేఘములు, భూమిపై రథముపోవునప్పుడు దుమారములేచిన నెట్లుండునో అవిధముగా పోవుచుండినవి. చక్రములు తిరుగుటచే వానియాకులలో హెచ్చుగా ఆకులుండిన నెట్లుండునో అట్లుండినది; గుఱ్ఱములనెత్తిన నున్న చామరములు గాలికి కదలక చిత్రితములవలె నున్నవి; జెండా చక్కఁగావిచ్చి నట్లు కొయ్య కొనలో నిలిచియున్నది.

మేఘములు గాలి ననుసరించిపోవునవి. చక్రములు తిరుగుటలో మామూలు వేగమైనచో ఆకులుకొంత తెలియును. గుఱ్ఱములనెత్తిన నుంపబడిన చామరములు ప్రక్కకు వాలి ఇట్లునటు పడియుండుట సహజము. జెండా వస్త్రము గాన వ్రాలియేయుండును.

కవి రథవేగమును చక్కఁగా వర్ణించినాఁడు, వేగముగా రథముపోవుటచే నేర్పడిన గాలి విసరుచేత మేఘములు దుమారమువలె నెగిరిపోవుటయుం చక్రములు గిఱగిఱతిరుగుట చక్రమంతయుం ఆకులు గీఱలుగాను, చామరములు ఇటునటువ్రాలక నిలువుగానే త్రోయఁబడుచుండుటయుం, జెండాగుడ్డ మడతలులేక చక్కఁగా విచ్చినట్లుండుటయు ననువిశేషములు సంభవించినవి.

నిర్దిష్టప్రదేశము - ఏర్పాటుచేసికొనినచోటు - హేమకూటశిఖరము.

నిగుడుతున్న - గాలిచేత ఈ నిగుడు.

చిత్రలేఖావలంబితహస్త=చిత్రలేఖచే పట్టుకొనఁబడినచేయిగలది. భయనిమీలితాక్షి=భయముచే మూతవడినకన్నుగలది. ఇందుచే అసురుఁడు పట్టుకొని చాలసేపుకాలేదనియుం, ఆ భయముచే ఉర్వశికి కలిగినమూర్ఛ ఇంకను తేరలేదనియుం, ఇంతలోపలనే పరాక్రమవంతుఁడు పురూరవుఁడు సులువుగా కేశిదానవునిజయించి ఉర్వశిని విడిపించెననియుం తెలియుచున్నది. ఇదంతయుం ఎక్కువకాలముపట్టలేదు.

ప. గీ. ఓసి. భీరు, అసురుని భయముపోయినది; వజ్రియొక్కమహిమ ముల్లోకములను కాపాడునట్టిదిగదా. కావున ప్రభాతసమయమున పద్మాకరమున తామరలుంబోలె నీ విశాలనేత్రములను తెఱచిచూడుము.

ఇందలి మొదటి రెండు చరణములను వక్త కేశికాఁడనియుం పురూరవుఁడనియుం ఉర్వశికి సూచన. పురూరవుఁడు కేశిని కొట్టుటకుముందే ఆయమ మూర్ఛిల్లెను. భయము లేదని సూచించుటకే ఈవాక్యము. ప్రత్యూషము=తెల్లవారుజాము.

రాత్రియంతయుం తామరపువ్వులుముకుళించియుండును. ఉర్వశీనేత్రములే తామర పువ్వులు. కేశిదానవుఁడు రాత్రి. వానింజూడఁగానే ఉర్వశి మూర్ఛిల్లినది. పురూరవుఁడు ప్రత్యూషము - వజ్రిమహిమ. వజ్రి ఉదయింపనున్న సూర్యుఁడు ప్రభాతప్రకాశము నకే పద్మమువిచ్చును. పురూరవుని దర్శనముచేతనే ఉర్వశీ నేత్రోన్మీలనము కావలయును. [పురూరవునికి ఉర్వశీ నేత్రదర్శనము అభిలషణీయము; తన శ్రమకు ఫలము.]

వజ్రి - వజ్రము ఆయుధముగాగలవాఁడు. కావుననే అతని మహిమ జగత్త్రయ+అవనము=ముల్లోకములను+రక్షించుటది.

ఇంకనూ - భయముపోయినది.

ప. ౬. కుసుమసదృశబంధనమును పడతియెదను యిప్పటికి సదరు విడువద; స్తనమధ్యోచ్ఛ్వసితసడరెడు హరిచందనద్రవాంకము దీనిందెల్పెడి.

కుసుమ సదృశబంధనము - పువ్వు తొడిమతోనంటియున్నట్లున్న, అతిసుకుమారమని యభిప్రాయము.

స్తనమధ్యోచ్ఛ్వసితసడరెడు - స్తనముల నడిమ ప్రదేశమున ఉచ్ఛ్వాసముచేత గుండెలు కొట్టుకొనుట తెలియుచున్నది. పురూరవునిదృష్టికి ఇదెట్లు కనఁబడినది? కంచుకము లేదా? ఊహించియుండునా? ఉర్వశికి కంచుకముకలదు. చూ. 'శుకోదర శ్యామలము...స్తనాంశుకము' అంక—4, ప. 68.

ఈమె హృదయము అతిసుకుమారము. పువ్వు తొడిమనంటియున్నట్లుశరీరము నంటియున్నది. గాలికే పువ్వము తొడిమనుండి రాలుటలేదా? అట్టి యీమెకుభయము ఇంకను తీరలేదు. ఉచ్ఛ్వాసనిశ్వాసముల వేగముచేత గుండెలు కొట్టుకొనుటవలన స్తనములనడుమ పూసియున్న హరిచందనలేపము కదలుటచేత అది తెలియుచున్నది. ఈ సుకుమారి ఏమగునోకదా - అని యభిప్రాయము.

అచ్చరలాగ భయపడుట మానవస్వభావము. అప్సరసలకు తగనిది ఇది. రాబోవు మానవత్వమును సూచించుచున్నది.

ప. ౭. లోపలి మూర్ఛ తేరుచుండఁగా ఈ జవరాలు - చంద్రోదయమైనంత చీకటి అడఁగుటచే రాత్రి ఎట్లుండునో అట్లును, రాత్రి వెలిగించినమంట పొగతగ్గిన నెట్లు ప్రకాశించునో అట్లును, గట్టులో కొంతభాగము నీటిలో దొర్లినయెడల నీరు కలఁగిపోయి క్రమముగా తేరుకొను గంగానదివలెను - తోచుచున్నది. క్రమముగా మూర్ఛ తేరుచున్నదని భావము, పూర్తిగాపోలేదు.

వేల్పులపగతురు - బహువచనప్రయోగముచే పురూరవుఁడు కేశిదానవుని వాని సహాయులైన యసురులను తానొక్కఁడే కొట్టెనని తెలియుచున్నది.

మహేంద్రుఁడేమైనా - ఈమెకింకను జరిగినది తెలియదు.

మహేంద్రునితో సమానుఁడైన - ఎక్కువ గౌరవనీయుఁడని యభిప్రాయము.

ఉపకారం - ఉర్వశి ప్రౌఢనాయికగాన చూచుచునే శృంగార భావోదయము, 'ఈ కారణముననగదా ఈ యందగానిదర్శనము' అని, ఇది ఈ నాటకమునకు బీజము.

నారాయణఋషిని వలపింప - వలపించుట తపోవిఘ్నముకొ అని. 'తపో విశేష పరిశంకితుఁడు' గదా మహేంద్రుఁడు.

ప. ౮. ఈమెను సృజించుటయందు బ్రహ్మ గొప్ప కాంతినిపొందిన చంద్రుఁడాయెనా; లేక అతఁడే ఆదిరసమయిన శృంగారరసమునకు మూలమయిన మన్మథుఁడా, చైత్రమాసమా; అతఁడు, వేదములను వల్లించు జడుఁడు, పురాణఋషి, అన్ని ఆశలను పోయినవాఁడు మనమును ఇందిఁగొను నీసుందరరూపమును ఎట్లు సృజించియుండును!

ఉర్వశి అతిసుకుమారతచే శృంగారమయిగాను పుష్పమయిగానునున్నదని యర్థము.

వేదజడుండు - అర్థము తెలియక గ్రుడ్డిగా వేదములను వల్లెవేయువానికి మర్యాద తక్కువ, కేవలము మొద్దు అని. కవితాకన్య ఛాందసుని చండాలునిగా పరిగణించినది—'నైవ వ్యాకరణజ్ఞ మేతి పితరం...దూరాత్ సంకుచితైవ గచ్ఛతి యథా చండాలత శ్ఛాందసాత్...' బిల్హణీయమ్.

ప. ౯. నిస్నేడయలేక - ఉర్వశి కెట్లు పురూరవునిపై నభిలాషజనించినదో అట్లే పురూరవుఁడు ఈ వాక్యములచే తన యనురాగమును తెలుపుకొనుచున్నాఁడు. ఆమె చెప్పుబదులుచే ఆమె యభిప్రాయము కు ఎదురు చూచుచున్నాఁడు.

ప. ౧౦. గాముంబాసినరాతిరిసామిన్=(చంద్రగ్రహణకాలమున) గ్రహమును వదలిన రాత్రిస్వామి (ఱేరాజు) చంద్రుని.

ప్రణయిజనము - పురూరవుఁడనియు, చెలులనియు శ్లేష.

విశాఖాసహితుఁడు - ఉర్వశి చిత్రలేఖలతో వచ్చినందున. ఉర్వశికి తగిన నాయకుఁడని సూచన.

చారణులు=స్తోత్రపాఠకులు.

జయోదాహరణము=విజయప్రశస్తి, విజయగీతి. (చూ. రెండవఅంకము పద్య. 81. ఉదాహరణము=వ్యాఁత.)

విక్రమాలంకారము=పరాక్రమమునకు అలంకారము. ఈ విక్రమశబ్దము విక్రమాదిత్యుని నిర్దేశించునని కొందఱు తలంతురు.

అవసరము=సమయము. కాలము.

ఉత్పతనభంగము - పురూరవుని చూచుటకు మిష. చూ. శాకుం. 'కాల్కుశ గ్రుచ్చెనంచు'.

ఏకావళి=నిడుదహారము. ఒక అలంకారమును. 'పూర్వ పూర్వమునకు ఉత్తరోత్తరము విశేషణముగానుంపఁబడినను తొలంపఁబడినను, ఇరుదెఱంగుల నేకావళియగును.' సా. ద. ద్వి. భా. పు. 124 హారమున ఒకదారమే యుండుటవలన తెగునని భయము.

దిట్టముగా తగులుకొన్నది=ప్రేమబంధము దృఢమని యర్థము. దీనిచే ఉర్వశీ మనస్సంగమనెడు ద్వితీయావస్థసూచితమని కాటయవేముఁడు.

ప. ౧౭. ఉప్పుకడలిలోన - సప్తసముద్రములలో నథమము. మారుతాస్త్రము=వాయవ్యాస్త్రము. దీనితోనే పురూరవుఁడు కేశిదానవునిం గొట్టెనని మత్స్యపురాణకథ.

ప. ౧౮. తండ్రిమధ్యమపదము. తండ్రి నారాయణుఁడు. ఆకాశము విష్ణుపదము (వియత్ విష్ణుపదమ్ అమ.) 'పితుః నారాయణస్య మధ్యమం పదమ్ ఆకాశమ్' కాటయవేమ. నారాయణఋషి నారాయణుని యవతారమని భాగవతము.

ఇచ్చట ఉర్వశ్యాదులు నిష్క్రమించినను వస్తువిచ్ఛేదమగుచున్నను రాజునందు మనస్సంగమమేర్పడి తర్వాతి అంకమందలి కథతో కలియుటచేత బిందువని కాటయవేముఁడు.

మింటికెగయుచు నీ సుందరి నామనమును హరించినది. (ఇది) రాజహంసి కమలనాళమును ఖండించి సూత్రముతోడి నాళపుతునుకను కొనిపోవునట్లున్నది. ఇందు విశేషమేమనఁగా సూత్రము నాళంపు తునుకలకు రెంటికిని అంటియుండును. అట్లే ఈతని మనము సూత్రముంబోలె సుందరి నంటియున్నదని భావము.

ప్రవేశకము - నాటకలక్షణము ననుసరించి కథావస్తువు (నాటకకథ) సూచ్యము, దృశ్యము, శ్రవ్యముసగును. ప్రత్యక్షదృశ్యశ్రవ్యములుగాని విషయములు సూచ్యములు. వీనిని అర్థోపక్షేపకములచేత సూచింపవలెను. అవి యైదు—విష్కంభ, చూళిక, అంకాస్య, అంకావతార, ప్రవేశకములు. అధమపాత్రలచే సూచింపఁబడునట్టిది ప్రవేశకము. ఇది రెండంకముల మధ్య వచ్చును.

ఆర్యుఁడు - విదూషకుఁడని యర్థము.

ప. ౧౯. హేళి = సూర్యుఁడు. లోకతమః ప్రవృత్తి = (సూర్యునిపరముగా) లోకమునందలి చీకటియొక్క ప్రవేశము (రాజుపరము) లోకమునందలి పాపపునడత; పరిలూనము=చక్కఁగా కోయఁబడినది.

నీవును సూర్యునికిని కార్యభరాధికారములు సరిగా నెలకొనియున్నవి; మీవలన లోకముయొక్క తమఃప్రవృత్తి (పాపప్రవృత్తి యని రాజుపరము. చీకటియొక్క ప్రవేశమని సూర్యునిపరము) చక్కఁగా నుద్ధృతమగుచున్నది; ఆకాశమధ్యమున గ్రహరాజు ఒక నిముసకాలము ఆగును. నీవును దినములోని యీయవభాగమున విశ్రాంతికలవు.

షష్ఠకాలము=ఆఱవభాగము. ద్వితీయాంక ప్రారంభమున రాజు కార్యాసనము నుండి లేచినాఁడు. అతని కింకను భోజనవేళ కాలేదు. ద్వితీయాంకాంతమున మధ్యాహ్నమైనది. (12 A. M.) ఈ యాఱవభాగము మధ్యాహ్నము 1-30 (P. M.) మొదలు 3 (P. M.) వఱకనియు, దినము ఎనిమిదిభాగములుగా విభక్తమనియుం కొందఱు వ్యాఖ్యాత లభిప్రాయపడిరి. దినము ఎనిమిదిభాగము లగునేని రాజు 12 గం. లకు కార్యాసనమును వదలును. భోజనవేళ అంత ప్రొద్దగుట పొసగదు. పైగా నయ్యది దినములో నైదవభాగ మగును. కావున దినము పండ్రెండుభాగములుగా నుండును. ఒక్కొకభాగము ఒకగంట. రాజు కార్యాసనమును 11 గం. లకు వదలియుండును. ప్రొద్దున 6 గం. లకు దినము ప్రారంభమైన 11 కు ఐదుభాగములు పోగా 11 మొదలు 12 వఱకు విశ్రాంతికాలము. తర్వాత భోజనము. ద్వితీయాంకాంతమున 12 గం. ల కాలమైనచో సరిగానుండును. (శాస్త్రిగారి యభిప్రాయము.

---

## ద్వితీయాంకము.

ఉత్కంఠితుఁడు=ఇష్టవస్తుప్రాప్తియందలి వేగిరపాటుగలవాడు. 'వంటయింటికి వెళ్ళాము' అనుటచే ఇంకను భోజనకాలము కాలేదని తెలియుచున్నది.

అవధానంతో=శ్రద్ధతో.

ప. ౨౧. ఈ దివ్యసుందరియొక్క శరీరము ఆభరణములకెల్ల నాభరణము (అనఁగా వానిని ఈయమ తాల్చుటచే వానికే మెఱుగుగాని, వానివలన ఆమె మెఱుగుగాదని భావము); వస్త్రాద్యలంకరణములకెల్ల తాను అలంకరణము; ఉపమానములకెల్ల ప్రత్యుపమానము (అనఁగా ఇతరవస్తువులతో నీమెను పోల్చి చెప్పుటకన్న ఇతరవస్తువులను ఈమెతో పోల్చి చెప్పుటయే గుణమని భా.) ఉపమానము అధికగుణము, ఉపమేయము న్యూనగుణము. ఉర్వశీసౌందర్యమును మఱొకవస్తువునకు పోల్చుటకన్న ఏదైనను ఉత్తమవస్తువును ఈమెతో పోల్చిన గుణము తెలియునని భావము. భూషణములను ఈమె

తొడుగుకొనుటచే వానికి విలువవచ్చినది. వస్త్రాదిప్రసాధనవిధికి ఈయమయే అలంకరణ మైనది. అన్నిటికిని ఈమెయే కొలఁతగఱ్ఱవంటిది. ఈమెనుబట్టి ఇతరుల నూహించుకొన వలయును.

చాతకవ్రతము - వర్షోదకమునకు అళించి చాతకము భూమిలోని నీటిని ఎంత దప్పియైనను త్రాగదు. అట్లే రాజు ఉర్వశీలాలసుఁడై మానుషీసంగమును వదలెనని యభి ప్రాయము.

దివ్యరసము=దివ్యసుందరితోడి శృంగారము; వాననీరు.

వివిక్తము=ఏకాంతము.

ప. ౨౨. నిషేకమంజులుఁ జేయుచు=ప్రసవాధానవతింగా జేయుచు, అతి మధు సంపన్నంగాఁ జేయుచు, స్నేహదక్షిణతలు-మాధవియందు స్నేహము, కుందలతయందు దక్షిణత.

నీయభినివేశంకూడా=రాజు ప్రవర్తనకూడ. వాస్తవముగా రాజు ఉర్వశియందు స్నేహమును ఔశీనరియందు దాక్షిణ్యమును చూపుచున్నాఁడు.

ప. ౨౪. తరమిడి పాండుపత్త్రముల... గాలిచే ఆకులన్నియుం రాలిపోఁగా మిగి లినవన్నియుం చిగుళులే, అనఁగా మన్మథబాణములే. చెట్లయందు వేఱేమియుఁ లేవు. అంకు రముల చూపఁజాగినవి—ఏయుంటకు సిద్ధముగా నమరియున్నవని భావము.

ప. ౨౫. సఖుఁడా, వసంతలక్ష్మి ముగ్ధప్రాయమునకును ప్రౌఢప్రాయమునకును నడిమిదశను చెందియున్నది. ఎట్లన గోరింటపూవులు స్త్రీలగోళ్లవలె ఎఱుపుగాను పార్శ్వ ములయందు నలుపుగాను నున్నవి. అశోకము ఎఱుపురంగుచే నొప్పుచు వికసించుటకు (పుష్పించుటకు) సిద్ధముగానున్నది. తీయమామిడిపూవులగుత్తి అప్పుడే తొడగుచు అగ్రములయందు కొద్దిగానంటిన పుప్పొడియొక్క పసుపురంగుచే నొప్పుచున్నది.

ఇందు పైరెండువిశేషణములచేత ముగ్ధదశ సూచితమనియుం మూఁడవవిశేషణ ముచే యౌవనము వర్ణింపఁబడినదనియు రంగనాథవ్యాఖ్య.

ప్రదోషము=రజనీముఖము.

ప. ౨౬. ఆదేవరమణిరూపును గన్న కారణమున నాచూపు దుడుకుతనమువహించి, పుష్పించినవేయైనను ఉపవనలతలయందును వంగిన (నమ్ర) తగువులందును రతిని పొందుటలేదు. ఇచ్చట పుష్పములు ఆభరణములవంటివి; విటపములు చిన్న శాఖలుగలవి

గాన చేతులవంటివి; లతలు ఉర్వశి శరీరమువంటివి. వీనికెల్ల ఉర్వశీసాదృశ్యమున్నను ఆ దేవతాస్త్రీ సౌభాగ్యము లేదని భావము. 'రతి' శబ్దస్వారస్యమును గ్రహించునది.

౨౭. నిమిత్తములు=శకునములు, కన్నదరుట మొదలైనవి.

అపరాజితయనే శిఖాబంధనవిద్య. చూ. ఉపోద్ఘాతము

యమునతో... ప్రతిష్ఠానగరము—ప్రతిష్ఠానగరము శాతవాహనులకు రాజధాని; గోదావరీతీరమందలిదని చరిత్రప్రసిద్ధము. ఈనగరము ఆపేరిదే మఱియొకటి గావలయును.

నందనవనఖండము=రమణీయమైన నందనోద్యానభాగము.

సాతిశయప్రియదర్శనుఁడు = స+అతిశయ+ప్రియదర్శనుఁడు. అతిశయముతో గూడిన ప్రియమైనదర్శనము గలవాఁడు. మునుపటికన్నను సుందరముగా నగపడుచున్నాఁడని యర్థము.

లఘుసత్త్వము=సత్త్వగుణము కొఱవడినది. దాక్షిణ్యములేనిది.

ప. ౨౮. కామునంపలకు=మదనబాణసమూహములకు. సశల్యము=బాణముగలది.

ప. ౨౯. మద్ధృదయాభిషంగముఁ = మత్+హృదయ+అభిషంగముఁ=నా హృదయమందలి వేదనను. అవధీరణ=తిరస్కారము. అలబ్ధఫలోదయనీరసంబులఁ, గలయికకోర్కులం=ప్రతిఫలప్రాప్తిలేమిచే నీరసములయినవానిని, (ఉర్వశిని) కలయునట్టి కోరికలను.

భూర్జపత్త్రము=బుజపత్తిరియాకు. పూర్వము దానిమీఁద వ్రాయుచుండిరి.

యథోక్తము=చెప్పినట్లు.

నాగరకుఁడవయ్యు=నాగరకుఁడనగా సరసుఁడైన నగరవాసి. ఇచ్చట వ్రాఁతవినఁ గోరినందులకు రసికుఁడని భావము.

ప. 30. అమృదితకల్పతల్పము=(కొపము పోఁగొట్టుటకు) మృదువుగా చేయఁబడిన కల్పవృక్షంపు (పారిజాతపుష్పంబుల) శయనముగలది. ఈమెయి=ఈశరీరమును.

ప. 31. ఉదాహరణము=వ్రాఁత; ప్రశస్తి; శ్లోకము. చూ. జయోదాహరణము. ఉత్పుష్పంపు = కన్నులు పూర్తిగా తెఱచిన. అనుషక్తము = చేరినది. అబ్రముగ = అబ్బురముగ.

స్వహస్తమును=స్వహస్తలిఖితమును; సౌంతదస్తూరిని.

తిరస్కరిణి=అదృశ్యముగా నుండుట.

ప. ౩౨. కూడలి=సంగమప్రదేశము. కళిందభవ=యమున.

ప. ౩౩. ప్రియదర్శన శాలి=ఉర్వశి యవస్థ.

'త ప్తమగు...త ప్తమునకు'-కాలిన యినుముతో కాలిన యినుమునదుకుటసులువు.

ఈజనుని స్మరింపవలెను-అపనియే చేసినది. ఆటలోకూడ ఈధ్యానముచేత పురుషోత్తముడనుటకు పురూరవుడని చెప్పి శాపము గ్రహించినది.

ప. ౩౮. ఊనరసములు=రసములేనివి. ప్రణిపాతము=మ్రొక్కు.

పగలు సగముగడచినది-ఇప్పుడు 12 గంటలైనవి.

---

## మిశ్రవిష్కంభకము.

విష్కంభలక్షణము - 'జరిగినవియు జరుగనున్నవియు అగు కథాంశములను సంగ్రహముగా తెలుపునది విష్కంభము. అంకమునకు ఆదియందు వచ్చును. మధ్యముఁడగు నొకనిచేతఁగాని మధ్యములగు నిరువురచేతఁగాని ప్రయోగింపఁబడునది శుద్ధమగును. అదే నీచమధ్యమప్రయుక్తమేని సంకీర్ణ మనఁబడును.' (సాహిత్యదర్పణము) అది మధ్యమపాత్రయగు గాలవునిచేతను నీచపాత్రయగు పైలవునిచేతను ప్రవర్తింపఁబడుటచే మిశ్రవిష్కంభకము.

భరతశిష్యులు=భరతమహర్షి యొక్క శిష్యులు.

ఆసనము=కృష్ణాజినమో లేక వ్యాఘ్రాజినమో. దానిని మోయుచు వెంటనేగినందుననే పైలవుఁడు ఆటచూడఁగలిగినాఁడు.

ప్రయోగమును=నాటకప్రదర్శనమును.

దివ్యస్థానం=దేవతలపదవి. మానవత్వము కలుగునని భావము.

పురుషాంతరవేది=ఇతరులహృదయముల నెఱింగినవాఁడు.

---

## తృతీయాంకము.

కంచుకి-రాజుల యంతఃపురములలో చరించువాఁడును, వృద్ధుఁడును, బ్రాహ్మణుఁడును, గుణవంతుఁడును, ఎల్లపనులయందును కుశలుఁడును నగువాఁడు కంచుకి.

ప. ౪౧. గృహస్థులెల్లరును లేతవయసున సౌఖ్యము లనుభవింతురు; తర్వాత ఎల్ల భారమును తమబిడ్డలపై నిడి విశ్రాంతినందుదురు. మాకన్ననో నిరంతరము శరీరమును కార్చుచు, ఈ ముసలితనమున, ఈసేవ చెఱగానున్నది. స్త్రీలపై నధికారము కష్టము గదా. [కంచుకి ముసలివాఁడుగానే యుండవలయుననునియమముచే నీతనికి ముది మిలో నీయుద్యోగ శ్రమ. ఈనౌకరికి పెన్షనులేదు. చావే పెన్షను. కావుననే ఇది చెఱ]

నియమస్థురాలు=వ్రతముపూనినది.

ప. ౪౨. మల్చినయట్లు=చెక్కినవానివలె, మనికిగడలన్ = ఉనికిపట్టులందు, నిద్రాలసంబుల్=నిద్రచే బడలినవి, శిఖుల్=నెమళులు, వలభుల్=పంచలు, జాలధూప ములచే=కిటికీలనుండి వచ్చు పొగచేత, పారావతాధ్యక్రియన్=పావురము లను దృఢ శంకను కలుగఁజేయువానివలె, ఆచరణనిష్ఠల్=(వంతుప్రకారము) తమతమపనులలో చేర్పాటుచేయఁబడిన; బలిపుష్పాంచితమైన తావులను=పూజానిమిత్తము బలిపుష్పములు పొందలైనవి చల్లఁబడియున్న ప్రదేశములలో (వాకిళులయందు) బ్రశాల్వలం...... దీపంబుల బంతురు = సాయంకాల మంగళదీపములను, ప్రకాశమానములైనవానిని ఉంతురు. [దీపములు వెలిగించువేళ]

ప. ౪౩. చట్టుపలు=ఱెక్కలు.

యథానిర్దిష్టుఁడు=ముందుగా చెప్పఁబడినట్టివాఁడు అదేవిధమున.

ప. ౪౪. అకలితవినోదమై......చు = వినోదమేమియు లేమిచేత (ప్రొద్దు పోనందున) చాలసేపు జరుగుచున్నట్లుండిన జాములుగలదై, [చిత్తము అన్యాసక్త మైనందున వినోదములేమియు పురూరవుని చిత్తముకెక్కుటలేదని తలంపవలయును.]

అభిసారికావేష=ప్రియునిపొందుఁగోరి తానే పోవునది ఎట్లలంకరించుకొనునో అట్టి అలంకారముగలది.

ప్రభావంచేత - తనకు ప్రభావములేమి-తప్పుచేత.

ఉపభోగక్షమము=అనుభవించుటకు తగినది.

ప. ౫౦. క్రొత్తపూవులసెజ్జ, చంద్రుని నిండువెన్నెల, శరీరమంతటను పూసి కొన్న చందనము, చల్లదనమొసగునవైన యచ్చుపుముత్తెపుఁజేరులు ఇవన్నియు నా మనమున జనియించినబాధను తీర్పజాలవు; ఆదేవస్త్రీ యొక్క తెయే శక్తురాలు; దాని చరిత్రము ఏకాంతమున చెప్పవలసినదగినది.

ఔపహారికహస్తపరిజన=నైవేద్యపువస్తువులను చేతనుంచుకొనిన పరిజనులుఁగలది.

మంగళమాత్రభూషయై=మంగళాకారమునకు వలసిన భూషణములనుమాత్రము తాల్చినదై. [స్త్రీలకు మంగళార్థము కొన్ని అలంకారము లుండవలయును. మిగిలినవి విలాసముకొఱకు. స్త్రీలుఁ ఆభరణములుతాల్చిన తద్భర్తలకు క్షేమమని హిందూమతము.] పూతము=పవిత్రము.

ప. ౧౮. వ్యాపృతి=వ్యాపించుట.

ప. ౧౯. ఈ కంజేక్షణపాదపీఠమున = ఈ తామరసనేత్ర అడుగుపలకమీద, నానావనీరాజ......రాజ్యంబు= నానా+అవనీ+రాజ+ఆకల్ప+ఉజ్జ్వల+రత్నభాసి పదపీఠ+ఆప్త+అధిరాజ్యంబు = నానాదేశముల రాజుల అలంకరణములై, ప్రకాశము లైన రత్నములచే ప్రకాశించు అడుగుపలకచే పొందఁబడిన ప్రభుత్వము, ఏకాతపవారణము=ఒక్కటేగొడుగుగలది (రాజ్యము). నాకు, ఎట్లు పూర్తిం జెంగు ధన్యత్వమును, ఈ కంజేక్షణపాదపీఠముననే నేకాంతసేవారతి శ్రీకిం బాత్రమనాట ఇడునో, అటుల్ నానావనీరాజ......భాసిపదపీఠాప్తాధిరాజ్యంబు ఏకాతపవారణంబు, ఇడదు.

ప. ౨౦. తుదకు కష్టములచే కలిగినసుఖమే రసవత్తరముగా నానందమొసంగును. ఎండకు సొలిపోయినసమయమున చెట్టునీడ మనుజునకు ఎక్కువగా హాయినొసంగునుగదా.

---

## ప్రవేశకము.

గ. 1. అనుఁగుసఖి = ప్రియసఖి, ఉర్వశి. సఖీయుక్త = సహజన్యతోఁగూడిన, హంసి-చిత్రలేఖయని భావము. ఇనకర...యందుఁ=సూర్యరశ్మికి వికసించిన తామరల కొలనియందు, చిత్రలేఖ ఉర్వశిని ఎడబాసి, ఉర్వశీవియోగముచేతను, మీఁదుమిక్కిలి ఉర్వశింగూర్చిన ఏదోకీడును ఎఱిఁగినదానివలె చింతాక్రాంతయై యున్నదని భావము. 'ఈవికసించిన తామరంబోలి నాసఖీవదనమును భర్తృసందర్శనాదికములచే వికాసవంతమైయుండుటను మరల ఎప్పుడుచూతును' అని ధ్వనియని కాటయవేమవ్యాఖ్య.

ప్రావేశికి అక్షిప్తిక=అక్షిప్తికయను పేరుగల ప్రవేశసూచకమైన పాట. అక్షిప్తికాలక్షణము—

"చఞ్చత్పుటాది తాలేన మూర్ధత్రయ విభూషితా,
అక్షిప్తికా స్వరపదగ్రథితా కథితాబుధైః." భరతశాస్త్ర

ఈపద్యము చిత్రలేఖ ప్రవేశించుచున్నదని సూచించుటకై తెరలోనుండి ఎవరో పాడునట్టిది. ద్విపదికతో=ద్విపదికయను నొక గీతివిశేషముచే. అనగా చిత్రలేఖ ప్రవేశించి చింతతో నాలుగువైపులు చూచుచుండఁగా నేపథ్యమున ఈక్రింది గేయము (ద్విపదిక) పఠింపఁబడునని యర్థము. 'సఖి కనఁబడని' ఇత్యాది గేయము చిత్రలేఖ వాక్యముగాదు. అన్యాపదేశము. హంసీయుగము=చిత్రలేఖాసహజన్యలు.

పై రెండుపాటలును, అట్లే ఈ అంకమందంతయు నేపథ్యగీతికలు Background music వంటివి, కాని దానికన్నను అర్థవంతములు) గలవు.

అచ్చరలవంతు పరుసను-అచ్చరలు వారకాంతలుగదా. సంయమమున=యోగమున. అత్యాహితము=చాల చెఱుపు.

స్త్రీలు చొరరానిదైన కుమారవనం—చూ. చతుర్థాంకము. 'కుమారస్వామి శాశ్వతకుమారవ్రత మవలంబించి అకలుషమనే గంధమాదనకచ్ఛాన్ని ఆశ్రయించినాడు....'

జంభలిక-ఖండధార=గీతివిశేషములు.

గే. 4. చింతచే తపించుచున్న మనస్సుగలదై, మరల (చెలిని) చూచుకోర్కి మిక్కుటముగానుండఁగా, వికసించిన తామరకొలనియందు హంసి విహరించుచున్నది. అన్యాపదేశముగా చిత్రలేఖవర్ణనము.)

---

## చతుర్థాంకము.

గే. 5. తరుపతిత... = చెట్లనుండిరాలిన చిగుళ్లచేతను పూవులచేతను అలంకరింపఁబడినట్లున్నతన గొప్పదేహముతో ప్రియతోడి ఎడఁబాపువలని ఉన్మాదవికారము ప్రకటమగుచుండ ఏనుఁగుల రాజు అరణ్యమును ప్రవేశించినాఁడు.

గే. 6. స్వాంతము=హృదయమును, సకి=సఖిమీఁది, వగ=దుఃఖము, ఏర్చక్=తాపముగొల్పును. సరసిక్=సరస్సునందు, తాఁ=తాను (హంస).

ప. ౩-౪. సన్నద్ధము=వానకురియుటకు సిద్ధముగానున్నట్టిది, నూత్నవారిదము = క్రొత్తమేఘము, ఇంద్రాయుధము=ఇంద్రధనుస్సు, శ్రవణాంతాకృష్టము=చెవివఱకు లాగ

బడినది, ఆసారము=జడివాన, ముల్కి తతి=బాణములసమూహము, హేమ+కాష+అథ=ఒఱపురాతిపై గీచిన బంగరుగీతవంటి గొప్పకాంతి, శంప=మెఱపు.

మేఘమును మెఱపును వానచినుకులను రాజు మొదట రాక్షసుడనియు, ఉర్వశిని కొనిపోవుచు నాతఁడు తనమీఁదికి బాణములు కురిపించినాఁడనియుం భ్రమపడెను. మేఘము నలుపు; ఉర్వశి బంగారువన్నెగలది. వానపడునప్పుడు మొదటి నాలుగుచినుకులకు బలము హెచ్చు; కావున బాణములతో సామ్యము. హేమకాషాథ అనుట నల్లని మేఘము ఒఱపుతాయివలె నుండుటచేతను, తటిల్లత దానిపైగీచిన బంగారుగీతవలె నుండుటచేతను.

దైవము విపరీతమైనవారికి... = దైవము విపరీతమగుటచే ఉర్వశితోడి వియోగము సంభవించినది. అదియే చాలకష్టమైయుండఁగా మేఘోదయమైనది. ఇది ఇంకను హెచ్చుగా దుస్సహము. వేసవిపోయి చల్లనిదినములు వచ్చినంతనే ఆ చల్లఁదనమును కూడ అనుభవించుటకు ప్రియములేకపోయెనే అనుచింత హెచ్చుగాబాధించును. వర్షాకాలమున విరహులకు తద్దుఃఖము ఇనుమడించుననుట. చర్చరి=ఒకవిధమైన పాట.

గే. 8. జలద. కినియకు=కోపింపకు, ముదల=ఆజ్ఞ, అవిరళ...దా=ఎడతెంపులేక వర్షించుటచే తెల్లగాచేయఁబడి ప్రకాశముగానున్న దిక్కులమొగములుగలవాఁడా.

రాజుకాలమునకు కారణము=రాజు తన సత్త్వాతిశయముచే యథాక్రమప్రాప్తములగు కాలధర్మమునుమార్చను సామర్థ్యము గలిగియుండును. ఉదా - పరీక్షిత్తు కలిలోకృతయుగధర్మమును నెలయించినట్లు.

గే. 9. గంధనుత్తమథు...పుష్పాదివాసనచే మదించిన తుమ్మెదలసంగీతముతో వాయించుచున్న కోయిలకూఁతలే వాద్యముగాను, గాలికికదలినచిగుళ్లచే నిండినదై కల్పవృక్షము చక్కఁగా నర్తించుచున్నది.

ప. ౬౫. మించు = మెఱపు, మించుఁబొన్నించు = మించనెడు బొన్నమించు, మేలుకట్టు = వితానము, రాజుల సింహాసనములమీఁదుగా నాలుగుకోడులకు కట్టిన పట్టువస్త్రము, బంగారు అంచుగలది. మేఘము నల్లనిపట్టు మేలుకట్టు వస్త్రమువలెను, మెఱపు దానియొక్క జలతారు అంచువలె నున్నదని భావము. వేతసములు=ప్రబ్బలిచెట్లు; పూరెమ్మచామరల్ = పూరెమ్మలనెడి చామరములను, ఘర్మమఱ=(ఘర్మము+అఱ) వేసవితెఁగగా (ఎండలుపోఁగా) ఎలుంగొందు = గట్టిగా (సంతోషముచే) నఱచుచున్న, శిఖులు=నెమళ్లు. వందులగు = స్తోత్రపాఠకులవలె వర్తించుచున్నవి; సెల

సరుల=సెలయేఱుల నెడు హారములచే, బేరులగు=వణిజులగు (బేరి=వ్యాపారి), కానుక=కానుక. రాజులకు ఇవన్నియుం సర్వసాధారణముగా జరుగు నుపచారములు - సింహాసనమునకు పై మేలుకట్లుండుట, కొందఱు చామరములు వీచుచుండుట, వందులుపొగడుచుండుట, వ్యాపారులు కానుకలొసంగుట. చూ. తిక్కనపడసిన రాజచిహ్నములు.

అందలంబు గొడుగు నడపంబు మేల్కట్టు, చామరములు జమిలిశంఖములును
కంబగట్లు భూమి కానికగాక పెం,పెసగు రాచపదములెల్లఁ బడసె. కేతన - దశకు.

పరిచ్ఛదము=పైకప్పుడువస్త్రము, పరిజనము.

భిన్నకము=రాగవిశేషము.

సందీపనము=(దుఃఖమును) ఎక్కుడుచేయునది.

క. ౬౬. గర్భజలములు=లోపలనీటినిగలవి, అరక్తరేఖములు=ఎఱ్ఱని గీరలుగలవి. నవభూమికదళి=క్రొత్తదైన భూకదళి (నేలయరఁటియను చిన్నమొక్క). అంతరశ్రుపుః=లోన బాష్పములుఁగలవి. ఉత్కలిక = ఉత్కంఠతో, ఆశతో, (మూలములో నీ యుత్కలిక లేకపోయినను కాళిదాసశ్లోకమునకు వ్యాఖ్యాప్రాయముగా నున్నది.) నేలయరఁటి రెండుమూడంగుళములయిత్తే యుండును. వాన కురిసినవెంటనే మొలచును. దానిపూవులకు ఎఱ్ఱగీత లుండును. వాన కురియుటచేత వానియందు జలబిందువులుండినవి. అవి ఎట్లుండినవనఁగా వివాహమైనక్రొత్తలో (నవభూమికదళియనుటచే నీ స్వారస్యము. వయసు చెల్లిననిత ఇట్లుండదు) తన భర్తలమీఁది కోపముచే కన్నులెఱ్ఱబారుటచే రక్తరేఖలు స్పష్టముగా తెలియుచుండ కంట తడిపెట్టు వనితలనేత్రములవలె నీ భూకదళీపుష్పములు కనఁబడి తనవనితకై యాసగొల్పి అది లేదేయనుచింతచే పురూరవుని చింతాకులునిఁజేసినవి. కావున నే అతనికి సందీపనమువలె అయినది.

ప. ౬౭. యావకపు=లత్తుకపుపూత. పురూరవుఁడు ఉర్వశియొక్క దారి కనిపట్టుటకై గుఱ్ఱులకు వెదకుచున్నాఁడు. ఆ చక్కనిమేనుగలది (సుగాత్రి) భూమిమీఁద పాదముల మోపి (నడచి) పోయియుండినయెడల (అప్సరస గావున ఆకాశగమనమున పోయియుండిన అడుగుజాడ దొరకదుగదా) వానచే తడిసిన యిసుకగల యీయడవిప్రదేశమున, పిఱుందులబరువుచే మడమల్లుక్రుంగఁగా కాలికిపూసియుండిన పారాణి యంటుకొనుటచే మనోహరముగా కనఁబడు పాదముల జాడలవరుస కనఁబడియుండును.

శోపన=శోపగించునది. అనురాగాతిశయముచే నీశోపము.

ప. ౨౦. స్తనాంశుకము = అవిక, చ్యుతము = పడిపోయినది, శుకోదరశ్యామలంబు = చిలుకకడుపువలె ఎఱుపుఁ దిరిగిన పచ్చరంగుగలది. ఎఱుపును పచ్చరంగును కలిసిన కొంతనైల్య మేర్పడును. మోవిరాగంపుగుర్తులు = పెదవికిపూసికొనియుండిన ఎఱుపు రంగుయొక్క గుర్తులు, మగ్న = మునిఁగిన, (లోతైన) నాభి=బొడ్డు, పురూరవుఁడు క్రొత్త పచ్చికప్రదేశమును చూచి మొదట దాని తన ప్రేయసియొక్క అవికగా భావించినాఁడు. ఎఱుపుపచ్చరంగుమీఁద ఎఱ్ఱని ఆరుద్రపురుగులు పడియుండినవి. వానిని ఉర్వశియొక్క కన్నీరుగాను, ఆబిందువులు మొదట ఆమె పెదవులమీఁదపడి ఎఱుపై తర్వాత నాభిలోమునిఁగి చొక్కాయకంటుకొనివదనియుం భ్రమపడినాఁడు.

ప. ౨౧. మృదువాతవిభిన్నబర్హామై = లేతతెమ్మెరచే నించుక కదలిన కుంచెగలదై, నిస్సపత్నత=సవతిలేకుండుటను, అహిభోజి=పాములను భుజించునది, నెమలి, కేశపాశి=జుట్టు, పురుషాయితకేళి=ఉపరతి, విశీర్ణబంధమై=ముడివీడిపోఁగా, ప్రాపిత పుష్పదామముల భాసిల=అలంకరణార్థము పొందింపఁబడిన పుష్పముల సరములచే శోభిల్లుచుండఁగా, స్త్రీల కేశకలాపమునకును నెమలి కుంచెకును కవీశ్వరులు పోలికను విశేషముగా వర్ణింతురు. ఇచ్చట ఉర్వశికేశకలాపము పువ్వులతో నలంకరింపఁబడి తుంటవిల్తుని కేళియందు చెదరియుండినప్పుడు చూచిన నీ నెమలిసైతము తన కలాపము విషయమున సిగ్గుపడునని యభిప్రాయము.

ప. ౨౨. కామిజనులు=కామపీడితులు. మానహరణ+అప్రతిహత+అస్త్రము = మానమునుహరించు+ఎదురుదెబ్బలేని+ఆయుధము.

ప. ౨3. ప్రియతములకుం......భామినులకు=ప్రియతములయందు ఎట్టిదోషమును లేకపోయినను వారిపై తమకుండు స్వాతంత్ర్యముచే ప్రియురాండ్రకు అకారణముగానే కోపము వచ్చుచుండును.

ప్రభుత=దీనిచే ప్రియతములు తమప్రియుల కెంతవిధేయులనుట స్పష్టము.

ప. ౨౪. అభినవపాకము = అప్పుడేపండినది, రాజజంభూఫలము=పెద్దనేరేడు పండు.

15. దూనుఁడై=సంతప్తుఁడై.

ప. ౨౫. వెలలేడి. రూ. వెడలేడి.

ప. ౨౬. బత్తెంపుబిసము=మార్గమున కాహారార్థముగొనిన తామరతూఁడు, కృతి=నేర్పరి, నేర్పరియైనవాఁడు తనపనికన్నను ముందుగా చెలికాండ్రపనిని చేయును.

ప. ౭౭. మదవిలాసపదము=మదముయొక్క విలాసముచే నొప్పు నడుగులుగల.

ప. ౭౮. ఏకాంశము...నియ్యవలయుఁ = దొంగసొత్తులో నొకభాగము ఎవనికడ కనఁబడునో కడమయెల్లను వానికడనుండియే గ్రహింపవలయును. యాజ్ఞవల్క్యధర్మశాస్త్రమున నిటుకలదు. "నిహ్నుతేభిహితంనైకమ్ ఏకదేశ విభావితః, దాప్యః సర్వం నృపేణార్థం నగ్రాహ్యస్త్వనివేదితః" రాజభావ మేమనఁగా—ఊర్వశి కనఁబడలేదు దానినెవరో దొంగలించి యుండవలయును. ప్రస్తుతము దొంగసొత్తులో నొకభాగము, దానినడక, హంసకడ కనఁబడినది. హంసయే దొంగ. న్యాయముప్రకారము మిగిలిన దొంగసొత్తంతయు హంసకడనుండియే ఇప్పింపవలయును. అభియుక్తము= పిర్యాదు మొత్తము.

గే. 18. మర్మరరణితకచారువున='మరమర' యను శబ్దముచేత ఒప్పిదమైన, కుసుమిత=పుష్పించిన, పల్లవిత=చిగిర్చిన.

ప. ౭౯. రథాంగము=చక్రవాకము. (రథముయొక్క అంగమైన చక్రము పేరుగాఁగలది) ఈరథి=రథముగలవాఁడు, దానినెక్కువాఁడు అనఁగా తాను పురూరవుఁడు. రథాంగవిజయిశ్రోణి=చక్రవాకములను జయించు పిఱుందులుగల (మూ. రథాంగశ్రోణి బిమ్బరోమా, అనువాదమున వ్యర్థమని బింబము త్యక్తమైనది. రథాంగశ్రోణికి వ్యాఖ్యాప్రాయమైన 'విజయి' నెక్కొనినది.) అనుయోగము=ప్రశ్న, మనోరథశతంబుచే=నూర్లకొలఁది కోర్కెలచే, వృతుఁడగుచుఁ=చుట్టుకొనఁబడినవాఁడై.

ఈరథికుఁడు (తాను)రథాంగములను జయించు పిఱుందులగలదానిని (ఊర్వశి పిఱుదులు చక్కఁగానుండి చక్రవాకముల ననుకరించుచుండినవని యర్థము) ఎడబాసెను; ఓయీ రథాంగ లెక్కలేనియాసలతో నిన్నిదె యడుగుచున్నాఁడు. (ప్రియావృత్తాంతమును.) తానురథి, ఎదుటనున్నవాఁడు రథాంగుఁడు, ఎడబాసిన ప్రియ రథాంగవిజయిశ్రోణి; కావున ఒకరిపై నొకరికి స్నేహముండుటయును, పరస్పరవిషయమును తెలిసియుండుననియు చమత్కారము.

ప. ౮౦. పురూరవుని వంశముంగూర్చి ఉపోద్ఘాతము చూ.

ప. ౮౧. ప్రవృత్తిపరాఙ్ముఖత = సమాచారము చెప్పుటయందు పెడమొగము. కొలనియందు నీవు ఒక తామరాకుచాటైనందున నీప్రియను కానక ప్రియ చాల దూరము పోయినదని బిగ్గఱగా ఏడ్తువే. ఇట్లు నీకే ప్రియవియోగప్రేముడిచే దానినివదలి

నివసించుటకు భయము కలుగుచుండగా, ప్రియనెడబాసి విరహబాధనొందుచున్న నాకు ప్రియావృత్తాంతమును చెప్పుటయందు నీకు పెడమొగ మేలనయ్యా ?

చక్రవాకముల ప్రేమాతిశయ విరహవ్యథలు కవిలోకసామాన్యములు.

ప. ౧౪. ఇభవిభుఁడు=కరిరాజు, అభినవోద్భిన్నదళము=లేతచిగురును.

గీ. 22. లలిత+ప్రహతి+శకలిత+వృక్షతతి = మృదువుగా కొట్టుటచేత నే తునకలైన చెట్లుగలది. దూరవిజితకమలారికాంతిని = అత్యంతము జయింపఁబడిన చంద్రుని కాంతి గలదానిని, వేలుపుటింతిని=దేవస్త్రీని, ఉర్వశిని.

ప. ౧౫. యూథనాథ=పరికాఁడా, ఓయి దీర్ఘాపలోక=ఓయి దూరపుచూడ్కి గలవాఁడా, మదకలుఁడ = ఓ మత్తేభమా, చాంద్రమస = చంద్రునిదైన, కల = కలల, అభ=కాంతిగలదానిని, యూథికాశబలాలక = యూథికయను నొకపువ్వుమతో సమానమైనరంగు (నైల్యము) గల కురులుగలది, స్థిరయౌవన = నిరంతరయౌవన, దేవత గావున, హర్షదాలోకనా=చూపుల కింపగుదానిని.

ప. ౧౬. దానధారధుని=(పురూరవ) ఈవియను ప్రవాహంపునది, (ఏనుఁగు) మద జలంపు ప్రవాహంపునది; యాచకౌఘంబునకా = (రాజునకు) యాచకులసమూహము నందు, గొనఖు + బోకా = మనోజ్ఞమగును, ఎండ తెంపు లేక దానముగార్చుట నీకును ప్రవాహముంబోలె యాచకులకు దానమిచ్చుట నాకును తగినవృత్తియని భావము.

శంపాశూన్యము=మెఱపులేనిది.

గీ. 23 కిరిదొర = అడవిపందులఱేఁడు. ఈపద్యమున వరాహవ్యాపదేశమున రాజు వర్ణితుఁడు. అవిచలుఁడై=ధీరుఁడై, ఖరఖురదళిత=వాడియైన గిట్టలచే కొట్టఁబడిన క్ష్మాతలుఁడై = భూప్రదేశముగలవాఁడై, తనపనిలీనుఁడై = తన కార్యమందు ఆసక్తిగల వాఁడై, ముదధీనుండై=సంతోషమున కధీనుఁడై, వనగహనమునందు=అరణ్యమునందు, చనుకా, వనాంతరమున ధీరతఁదోప తనపనియైన కందమూలాది ఆహారాన్వేషణము నకై ఇటునటుతిరుగుచు, నేలలోత్రవ్వుచు, వరాహము సంచరించుచుండును; అట్లే రాజును తనపనియైన ప్రియాన్వేషణమునకై అడవియందు నిర్భయముగా సంచరించుచు విరహవేదనచే నేలనుతన్నుచు, చేతులు విసరుచు, వేఁగుచున్నాఁడు.

ప. ౧౭. ఓయి పర్వతవిభుండ, పృథునితంబుండ = (పర్వతుఁడుగావున) పెద్ద పిఱుదులుగలవాఁడా, నీవు, వనాంతగమునఁ, పృథునితంబ=పెద్ద పిఱుదులుగల, సునగ తా

నంగ=మన్మథునిచే పొందఁబడినదానిని, (కామినిని), శృంగారమంగళాంగ = శృంగార రసోచిత పవిత్రగాత్రిని, పర్వసన్నతన్=గణుపులు, అనఁగా శరీరమందలి సంధిప్రదేశములు, పైకితెలియని (యంతటిపుష్టికల) దానిని, అణుకుచాంతరన్ = కుచముల నడిమి ప్రదేశము లేక వ్యత్యాసము అణుమాత్రమైనదానిని, కంటె=చూచితివా ? పర్వసన్నతన్-స్త్రీపురుషులకు శరీరమునందు సంధిప్రదేశములగు మోచేతులు, మోకాళ్లు మొదలైనచోటులయందు శల్యములు పైకిగ్రుచ్చుకొని వచ్చినట్టుండక ఆయాప్రదేశములు కండపుష్టి గలిగి ఎముకలయునికి తెలియరాకయుండుట సౌందర్యము మంగళము.

గే. 24. భూధర=పర్వత, స్ఫటికశిలాతలభాస్వరనిర్ఝర = పటికంపురాల ప్రదేశములంబోలె ప్రకాశమానమైన సెలయేళ్లుకలవాఁడా, బహువిధ = నానావిధములైన, సుమనోభరచితశేఖర = పుష్పముల యతిశయముచే కూర్పఁబడిన సిగదండగలవాఁడా, కిన్నర = కిన్నరులచే, మధుర+ఉద్గీత+మనోహర=ఇంపుగాను బిగ్గరగాను పాడుటచే హృదయాహ్లాదకరుఁడా, నాకాంతను కనఁబడెనా.

ప. ౨౨. సర్వభూభృదధిప = ఎల్లపర్వతములకును యజమానుఁడా, సన్నతాభిరామకమున=బొగ్గడదగిన రమణీయతగల, గాననాంతరమున=ఈవనోద్దేశమున, రామ=రమించునట్టిది, సర్వాంగసుందరి=అన్నియంగములయందును రూపవతి.

ప. ౨౩. భూరికుటులు = బోమముడులు, వీచులుగాఁగ = అలలుగాఁగను, విశ్వణత్+అండజకుంక్తికాంచిగాన్=అఱచుచున్న పక్షుపరుస మొలత్రాడుగా, వేచన=వేగమునపోఁగా, జాఱుపైఁటవలె = జాఱుపయ్యెదవలె, ఫేనచయంబు=నురుగుల మొత్తమును, ఇటునట్టు నీడ్చుచున్, పరిణామమునొందెన్ = రూపాంతరప్రాప్తినొందెను. వీని కెల్ల కారణము ఓర్వలేమి.

గే. 25. క్షుభితాకరుణశకుంతికా = కలఁతపెట్టఁబడిన కరుణలేని పక్షులుగలది. ప్రియాగతిస్వరాద్యనుకరణములచేత నన్ను పీడించుటచేత అకరుణములని, రాజభావమని రంగనాథవ్యాఖ్య. పక్షులు హంసపికాదులు, ద్యోసరిత్తట సముత్సుకా = దేవనది గట్టుంబోలె కుతూహలాన్వితము. దేవనదీతీరము ఎట్లు నానాజంతుపక్షి సమాకీర్ణమో అట్లు. కల=మధురమైన, మధుకర=తేనెటీగల, ఝుంకారితా = ఝుంకారముగల. భావమేమనఁగా, ఓనదీ నీవు నావిరహోద్రేకకారకులైన పశుపక్ష్యాదులకు ఆశ్రయమొసంగుచున్నావు. నేను నిరంతరము నీకై అనగొనుచున్నను నాపై దయగొనవు. ఆహా ఏమి నీకాఠిన్యము-అనిధ్వని.

గీ. 26. ప్రథమదిశ=తూర్పుదిక్కు, పవన=గాలి, హత=కొట్టఁబడిన (తూర్పు గాలిచే లేచిన) ప్రబల+ఊర్మిక+ఊర్ధ్వభుజముల=గొప్పయలల నెడు ఉన్నతభుజముల చేత, మేఘాంగకముల=మేఘముల నెడు చిన్న యవయవములచేత. సలలితుఁడు=సౌందర్యయుతుఁడు, ఉదధినాథుఁడు=సముద్రుఁడు, నర్తించుక=ఆడుచు, శకటాంగ=రథాంగ (చక్రవాక) హంస, లనెడు, కుంకుమశంఖములచేత, కృతమండనముల = చేయఁబడిన యలంకారములచేత, హంసరథాంగముల కూఁతలు కాలిగజ్జెలశబ్దములను అనుకరించున వని ధ్వని. కుంకుమపూఁత - హంసల మొగములును పాదములును ఎఱుపు. కావున ఆ పక్షులుకూయుచు వరుసఁగా బారులుదీసి ఎగురుట కాలికి పారాణిపూసికొని గజ్జెలు శబ్దించుచు ఎగురుటగా ధ్వని. కరిమకర = ఏనుఁగులు, మొసళులు. (వీనిచే) అసల=చెదరిన, కృష్ణ=నల్లని, కృత=చేయఁబడిన (కృష్ణకృత = నల్లఁగా చేయఁబడిన, నల్లని) అవతంసముల = సిగబంతులచే, ఇట విలాసార్థముధరించిన పట్టువస్త్రాదికములని భావింపవలెను. తటసలిలోద్వేల్లిత=గట్టుకపాఱు నీటి కొట్టుటలచే లేచిన, దత్త=ఈయఁబడిన, హస్తతళుండు=చేతిలో వేయఁబడిన తాళము (లయ) గలవాఁడు. గట్టును నీరుకొట్టుకొనుట చేతులతో తాళము వేయుటవలె నుండినదని భావము. దశదిశల నలము = పది దిక్కుల నాక్రమించు, నవాబ్ద=క్రొత్తమేఘము నెడు, కాలుఁడు=శివుఁడు లేక యముఁడు లేక శనైశ్చరుఁడు. మొదట నదిగా తలంచినవాఁడు తటాలున ఉదధినాథుఁడనుట రాజు ఉన్మత్తుఁడు గాన.

అనిర్విణ్ణతచే శ్రేయస్సులు కలుగును=దుఃఖపడకుండుటచే మేలుకలుగును.

గీ. 27. ఈపద్యము రాజువాక్యము కాదు. ఐరావతద్విపము = వేల్పుటేనుఁగు వంటిరాజని యర్థము. నూతన+కుసుమ+స్తంబక+మండిత+అనోకహ+పర్యంతమున = క్రొత్తపూగుత్తులచే నలంకరింపఁబడిన వృక్షములుగల ప్రదేశమువఱకు; మద+కల+కూజత్+కోకిల+ఝంకృత్+మధుకర+మనోహరమున = మత్తెక్కుటచే చక్కఁగా (మధురముగా) కూయుచున్న కోయిలల చేతను, (మత్తెక్కుటచేతనే) ఝంకారము చేయుచున్న తుమ్మెదలచేతను హృదయము ఆకర్షించు సౌందర్యముగల, వేల్పుల యుద్యానమున = దేవతలపూఁదోటను, ప్రాణ+అధిక+నిజ+కరిణీవిరహజ్వాలా+కృత+తాపమున = (తన) ప్రాణములకన్నను ఎక్కువయైన (ఎక్కువయని తాను భావించుకొనుచున్న) తనయొక్క ప్రియయైన యేనుఁగుతోడి విరహముచే కలిగిన దీప్తియొక్క సంతాపముచేత, ఐరావతద్విపము, విచరించెడి=తిరుగుచున్నది.

ప. ౧౭. కృష్ణసారప్రభము=నలుపురెుుక్క సారమువంటి కాంతిగలది. (కృష్ణసారము=నల్లయిఱ్ఱి) చాలనలుపని యర్థము. అభినవఘాసపటలి=క్రొత్తలేత (చాలలేఁత) పచ్చికలవెుత్తమందు (నవనవలాడు పచ్చికబయుల) గానసేందిర=అడవిసిరి, తాదమక మున...బసంగ=తాను వేడుకతో (అడవియొక్కశోభను) చూచుటకై చాచినట్టి నిడుపైన కంటివలె, నలుపుగాను నిడుపుగాను కడుపుకడ కొంతలావుగాను ఉండుటచే పచ్చికమీఁద పరుండియున్న లేడి అడవియను మహాలక్ష్మియొక్క కంటివలె నున్నదని భావము.

గీ. 28. స్థిరయౌవనయుం-దేవస్త్రీగాన, (ఇది రెండవమారు ఇట ప్రయుక్తము) చూ. ప. ౨౮. దశావిపర్యాసము పరిభవాస్పదము=దశలలోని మార్పు అవమానమునకు తావు. తాను రాజేయైనను ఇప్పటిదశలోని దైన్యము తనకవమానకరమని రాజుభావము.

ప. ౧౮. మృగేంద్రకృత్త=సింహముచే చీల్పఁబడిన, కరి = ఏనుఁగుయొక్క, క్రవ్యలవంబు = మాంసఖండము, ప్రభాప్రలేపి = కాంతుల వెదజల్లునది. ఇయ్యది ప్రకాశమానమగుటచే మాంసఖండముగాదు. అగ్నికణమునుగాదు, ఏలయన అడవి యంతయు వానచే నిప్పుడే తడిసినదిగదా. రక్తవంజుళము = ఎఱ్ఱని యశోకపుష్పము. అదటదీని సెత్త......కరంబులన్=సూర్యుఁడు దీని నెత్తుటకు తనకిరణములను చాచెనా (యనునట్లు దీని ప్రకాశ మొప్పుచున్నది.)

గీ. 29. ఇది రాజువాక్యముకాదు. ఎవరో పాడునట్టిది. ప్రణయినీబద్ధ=ప్రియయందు నాటుకొన్న, ఆకాంక్షుండు=ప్రత్యాశగలవాఁడు, బాష్పకలుల = కన్నీటిచే కలఁగిన, క్షామితాస్యుఁడు=వాడినమొగముగలవాఁడు.

ప. ౧౨. మగ్నావలగ్న=సన్నని నడుముగలది

ప. ౧౧. ప్రణతు=నమస్కరించినట్టి, తనకు స్వాధీనుఁడైనట్టి, ననుఁద్రోచి = నన్ను సరకుగొనక, త్రోసిపుచ్చి (ఆకారణములచే) అనుతాపభరముగొన్న = పశ్చాత్తాపమను భారమువహించిన, మదీయనుతన్వని=నాసుందరిని, ఈలతతన్వి = ఈలతాసుందరి; (ఈక్రిందివిధమున) పోలున్,—వర్షమున తడిసియున్న చిగురు కన్నీటిచే తడసిన అధరమువలెనున్నది,(రెండును ఎఱుపుగావున),తనదు తలిగామి....- అకాలము కావున లత పుష్పింపక యుండుట, తనసుందరి, విరహముచే అలంకారములను తాల్పనివిధము నను.

(పుష్పములులేనందున) తేనెటీగలు రానందున వానిశబ్దములేనందున లేక, తనసుందరి (విరహ) చింతచే మౌనముదాల్చియున్నట్లును, రాజునకు తోఁచెను.

ప. ౧౦౦. స్పర్శవిభావిత=తాకుడుచే తెలియవచ్చుచున్న.

ప. ౧౦౧. అపగత+అసుండు=ప్రాణముల పోఁగొట్టుకొనినవాఁడు,

గీ. 31. అసితకంఠము = నల్లనిమెడగలది. రాజు తాను ఉర్వశికై అడవిలో భ్రమించుచు (తిరుగుచు) పరిదేవించుచు (దైన్యముతో) నెమలిని, హంసను, చక్రవాకమును, తుమ్మెదను, ఏనుఁగును, పర్వతమును, నదిని, జింకను ప్రియావృత్తాంతము నడుగుచు తిరిగినవిషయమును సంగ్రహముగా ప్రియకు చెప్పుకొనుచున్నాఁడు.

ప. ౧౦౩. నీవదనము=నీమొగము, నుదుటం బెట్టిన యీమణిక = లలాటమున నుంపఁబడిన యీమణిచేత, ఉదయించిన రాగ మొలయ = బయలువెడలినకాంతి శోభిల్లగా, లేరెండకు=లేఁతఎండకు, కెంపొదవిన = ఎఱుపెక్కిన, నెత్తమ్మిలక్ష్మికి=నిండుతామరసిరికి, ఉపమానంబై ఒప్పారెడి. మొగమే అధికగుణము ఉపమానము, నెత్తమ్మి ఉపమేయము, న్యూనగుణము. ప్రకృతులు—అమాత్య సుహృదాదులు.

ప. ౧౦౪. స్ఫురియించుమించు = తటాలున కనఁబడు మెఱుపు, సిడము గమి=టెక్కెముగ, సురచాపము=(రంగులతోడి) ఇంద్రధనువు, నూత్నచిత్రశోభగా=క్రొత్తచిత్తరువువలె అందముగొల్పఁగా, క్రొమ్మబ్బు = క్రొత్తమేఘమును, రచించువిమానముఁజేసి=అందమైన విమానముగానిర్మించి, త్వరగా నన్నిల్లుసేర్పుము యంవతీ (చూస్థిరయావన) ఉర్వశి దివ్యగావున ఇట్టివిద్యలుచేయ సమర్థురాలే.

---

## పంచమాంకము

పరితుష్టుఁడు=సంతోషించినవాఁడు.

ప. ౧౦౭. నిగ్గు=కాంతి, ఇవురులు=చిగుళులు, దిగ్వధూవక్త్రమునకు=దిక్కనుసుందరిమొగమునకు, వతంసప్రసాధనంబు=అభరణముయొక్క అలంకారమును.

చాపహస్త=చేత విల్లుధరించినట్టిది.

ప. ౧౦౮. పరుషజలధరచ్ఛేదంబుదరిని=దట్టమైన మేఘముకడ,

నాగరికుఁడు=తెలివైనవాఁడు.

ప. ౧౦౯. పతగవ్యాహృతమునకై = పక్షి హరించుకొనిపోయినదానికి, ప్రాణితు = ప్రాణముగలవానిని.

ప. ౧౧౧. ఔర్వశేయుండు = ఊర్వశికుమారుఁడు, విలుదాలుపు = ధనుర్ధరుఁడు, ఐలసుతుఁడు = పురూరవుని కుమారుఁడు, ఆశుగము = బాణము, అవిలంబితముగా = త్వరగా.

ప. ౧౧౩. స్వాంతమున = హృదయమున, ప్రసాదము = సంతోషము, గళిత = పోయిన, ధైర్యుఁడ = ధైర్యముగలవాఁడను, అదయముగ = దయయేలేక, గాఢముగా.

ఔరససంబంధము = ధర్మపత్నియందుఁ బుట్టిన కుమారునితోడి పోలిక. చాప గర్భముగా = చాపమునుఁదాల్చియే, అది కడుపును తాకునట్లుగా.

ప. ౧౧౫. కాంతమిందుకరమ్మిందుకాంతము బలె = మనోహరమైన చంద్రకిరణములు చంద్రకాంతము నెట్లు (కరగించునో) అట్లు. అభ్యుద్గమనము = ఎదురేగుట, బహుమతవు = ప్రియవు, అభివాదనము = నమస్కారము, ఉన్నమితముఖుని = ఎత్తఁబడిన మొగముగలవానిని, యథోచితము = తగినట్లు. ప్రథమాశ్రమమున = బ్రహ్మచర్యమున.

ప. ౧౧౭. చూడాకండూయన = చూడమును గోకుటచేత, సుఖసుప్తమరొయ్యెడుఁ = సుఖముగా నిదురపోవును.

మహారాజగృహీతహృదయను = మహారాజుచే గ్రహింపఁబడిన డెందముగలదానిని, జాతమాత్రుని = పుట్టుటమాత్రమే గలవానిని, అప్పుడు పుట్టినవానిని.

ప. ౧౨౦. ప్రథమవృష్టికి = మొదటివర్షమునకు, ఆతపజ్వరము = ఎండయను జ్వరము, ఎడసిన = పోయిన, ఖరమ్మదపువహ్ని = పిడుగునిప్పు. అనర్థానుబంధి = అనర్థమును (చెడుగును) చేర్చునది. కృతవిద్యుణ్ణి = చదువు పూర్తియైనవానిని.

ప. ౧౨౧. వియుక్తిభాజనము = ఎడబాపునకు పాత్రమగునట్టిది, నాథవంత మాజనము = యజమానునిగల జనము, తనకు... జెందదు = తనకెప్పుడును మేలుసేసికొనజాలదు. సంగడీలు = స్నేహితులు.

ప. ౧౨౩. (ఈమున = ఈ నారదర్షి) జడగుమి = జడలసమూహము, గోరజంపు = గోరోచనముయొక్క, నికషంపు = ఒరపురాయిమీఁది గీతవంటి, పిశంగిమతో = పసుపు రంగుతో, (ఒరపురాతిమీఁదగీచినగోరోజనముగీతవంటి పింగళరాగముతో) జన్నిదము = జందెము, కైరవబంధు = చంద్రుని, కళా = రేఖవంటి. అమలచ్ఛవి = స్వచ్ఛకాంతితో, పసిండియూడలను = బంగారపు ఊడలను, జంగమకల్పకము = తిరుగుచుండునట్టి కల్ప

వృక్షము. అవహితుఁడను=హెచ్చరిక వహించుచున్నాను. ప్రభావదర్శి=ప్రభావముచే చూచువాఁడు. త్రైకాల్యదర్శులు=భూతభవిష్యద్వర్తమానములను చూచువారు. ఉద్ధృతము=తీసివేయఁబడినది. నాథవంతుఁడు=యజమానుఁడుగలవాఁడు.

ప. ౧౨౭. అజుఁడు=బ్రహ్మ, సురమౌని=దేవర్షి, శశి=చంద్రుఁడు, సౌమ్యుఁడు=బుధుఁడు, భూజాని=రాజు (పురూరవుఁడు); లోకవారిగుణత = లోకాకర్షకమైన గుణములచే, ఆశాస్యము=కోర్కె. ఇం దొకకోర్కె కరును తత్పూర్వుల ననుకరించిరనుటయు, ఎల్లకోర్కెలకును మీయిల్లే తావలముగావున, కోరఁదగినవి వేరేవియు లేనందున కోరఁదగిన దొకటేగలదు, అది—నీవు నీతండ్రి ననుకరింపవలయు ననుట.

ప. ౧౨౮. అప్రకంప్యతక్ = చలింపమిచేత, (అచలధైర్యముచే). ఇందు గంగకును రాజ్యలక్ష్మికిని ఔపమ్యము చెప్పఁబడియున్నది. తుషారశైలమువంటివాఁడు జనకుఁడు ఉన్నతులం దున్నతుఁడు, వారాన్నిధి (సముద్రము)వలె అప్రకంప్యతచే (సముద్రము తొణకదు; ధైర్యశాలి చలింపఁడు) మేర (హద్దు) తప్పనివాఁడునుపుత్త్రుఁడు (సముద్రము చెలియలికట్టను దాఁటదుగదా) గంగయు 'ఆకాశంబుననుండి శంభుని శిరంబందుండి శీతాద్రి...సముద్రుం జేరినట్లు రాజ్యలక్ష్మి ఉన్నతులకును ఉన్నతుఁడైన పురూరవునినుండి ఇప్పుడు సముద్రుంబోలె గంభీరుఁడయ్యు పితృవాక్యమును దాఁటని ఆయువును చెందినది.

ప. ౧౨౭. స్వర్నాయకుచే=దేవేంద్రునిచే, పినాకి = ఈశ్వరుని, తనూజుక్=కుమారుని. కుమారస్వామి దేవతల సేనాపతియై తారకాసురుని వధించినకథ ననుసంధించుకొనవలయును.

పాకశాసనుఁడు=దేవేంద్రుఁడు, మఘవంతుఁడు.

ప. ౧౨౦. పరస్పర విద్వేషిణులకు = ఒకరొకరిని ద్వేషించుకొనువారికి, ఏక సంశ్రయమునందు=ఒకరిని ఆశ్రయించియుండుటయందు.

ప. ౧౨౧. నందింత్రుగాతమెల్ల ధరిత్రిక్=ప్రపంచమునం దంతయు సంతోషింతురుగావుత.

భరతవాక్యము=నటుఁడు చెప్పునట్టి (మంగళ) వాక్యము.

# ఇందలి సూక్తులు.



1 చంద్రునివలన అమృతమన్న ఆశ్చర్యమేమి ?

2 గర్వము లేమి విక్రమాలంకారము.

3 అతిస్నేహముచేత కార్యమార్గము తోచును.

4 తొలుత మబ్బుబారున్ను తర్వాత మెఱుపుతీగానున్ను.

5 తప్తముగు నిమ్మసుఘటంబు తప్తమునకు.

6 దొంగసొత్తుతో దొరకిన దొంగకు ప్రతివచనం ఉంటుందా ?

7 పిశాచంకూడా భోజనంచేత ఆశ్వసిల్లుతుంది.

8 కళ్లు కలిగినవాఁడు ఎదుట దీపశిఖను ఓర్వలేఁడు.

9 ఇంద్రియములు కానున్నదానిని అనుసరించునవి.

10 ఉదరపరాయణునికి ఎల్లయెడలను తిండిమీఁదనే లోకము.

11 ప్రేముడి ఒరులపాలయినప్పుడు నాగరకులు అధికంగా దాక్షిణ్యం చూపుతారు.

12 మంచిమాటను నిరాకరించగూడదు.

13 చెయ్యి తెగిన చెంబడివాడు చేప తప్పించుకొనిపోగా 'ఇందువల్ల నాకు ధర్మంకలుగుతుంది' అని చెప్తాడు,

14 ఈప్సితలాభ మనఁగా విరుద్ధములు పెరుగుట.

15 మిక్కుటమైన ప్రేమకు సహన ముండదు.

16 విధికి అసాధ్యము లేదు.

17 వీతరాగులకుకూడా మేఘోదయము ఉత్కంఠను కలిగిస్తుంది.

18 ఆకృతివిశేషములు చిరకాలము దుఃఖభాజనములు కానేరవు.

19 దైవము విపరీతమైనవారికి దుఃఖము వెంట దుఃఖము సంభ
వించును.

20 రాజు కాలమునకు కారణము.

21 ప్రియతములయందెటను నపేక్షితములు.
ప్రభుతభావస్ఖలితములు భామినులకు.

22 తనపనికిమున్నె కృతి చెలిపనిని జేయు.

23 ఏకాంశము కనఁబడుచో
నీకొనియభియుక్తమెల్ల నియ్యనవలయున్,

24 అనిర్విణ్ణతచే శ్రేయస్సులు కలుగును.

25 దేవతారహస్యములు ఎవరు తర్కించగలరు.

26 మేటివృషభము మోచినభారమును లేఁత కోడెమీఁద మోపుట
తగవుగాదు.

27 వలదు వయస్సు, పుట్టుకనె వర్ధిల్లుత్మ కృతిక్షమంబగున్.

28 దశావిపర్యాసము పరిభవాస్పదము.

# ప్రథమముద్రణవిజ్ఞప్తి.



కడచినసంవత్సరము జూలై మొదలు ఆముక్తమాల్యదకు తత్పూర్వలిఖితావశిష్టమైన టీకను వ్రాయుచుంటిని. అది నవంబరులో సమాప్తిం జెందినది. అందులకైన పరిక్లేశమువలన అనారోగ్యము పైకొనినది. తత్సహనోపాయముగా డిసెంబరు జనవరి నెలలలో రత్నావళీవిక్రమోర్వశీయములను ఆంధ్రీకరించితిని.

ఆవృత్తాంతమును—పూర్వము మదీయమాళవికకు ముద్రణవ్యయము నొసంగినవారు కావ్యనాటకాదివాఙ్మయరసజ్ఞశిఖామణులు విడవలూరుగ్రామవాస్తవ్యులు పంటకులవతంసులు సదాచారధురంధరులు.

నెల్లూరిలో నిధిపతులు.

**శ్రీయుత - దొడ్ల రామిరెడ్డిగారు.**

విని, అత్యంతప్రీత్యుత్సాహములతో ఏతద్రచనంగూర్చి తమయభినందనముల దెలుపుచు ఏతద్గ్రంథద్వయముద్రణమునకు పర్యాప్తమైనధనమును నాకుం బంపినారు.

శ్రీరామిరెడ్డిగారు 20 ఏండ్లకుముందు విక్రమోర్వశీయము నాంధ్రీకరింపుమని నన్ను హెచ్చరించిరి. వారి యాయాప్సితము నావలన ఇప్పటికి నెఱవేఱినది.

నాదు ప్రజ్ఞారిక్తగ్రంథమునకు ముద్రణార్థము అప్రార్థితముగా తోడ్పడినట్టి యాసరస్వతీసరస్వత్పుత్రీలాలితునికి అత్యంతకృతజ్ఞుడను.

ఆయత్తాకోడండ్రిరువురును శ్రీ రెడ్డిగారికి విద్యకన్న ఐశ్వర్యమును ఐశ్వర్యముకన్న విద్యను పోటీలుమెఱసి యొసంగుచుందురుగాక.

అక్టోబరు, 1921 మదరాసు. **వే. వేంకటరాయశాస్త్రి.**

# విక్రమోర్వశీయమందలి పాత్రములు

## పురుషులు.

* సూత్రధారుఁడు.

* పారిపార్శ్వకుఁడు.

పురూరవుఁడు.— కథానాయకుఁడు.

మాణవకుఁడు.— విదూషకుఁడు.

చిత్రరథుఁడు.— గంధర్వరాజు.

ఆయువు.— పురూరవుని కుమారుఁడు.

నారదుఁడు.— దేవర్షి.

లాతవ్యుఁడు.— కంచుకి.

వైద్యుఁడు.— వైతాళికుఁడు.

పైలుఁడు, గాలవుఁడు.— భరతశిష్యులు.

## స్త్రీలు.

ఊర్వశి.— కథానాయిక.

చిత్రలేఖ, సహజన్య, రంభ, మేనక.— ఊర్వశిసకియలు, అచ్చరలు.

ఔశీనరి.— పురూరవుని పట్టమహిషి.

నిపుణిక.— ఔశీనరి చేటి.

సత్యవతి.— తాపసి। చ్యవనాశ్రమగత.

యవని.— శస్త్రధారిణి.